# శ్రీ నాగేశ్వర
# శతజయంతి సంచిక

ప్లవంగ ఉగాది సంచికను ఆంధ్రపత్రికా స్థాపకులు దేశోద్ధారక శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి శతజయంతిని పురస్కరించుకొని ప్రత్యేక సంచికగా ప్రచురించగలమని లోగడ ప్రకటించే వున్నాము. ఈ సంచిక త్వరలోనే వెలువడనున్నది.

ఈ సంచిక పూర్వపు ఉగాది సంచికలకన్నా విభిన్నంగాను, విశిష్టంగాను వుంటుంది. దీనిలో శ్రీ నాగేశ్వరరావు పంతులుగారు వివిధా పూర్వ విషయాలపై మనన గంభీరంగాను, ఆస్వాద రమణీయంగాను రచించిన పెక్కు వ్యాసాలు, వ్యాఖ్యలు, కొన్ని పుస్తకాలకు వ్రాసిన పీఠికలు, పరిచయాలు, అభిప్రాయాలు ఉంటాయి.

శ్రీ పంతులుగారు వివిధ రంగాలలో చేసిన సేవను, సాధనను, పంతులుగారి వైదుష్యాన్ని అభివర్ణిస్తూ శ్రీ నోరి నరసింహశాస్త్రిగారు సమగ్ర సుందరంగా రచించిన బృహద్వ్యాసం కూడా వుంటుంది.

**300 పుటలతో వుండే ఈ సంచిక వెల రు. 5—00.**

మేనేజరు,
ఆంధ్రపత్రిక.



# జీవన్ టోన్

గవర్నమెంటు రిజిస్టర్డు నెం 218726 Phone No 440206



ముందు తీసుకోవక ముందు | 1 పౌను తీసికొన్న తర్వాత | 2 పౌనులు తీసికొన్న తర్వాత | 3 పౌనులు తీసికొన్న తర్వాత

పత్రికలలో ప్రకటనచేసిన ఔషధాలను సేవించి ఫలితాలను పొందనివారు అనేకులున్నారు. కాని జీవన్ టోన్ను కొనుక్కుని దానిని ఉపయోగించి ప్రయోజనం పొందండి. జీవన్ టోన్ కేవలం వనస్పతి కొవ్వునుంచి తయారుచేయబడినది. జంతువులకొవ్వు చేరుటవల్లనే ఈ అనుకోనటువంటి బలిష్టతకు కారణం అని కొందరు అనుకోవటం పొరపాటు.

**జీవన్ టోన్ గుణములు:** ఎంత మంచి ఆహారము తిన్నా ఎముకలపోగువలె, బలహీనంగా ఉండేవారు కొంతమందిఉన్నారు అట్టివారికి జీవన్ టోన్ మంచి బలాన్ని, లావును, బరువును ఇస్తుంది. ఆకలి లేనివారికి మంచి జీర్ణశక్తినిస్తుంది. ఇది బలహీనత, కాళ్లుచేతులు తేలిపోవుట, తలతిరుగుట, రక్తహీనతలను పోగొట్టి, పరిపూర్ణమైన దేహారోగ్యాన్ని, పుష్టిని ఇస్తుంది. శరీరం ఎరుపుఛాయ పొందటానికి జీవన్ టోన్తో టొమాటోలు తీసుకొనండి. ఆరోగ్యవంతులకు కూడ జీవన్ టోన్ మంచిది. జీవన్ టోన్ తీసుకొన్నప్పుడు మీరు కొంత శరీరవ్యాయామం చెయ్యటం అవసరం. లేకపోతే మీ శరీరం అనవసరంగా లావెక్కుతుంది కావలసిన బరువు, బలిష్టత చేరినవెంటనే జీవన్ టోన్ సేవించడం నిలపడం మంచిది. స్థూలకాయులు జీవన్ టోన్ తీసుకొనుట మంచిదికాదు. అట్టివారు జీవన్ టోన్ తీసుకుంటే మేము బాధ్యులంకాము. స్త్రీలు బహిష్టుకాలంలో తీసుకోవ కూడదు. ఇతర వివరాలు మందుతో పంపబడతాయి వెల: 454 గ్రాములు రూ. 10/- (పోస్టు ఛార్జీలు అదనం)

**స్కిన్ క్రీమ్స్** యవ్వనసౌందర్యం కలిగియుండటం వరప్రసాదం. స్కిన్ క్రీమ్స్ మీ చర్మాన్ని, మొటిమలు, స్ఫోటకపు మచ్చలు, వివర్ణత, కోతలు, శోభినుంచి కాపాడుతుంది స్కిన్ క్రీమ్స్ ముఖమందలి మడ్డి తొలగించిన తరువాత వాడవలయును మీరు ఏ స్నోనుగాని, పౌడరునుగాని వాడవచ్చును. స్కిన్ క్రీమ్స్ ఒక కోర్సు రు 12/-

**JOTHI HOSPITAL,** POST BOX No 1413 32, VENKATANARAYANA ROAD, MADRAS-17.

స్థానిక డాక్టరు డాక్టర్ దామోదరం, M A IADS



విక్రమ్ ప్రొడక్షన్స్ వారి

# వసంతసేన

ఈస్ట్‌మన్ కలర్

సంగీతం
యస్. రాజేశ్వరరావు

నిర్మాత - దర్శకుడు
బి. యస్. రంగా

పవాయిగా

# ఉత్తరాలు

## క థ లు

ఈ సంచిక చూచిన తరువాత వ్రాయకుండా ఉండలేకపోతున్నాను. రచయిత్రి శారదగారు రచించిన 'నిన్నే ప్రేమించా...' కథ చాల బావుంది.

సయ్యద్ ముంతాజ్‌బేగం (గుంతకల్)

* * *

"తిరుగులేని నిశ్చయం" కథ చాలా బాగుంది. మానవుని సహజమైన మనస్తత్వాన్ని ఇతివృత్తంగా తీసుకొని, చిత్రించిన, ఈకథా రచయిత శ్రీ పాలడుగు వెంకటేశ్వరరావుగారు చాలా అభినందనీయులు. శారీరక లోపంవలన, మానవునిలో కలిగిన సంచలనమే రాధాకృష్ణలో లలితతో వివాహాన్ని తిరుగులేని నిశ్చయంగా మార్చింది. మానవుడు తనకున్న బాధలను ఎదుటి వారిలో చూసినపుడు తన సహజమైన జాలిని, దయని చూపించి, సాటి మానవుని కష్ట సుఖాలలో సహాయపడ్డానికి ముందడుగు వేస్తాడన్న సత్యాన్ని రచయిత సహజంగా చిత్రించారు.

— వి. ఎస్. ఎన్ మూర్తి (కొత్తగూడెం)

## సీరియల్స్

వారం వారం మీ పత్రికలో ప్రచురితమయ్యే కథానికలు చాలా ఆకర్షణీయంగా యున్నాయి. ముఖ్యంగా కన్నుల చెమ్మగిల్లే సన్నివేశాలు, హృదయము ద్రవించే సంభాషణలు, నిత్య సత్య జీవి పడే అగచాట్లు, కుత్సితుల కుతంత్రాలు, ఒక టేమిటి భగవత్సృష్టిలోని మంచి చెడూ సమపాళ్ళలో మేళవించి వ్రాసిన "పూర్వా సంధ్యా ప్రవర్తతే" సీరియల్ చాలా హృదయరంజకంగా యున్నది.

— మంగతాయమ్మ (హైదరాబాదు)

## వ్యాసాలు

28—7—67 సంచికలో మీరు ప్రచురించిన శ్రీమతి పరిమళా సోమేశ్వర్‌గారి "ఉద్యోగినుల సమస్యలు" అన్న వ్యాసం చదివాక ఆ వ్యాసాన్ని చాలా ఆవేశంలో వ్రాశారేమో అని పిస్తోంది. నిజానికి ఈ నాడు స్త్రీ కొన్ని సమస్యల్ని ఎదుర్కొంటున్నదన్న సంగతి ఎవ్వరూ కాదనలేరు. కానీ అందుకు పురుషుడే కారణం అనడం కేవలం అవివేకం అనక తప్పదు. స్త్రీ సమస్యలకు కొంత మంది స్త్రీలే కారణమేమో? భార్యా భర్తలిద్దరూ ఉద్యోగాలు చేసుకొంటున్నా, వీలయినంత వరకు తమ పనిని తామే ఏదోరకంగా సంతోషంగా చేసుకొంటున్న సంసారాలు ఎన్నో వున్నాయన్న సంగతి రచయిత్రి గమనించలి. భార్యల్ని నిర్లక్ష్యం చేసే భర్తల్ని గురించి వ్రాశారేగాని, తామూ ఉద్యోగం చేస్తున్నామన్న అహంతో భర్తల్ని నిర్లక్ష్యము చేసే భార్యల్ని గురించి రచయిత్రి ప్రస్తావించలేదు. అలాగే రిక్షావాళ్ళ పనిమనుష్యులు, ఉద్యోగం చేస్తున్న భార్యాభర్తల్ని చూస్తే పైసలు ఎక్కువడుగుతారన్నది కూడా చాలా వింతగావుంది. వాస్తవానికి యిదొకరకమైన న్యూనతాభావం అని చెప్పక తప్పదు. కాపోతే భార్యాభర్తలు (యిద్దరు మనుష్యులు) ఎక్కుతున్నారుకదా అని రిక్షావాడు పైసలు ఎక్కువడగవచ్చు. భార్యా భర్త లిద్దరూ ఉద్యోగానికి పోయి తమ నెత్తిన పనెక్కువ పారేస్తారేమో అని పనిమనుష్యులు ఎక్కువ అడుగుతూ వుండొచ్చు. పెరిగిపోతున్న జీవన వ్యయాన్ని దృష్టిలో వుంచుకొని యీ విషయాలు ఆలోచించడం సముచితం.

"నర్సరీ" లను స్థాపించాలన్న రచయిత్రి సూచన గుర్తించదగినది.

— మంధా గురుమూర్తి (గుంటూరు)


# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 25—8—'67
ప్లవంగనామ సం॥ శ్రావణ మాసం బ॥ పంచమి
సంపుటము : 59 సంచిక : 50

స్థాపితము:
1908

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు:
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 22 40 |
| 6 మాసముల చందా | 11.20 |
| 3 మాసముల చందా | 5.60 |

ఇతరదేశాలకు
ఓడమీద (Sea Mail)

| | |
|---|---|
| సంవత్సర చందా | 42.00 |
| అర్థసంవత్సర చందా | 21.00 |


## విషయానుక్రమణిక


ముఖచిత్రం : 'నవయువతి'లో జయలలిత

కథలు :

పరివృతం (గొలుసు కథ) — 24
వర్షించని మేఘాలు — 48

సీరియల్ నవలలు:

పూర్వాసంధ్యా ప్రవర్తతే... — 40
మట్టిబొమ్మలు — 56

శీర్షికలు, వ్యాసాలు, సినిమా:

ఉత్తరాలు — 4, ఉమెన్ కార్టూన్ — 5, న్యూఢిల్లీ లేఖ — 6, లోకంపోకడ — 7, లివ్ అండ్ లెట్‌డయ్ — 8, అధ్యక్షుని మరణం — 10, ప్రశ్నావళి — 14 ధర్మపథం — 16, శాసనసభ వనితామణులు, డాక్టర్ కబుర్లు—17, పుష్టికరమైన ఆహారం—18, వంటలు — 20, అభియోగాలలో వింతలు—21, మునిమనుమడి మేధాప్రదర్శనం-23, బొమ్మలు-32, బికనీర్ రాకుమారి రాజ్యశ్రీ-34, మెదడుకిమేత — 36, బాలసాహితి — 37, అరవిందస్వామి — 38, వారఫలం — 60, ఒకవారం విపరీతం — 61, చిత్రలహరి — 62.


కల్తీ
నీ ముఖంమీద లిప్‌స్టిక్ ముద్రవుంది
పాకిస్తాన్
రష్యా పాకిస్తాన్‌కు ఇచ్చిన హెలికాప్టర్ల వివరాలను భారతదేశం అడిగింది
పొదిగే తరుణం
అరాజకం
అరాజకం
బెంగాల్ మంత్రివర్గం
కేరళ మంత్రివర్గం
ఆర్థిక మాంద్యం
పట్టుకోగలిగితే నన్ను పట్టుకో చూద్దాం!
మొరార్జీ చికిత్సలు

# హిందీ దురభిమానుల బెదిరింపులు

మొదట ప్రధానమంత్రి పండిట్ నెహ్రూగారు హిందీయేతర రాష్ట్రాలను సమాధానపరుస్తూ ఆయన బ్రతికున్న రోజుల్లో ఒక హామీ యిచ్చారు. ఇప్పుడున్న పార్లమెంటుకు సంబంధించిన శాసనసభ వ్యవహారాలు అన్నీ యిన్నీ కాదు. అవన్నీ చక్కబెట్టుకోవడంలో, ఎప్పుడో ఏనాటి పూర్వ ప్రధానో ఇచ్చిన వాగ్దానాన్ని చర్చించడానికి సమయం చాలలేదు. ఆగస్టు 11 శుక్రవారంతో 'బడ్జెట్ సెషన్' పరిసమాప్తమైపోతుంది. భాషా సమస్యకు ఒక రూపం ఏర్పడకపోవడంతో శ్రీమతి గాంధీగారి కాళ్లూ చేతులూ చల్లబడ్డాయి. హిందీ వాదులు ఆమె వేసిన 'జోకుర్ని' ఆయుధంగా చేసుకుని ఆమెనే భయపెట్టసాగారు.

భాషకు సంబంధించిన బిల్లును ఒక ప్రక్కగా నెట్టేశారు. మళ్లీ అది వెలుగులోకి రాకపోవచ్చును. హిందీయేతర నాయకుల్లో చలనం కనిపించడంలేదు. శ్రీ టి. సేన్‌గారి సూత్రం అందరివీాద స్వారీ చేయడానికి సిద్ధంగా వుంది. ఇరవయ్యవ భారత స్వాతంత్ర్య దినోత్సవంనాడు శ్రీ సేన్ గారు జాతీయ విద్యావిధానమనబడే వారి అభిప్రాయాన్ని వెలిబుచ్చుతారు. ఈ అభిప్రాయం కొద్దిరోజుల్లోనో, లేకపోతే కొద్ది సంవత్సరాల్లోనో భారతదేశాన్ని ఛిన్నాభిన్నం చేయనుంది. భారతదేశమనబడే కాంగ్రెసు రాజ్యాన్ని పరిపాలించమని శ్రీయుత కామరాజుగారు శ్రీమతి గాంధీని ప్రధానమంత్రిగా నియోగించారు. అక్టోబరు రెండవ తేదీన మహాత్మాగాంధీగారి జన్మదినోత్సవం జరుపుకోనున్నాము. ఆయనకు పండిట్ జవహర్లాల్ నెహ్రూ, సర్దార్ పటేల్—ఇద్దరూ రెండు మూలస్తంభాలు. ఈ ఇద్దరూ ఒకే జెండా కింద, ఒకే పార్టీ విధానం కింద, భారతదేశాన్ని ఒకే ఒక్క దానిగా నిర్మించారు! ఇరవయ్యేళ్ల తర్వాత జెండా ఒక్కటే నిలబడింది. తగ్గుముఖంలో కాంగ్రెసుపార్టీ కూడా ఒంటికాలి మీద నుంచుంది. అలానే భారతదేశం!

సంయుక్త రాష్ట్రాల సచివాలయంలో భౌగోళికంగా ఆలోచించి ఉద్యోగాలను పంచిపెట్టాలని భారతదేశ ప్రభుత్వం సూచించిందని మన దేశీయాంగమంత్రిగారు పార్లమెంటుకు చెప్పారు.

భారత ప్రభుత్వ సచివాలయమూ సంయుక్త రాష్ట్రాల భారతదేశంగా తయారయింది. ఇక్కడ కూడా అన్ని రాష్ట్రాలకూ హక్కు వుంది. ఉద్యోగాలన్నీ పంచిపెట్టవలసి వుంది. కార్యదర్శుల స్థాయిలో మాత్రమే కాకుండా మూడో తరగతి గుమస్తాల స్థాయిలో కూడా అన్ని రాష్ట్రాలకూ సరిసమానంగా ఉద్యోగాలను పంచిపెడుతున్నారు! ఇది ప్రకటన. ఇప్పుడిప్పుడు హిందీయేతర ప్రాంతాల నుంచి వచ్చిన జాతి మాయమైపోతూ వుంది. భారతదేశాన్ని పంజాబీలు, చప్రాసీలు పరిపాలిస్తున్నారు! తర్వాత మెజారిటీ హిమాచల ప్రదేశ్‌ది. కాగితం మీాద చూసినప్పుడు దాని మీాద ఎటువంటి భేదాభిప్రాయాలు కనిపించవు. పనిచేయడంలో చూస్తే, ముసల్మానుల్ని, క్రయిస్తవుల్ని వేళ్లమీాద లెక్కించవచ్చు. 1912 తర్వాత బెంగాలీలు మాయమైపోయారు. కొద్దిమంది మాత్రమే మొదటి తరగతి పదవుల్ని నిర్వహిస్తున్నారు. మంత్రుల హోదాలో కావలసినంత మంది బీహారు మంత్రులు. వారందరికీ బీహారు నుంచి వచ్చిన ఆఫీసర్లు ఋణపడి వుంటారు. ఒరిస్సా, అస్సాము ప్రాంతాలకు చెందినవారు ఎవరూ లేకపోవడంతో వారికి ఒక విధమైన గౌరవాన్ని ప్రసాదించారు! పని చేయడం, ఉద్యోగాల్ని నిర్వహించడం మీద ఆంధ్రులకు అంతగా నమ్మకం ఉండదు! వేళ్ళమీద లెక్కించతగ్గ ఆఫీసర్లు మాత్రమే వీరిలో ఉన్నారు. ఇద్దరు ముగ్గురు గుజరాతీలు మట్టుకు మనకు కనిపిస్తారు. అందుకు కారణం వేరే వుంది. గుజరాతీల్లో ఉద్యోగాలకు ఎగబడేవారు చాలతక్కువ. వ్యాపారంలో గిట్టుబాటయినంతగా ఉద్యోగంలో గిట్టుబాటుకాదు మరి. కొద్దిమంది మహారాష్ట్రులు ఉన్నారు. అరవల సంఖ్యా, మలయాళీవారి సంఖ్యా అధికమే. హిందీ 'బుల్‌డోజర్లు' వారిని గెంటేస్తున్నాయి! ప్రాంతీయ విధానం వారి మార్గాల్ని పూర్తిగా నిరోధించింది. పది సంవత్సరాల్లో భారతదేశం సోషలిస్టు ప్రజాస్వామ్యాన్ని స్థాపిస్తుంది! శ్రీమతి గాంధీ మార్కు జాతీయభావం నిలబడుతుంది. జయ్‌హింద్!

* * *

ఇది బిర్లా వారి తరఫున చెప్పడం కాదుగాని, కొన్ని యదార్థాల్ని బయటపెట్టవలసి వుంటుంది.

మన రాజధాని ఢిల్లీలో కాంగ్రెసు కార్యకలాపాలను నిర్వహించడానికి ఒకప్పుడు బిర్లావారు పెట్టుబడి పెడుతుండేవారు. పాతఢిల్లీలోని బిర్లా భవనం, తర్వాత కొత్త ఢిల్లీలోని బిర్లా భవనం, కాంగ్రెసు నాయకులకు 'ధర్మశాల'గా వుండేది. మహాత్మా గాంధీ, బాబూ రాజేంద్రప్రసాద్, సర్దార్ వల్లభాయ్ పటేల్, పండిట్ జి.బి. పంత్ గారలు ఆ ధర్మశాలలో వుంటూ వుండేవారు. బిర్లావారు ప్రముఖమైన వణిక కుటుంబానికి చెందినవారు. వారు కాంగ్రెసుకు పెట్టుబడి పెట్టారూ అంటే పట్టి వృథాగా కాదు. అందులో ఎంతో దూర దృష్టి వుంది. వారి పెట్టుబడికి కనీసం ఒక వేయి శాతమయినా లాభం గిడుతుందని అంచనా వేసుకున్నారు. మెస్సర్స్ క్రిష్ణమీనన్, ఆర్. కె. నెహ్రూ, పదవీ విరమణ చేసిన అయి. సి. యస్. ఆఫీసరు జనరల్ కపుల్ కలిసి అటువంటి పెట్టుబడినే పండిట్ నెహ్రూగారిమీద పెట్టారు. పండిట్ నెహ్రూగారికి లండన్‌లో 'డబ్బాగారు' శ్రీ క్రిష్ణమీనన్. లిన్ లిత్ గో ప్రభుత్వంలో జాయింటు సెక్రటరీగా వున్న ఆర్. కె. నెహ్రూగారు 1947 కి ముందు ఆయన నెహ్రూగారి అతిథి. జనరల్ కపుల్ గారు స్వీయ చరిత్రను చెప్పుకోవే చెప్పుకున్నారు. బిర్లావారు పారిశ్రామిక లైసెన్సుల్ని సంపాదించుకున్న విధంగా, శ్రీయుత క్రిష్ణమీనన్ లండన్‌లో భారతదేశ హయ్ కమిషనర్ పదవిని నిర్వహించారు. తర్వాత

విదేశీవ్యవహారాలను చూస్తూ రక్షణమంత్రిగా కొత్త ఢిల్లీలో స్థానం సంపాయించుకున్నారు అటూ ఇటూ తిరిగిన ఆర్ కె నెహ్రూగారు ఈజిప్టులోను, స్కాండినేవియాలోను భారతదేశ రాయబారిగా కొంతకాలం ఉన్నారు తర్వాత సెక్రెటరీ జనరల్ అయ్యారు ఇప్పుడాయన అలహాబాద్ విశ్వవిద్యాలయంలో వైస్ ఛాన్సలరుగా వుంటున్నారు ఈ మహాశయుడు ఎంతోమంది హేమా హేమీల తలలమీదనుంచి నడిచి వెళ్లి పెద్ద పెద్ద పదవుల్ని నిర్వహించారు దానికి కారణాలున్నాయి ఆయన కాశ్మీరీవాడు నెహ్రూ వంశంలోవాడు బ్రిటిషువారి కాలంలో జె యల్ నెహ్రూగారికి న్యూఢిల్లీలో అతిథిగా వున్నవాడు అందుకు ఆయనకు అంత ఘనత !

జనరల్ కవుల్ కథ ఎంతో ఇంపయిన కథ ఏ పటాలానికీ నాయకుడుగా వుండకుండా ఆయన జనరల్ అయిపోయారు! పండిట్ నెహ్రూగారని పిలువబడే మరొక కవుల్ గారు నెపోలియన్ అంతటి సాహసవంతునితోను, మార్షల్ నీ అంతటి ధయిర్యవంతునితోను పోల్చుకుని రొమ్ము విరుచుకున్నారు !

* * *

విదేశీవిధానం మీద నిశ్చయమయిన అభిప్రాయాన్నిబట్టి ఒకదేశంయొక్క స్నేహాను రక్తి ఆధారపడి వుంటుంది ఇస్రయేలుకి— దాని పొరుగురాజ్యానికి జరుగుతున్న పోరాటం మీద అమెరికా రష్యాల వైఖరి ఇందుకు నిదర్శనమై వుంది

ఇక్కడ ఒక ప్రశ్నవేయవలసి వుంటుంది భారతదేశం అరబ్ ప్రజల్ని, నాసర్ ని సమర్థిస్తూ వుంది అందులో భారతదేశానికి ఎంత ప్రయోజనం ఉన్నట్టు? భారతదేశం మీదకు మళ్లీ కాశ్మీరు దాడిచేయడానికి వస్తే అరబ్ రాజ్యాలు సహాయం చేయడానికి వస్తామన్నాయా? లేదు పర్యవసానంగా ఇరాన్ టర్కీ, పాకిస్తాన్లు మూడు కలిసి అరబ్బులతో చేతులు కలిపాయి!

మన విదేశీ కార్యాలయం, తన మాతృదేశంపైన ఎంత శ్రద్ధతో పని చేసిందో, ఎంత అనూయతో పని చేసిందో ఇందువల్ల మనకు ద్యోతకమవుతుంది సూయెజ్ కాలువను మూసివేయడం వల్ల యునయిటెడ్ అరబ్ రిపబ్లిక్ ఎంతగా నష్టపోయిందో పరిశీలించింది ఈ కార్యాలయం ఈ మంత్రిత్వశాఖ, లేదా ఏ మంత్రిత్వశాఖ అయినా సరే, సూయెజ్ కాలువ మూత ద్వారా భారత దేశానికి ఎంతనష్టం కలిగిందో తెలియ చెప్పారా? ఈజిప్టుకి అవతలా ఇవతలా సూయెజ్ కాలవలో ఓడలు ఆగిపోయి, భారత దేశానికి రావలసిన ఆహారధాన్యాలు రాక, బీహారులోను తదితర ప్రాంతాల్లోను ప్రజలు ఎంతగా మాడి పోతున్నారో ఎవరైనా తెలుసుకున్నారా? అందువల్ల ఎంతనష్టమో అంచనా వేశారా అసలు? అక్కడ నుంచి ఓడల్ని మళ్లించి మరో మార్గంలో భారత దేశానికి తీసుకురావడానికి / వంద కోట్లు ఎక్కువ ఛార్జి అవుతుంది. ఎంతో కాలయాపన జరుగుతుంది.

1967 చివరి వరకు సూయెజ్ కాలువ మూసి వుంచడానికి అవకాశం వుంది ఈలోపుల కొన్ని వందలకోట్ల ధనాన్ని భారత దేశం నీళ్లపాలు చేస్తుందన్నమాట! ఈ విషయాన్ని ఎవరూ ప్రస్తావించలేదు చెప్పొచ్చేదల్లా ఒక్కటే ఒకటి. అది, అరబ్ రాజ్యాలతో వున్న వ్యాపార సంబంధాల్ని భారత దేశం పెంపుచేసుకుంటుందీ అని. ఈ వ్యాపారం - యూరప్ నుంచి, అమెరికా నుంచి అయ్యే దిగుమతులకి సరితూగుతుందా? ఎప్పటికీ లేదు. మనకయ్యే అదనపు వృధా ఖర్చును భర్తీ చేస్తుందేమో చూద్దాం! ●

## లోకం పోకడ

— శ్రీ బుల్గానిన్, శ్రీ క్రుశ్చేవ్ భారత దేశానికి వచ్చినప్పుడు శ్రీ నెహ్రూగారికి స్వాగతం చెప్పేందుకు విమానాశ్రయానికి వెళ్లారు సోవియట్ ప్రముఖులతో వెనక్కి తిరిగి వస్తూ ఉండగా శ్రీ క్రుశ్చేవ్ దారి వెంబడే ఎందరో భారతీయులు గొంతుక్కూర్చుని ఉండటం గమనించారు

ఈ భారతీయులు అలా కూర్చుని ఏమి చేస్తున్నారని శ్రీ క్రుశ్చేవ్ శ్రీ నెహ్రూని అడిగారు శ్రీ నెహ్రూ, క్షమకోరే గతిలో, భారతదేశంలో తగినన్ని పాయిఖానాలు లేవనీ, జనాభా వేగంగా పెరిగిపోతోందనీ రహదార్ల వెంబడి మలవిసర్జన చెయ్యటం జాతీయ వ్యసనం అయిపోయిందనీ విడమరిచి చెప్పారు

శ్రీ క్రుశ్చేవ్ తల ఆడిస్తూ, "ఇది రష్యాలో ఎన్నటికీ జరగదు" అన్నారు

కొంతకాలం తర్వాత శ్రీ నెహ్రూ అధికారయుతంగా రష్యా పర్యటించారు మాస్కో విమానాశ్రయంలో భారతప్రధాని విమానం దిగుతూ ఉండగా బుల్గానిన్, క్రుశ్చేవ్లు ఆయనకి స్వాగతం చెప్పారు అందరూ మాస్కో విమానాశ్రయంనుంచి మాస్కో నగరానికి వెళ్లేదారివెంబడే కారులో వెళ్లారు శ్రీ నెహ్రూ తాము వెళ్లేదారిని గమనిస్తూ ఉన్నారు ఇంతలో ఆయన సూక్ష్మదృష్టికి మనదేశంలో మనుష్యులు కూర్చునే పద్ధతిలోనే కూర్చుని ఉన్న ఒకమనిషి కనిపించాడు. నవ్వు ముఖంతో శ్రీ క్రుశ్చేవ్తో అన్నారు "ఇది మీ దేశంలో ఎన్నటికీ జరగదన్నారు '

శ్రీ క్రుశ్చేవ్ చాలా ఇబ్బంది పడ్డారు కార్లవరసని ఆపించి పోలీసు ముఖ్యాధికారి కోసం కబురుచేశారు ఆయన వీరి వెనక కారులోనే ఉన్నారు అక్కడే, "ఆ మనిషిని కాల్చెయ్యాలి!" అనే ఆర్డరు ఇచ్చారు శ్రీ క్రుశ్చేవ్

మాస్కో పోలీసుకమీషనరు తన 'సుప్రెమో' ఆజ్ఞ అర్థం అయిందని సూచించటానికి సెల్యూట్ చేసి, పిస్టల్ చేతపట్టుకుని ఆ వ్యక్తి కూర్చుని ఉన్న చోటికి వెళ్లారు ఆజ్ఞ భర్తీ అయ్యేటానికి కార్లన్నీ ఆగి ఉన్నాయి కొన్ని నిముషాలలో మాస్కో పోలీసు కమీషనర్ తిరిగివచ్చి తాను ఆ ఆజ్ఞ ప్రకారం నడుచుకోవటానికి వీలులేకుండా ఉందని శ్రీ క్రుశ్చేవ్తో చెప్పారు

శ్రీ క్రుశ్చేవ్కి ఆగ్రహం వచ్చింది, భారత ప్రధాని సమక్షంలో ఇచ్చిన ఆజ్ఞని తన పోలీసు కమీషనర్ ధిక్కరించటమా ?

'ఏమిటి మీ ఉద్దేశం?'' అని చురచురలాడారు

కూర్చున్న మనిషి రాయబారవర్గంవాడు కాబట్టి శిక్షవెయ్యటానికి వీలులేదని పోలీసు కమీషనరు అన్నారు అంతేకాక, "సార్, ఆయన భారతదేశం రాయబారి,'' అని తెలియపరిచాడు

కార్లు ముందుకి సాగిపోయాయి

12—8—1967 కరెంట్ పత్రిక




''ఇదన్నమాట మీరు లీటర్‌కి చేసినపని-- ఈ తలుపులోంచి తోసేశారన్నమాట''

''షార్క్‌లు తినేముందు బయటికి లాగేశాము, లిమీ! నన్నూలాగు— ఏం చెయ్యమంటే అది చేస్తాను!''

''సోలిటెయిర్ సంగతేమిటి?''

పెద్దాయనే తన్నుకుపోయాడు కాని మేము ఆమె కేమీ చెయ్యలేదు—




''తెలిసిందంతా చెప్పాను లిమీ, ఇక నన్ను ఈ నరకంలోంచి బయటికి లాగు''

కాని నేను సోలిటెయిర్ నిర్బంధం, ఫెలిక్స్ తప్పించుకున్న ప్రాణాపాయం— వీటిని గురించి ఆలోచించాను మిస్టర్ బిగ్ అనుచరుడిమీద జాలి పడే సమయం కాదు ఇది

''ఆ...ఆ...ఆ...!''




గజదొంగ చచ్చిపోయాడు— ఇక జమయికా వెళ్లాలి మిస్టర్ బిగ్‌తో ఖాతా సంగతి చూడాలి. సోలిటెయిర్‌ని వెతికి పట్టుకోవాలి.

విమానం తుపానులో ఇరుక్కుంది తుపాకి తొందరగా కాల్చగలిగినంత మాత్రాన గట్టివాడనుకోవటం పొరపాటు అనిపించింది.

కారిబ్బియన్ ప్రాంతం ముఖ్యగూఢచారి స్ట్రేంజ్‌వేస్ నన్ను కలుసుకున్నాడు వింతకథ చెప్పాడు ...




"దాన్ని ఆశ్చర్యాల ద్వీపం అంటారు ఎవరో 'జట్టు'గా కలిసి కొన్నారుట ఇక్కడినుంచి కొన్ని చేపని ఎగుమతి చేస్తారుట!"

"కాప్టెన్ మోర్గాన్ నిధిని కూడా!"

"ఇక్కడివారు దాని జోలికి వెళ్లరు."

ఒక జాలరి అక్కడి నిధికోసం ఈది వెళ్లాడు లంక మీది డప్పులు మోగుతూ ఉండగా సొర చేపలు తిన్నాయి అతన్ని




మిస్టర్ బిగ్ ఒకవేళ ఆ ద్వీపాన్ని జలాంతర్గామి స్థావరంగా వాడుతున్నాడేమో అనే అనుమానం మీద అధికారులు స్ట్రేంజ్ వేస్‌ని తనిఖీ చెయ్యమన్నారు

ఇద్దరు నావికదళం ఈతగాళ్లని పంపారు ఆశ్చర్యాల ద్వీపం మీద డప్పులు మోగాయి— ఇద్దరినీ సొర చేపలు తిన్నాయి

అంటే నేనే ఆ భయంకర ద్వీపానికి వెళ్లాలన్న మాట

"అమెరికన్లు యుద్ధ సమయంలో పసిఫిక్ సముద్రంలో వాడిన సొరచేపలని తరమగొట్టే మందు నాకు కొంత కావాలి ఒక 'లింపెట్ మయిన్' కూడా ఇవ్వండి మిస్టర్ బిగ్ నావ చివరి ప్రయాణం చేసిందని ఆశిస్తున్నాను......"




స్ట్రేంజ్‌వేస్ నాకు బీచిమీదవే ఆశ్చర్యాల ద్వీపం కనిపించేట్లున్న ఇల్లు ఒకటి కుదిర్చాడు.

కేమాన్ ద్వీపం వాడయిన 'క్వారెల్' అనే అతన్ని కూడా ఇచ్చాడు ఇతను కొన్ని నెలలుగా ద్వీపాన్ని గమనిస్తూ ఉన్నాడు.

వారం రోజులు మంచి కసరత్తు చేశాను— ఇంతలో సాలిటెయిర్ గురించి వార్త ఒకటి వచ్చింది.

(ఇంకా ఉంది)

విలియం మాంచెస్టర్

# అధ్యక్షుని మరణం

## 12

జాక్ వాలంటీ ఎయిర్ ఫోర్స్ నెంబర్ వన్ లోని పెద్దగది ప్రవేశించేసరికి కొత్త అధ్యక్షుడు జాన్సన్ తోసహా అందరూ టెలివిషన్ చూస్తున్నారు వారందరూ అప్పుడు జరిగే నాటకంలో ముఖ్యపాత్రధారులే కాని ఎవరూ పరిస్థితి మొత్తాన్ని అర్థం చేసుకునే స్థితిలోలేరు ఎంతోకాలం తర్వాత జరిగినదానిని గుర్తుతెచ్చుకుంటూ ఒక్కొక్క విషయం విలువని అర్థంచేసుకోగలిగారు

కొన్ని సందర్భాలలో ఈపని ఎప్పటికప్పుడే చెయ్యటం అవసరం ఇది రహస్య రక్షకదళం పని కెన్నెడీ హత్య గనుక వాషింగ్టన్ లో అన్ని సౌకర్యాలూ ఉన్నచోట జరిగినట్లయితే ఒరగవలసినదంతా సక్రమంగా జరిగిపోయేది డల్లాస్ సంగతే వేరు ఆ సమయంలో గనుక డల్లాస్ ని ముట్టడిచేస్తే (మాజీ ఉపాధ్యక్షుడు, ప్రస్తుతం అధ్యక్షుడు, ఆయన పరివారం కన్నా న్యూయార్క్ వార్తా సంస్థలకే ఆ విషయం ముందు తెలిసేదేమో !

అయితే, టెలివిషన్ చూస్తున్న జాన్సన్ కి కొత్తవార్త ఏదీ తెలియలేదు 'ఫరవాలేదు,' అనుకున్నాడు అతను అనుకున్నాడేకాని మరి కొన్ని సంఘటనలు కూడా జరుగుతున్నాయని అధ్యక్షుడికి తెలియదు

జాన్సన్, అతని పరివారం విమానం ఎక్కటానికి ఇరవయి నిముషాల ముందు జె డి టిప్పిట్ అనే పోలీసువాడిని ఎవరో టెక్సాస్ స్కూల్ బుక్ డిపాసిటరీ నుంచి కాల్చి చంపేశారు అతని మరణంలోని అంతరార్థం గురించి అనుమానం కలగటానికి మరొక నలభయి నిముషాలు పట్టింది అధ్యక్షుడి హత్యకీ, దీనికీ సంబంధం ఉన్నట్లయితే త్వరలో కుట్ర నిజస్వరూపం బయటపడుతుంది

అధ్యక్షుడు జాన్సన్ డల్లాస్ వదిలితే ప్రమాదంలోనుంచి బయట పడ్డాడు అతనికి ఈ సంగతి అర్థం అయింది డల్లాస్ వీధులలో ఎండ వెనుక ఎటువంటి చీకట్లూ, వాటితో ఏ ప్రమాదాలూ — జాన్సన్ అనవసరమయిన సాహసాలు మానుకుంటే మంచిదనుకున్నాడు (పది నెలల తర్వాత డల్లాస్ లో ఒక సంస్థ అతన్ని వచ్చి మాట్లాడమని కోరింది అది అధ్యక్షుడి ఎన్నికల సమయం అయినా, జాన్సన్ నిరాకరించాడు వారు నిరాశ చెందారు)

సీక్రెట్ సర్వీస్ ఏజెంట్ రూఫస్ యంగ్స్ బ్లడ్ జాన్సన్ ని నేరుగా వైట్ హౌస్ కి వెళ్లిపొమ్మన్నాడు ఇది రక్షణ కోసం మాత్రమే కాని జాన్సన్, దీని వల్ల వచ్చే మొహమాటాలని ఎదురుచూసి, అంగీకరించలేదు అప్పుడు సమయం 1 43 (మధ్యాహ్నం)

విమానం 26000లో అందరూ తహ తహ లాడుతున్నారు జాన్సన్ ఏమీ తోచక ఊరికే కాఫీలు తాగుతున్నాడు ఇంతలో పార్క్ లాండ్ ఆస్పత్రి నుంచి ఒక సందేశం వచ్చింది మృతదేహంతో బాటే తనూ బయటికి వస్తాననీ, అంతకి ముందు కదలననీ అన్నదిట శ్రీమతి కెన్నెడీ జాన్సన్ వెంటనే ఒక నిర్ణయానికి వచ్చాడు — శవ పేటిక, ఆమె వచ్చిన తర్వాతనే తన విమానం కదులుతుంది

ఆ విమానంలో అందరికీ విపరీతంగా ఉక్కపోస్తోంది ఒక్క శ్రీమతి జాన్సన్ కి మాత్రం ఆందోళనతో శరీరం చల్లబడింది భర్త ముగ్గురు శాసనసభ్యులతో ప్రమాణ స్వీకారం గురించి చర్చించటం విన్నది తన అభిప్రాయం వెలిబుచ్చకుండా వారివి సేకరిస్తున్నాడు అతను జాక్ బ్రూక్స్ అనే అతను ఒకప్పుడు నావిక దళంలో ఉన్నాడు వెంటనే ఆ పని ముగించాలన్నాడు హోమర్ థార్న్ బెరీ సందేహించాడు, 'వాషింగ్టన్ దాకా ఆగుదాము,' అన్నాడు ఆల్బర్ట్ థామస్ ఒప్పుకోలేదు 'విమానం వెళ్లటం ఆలస్యమయితే?' అని అడిగాడు 'మీరు దేశమంతా ఎగురుతూ ఉంటే దేశానికి అధ్యక్షుడు లేకుండా ఎలా?'

జాన్సన్ ఎప్పుడో నిర్ణయానికి వచ్చేసినట్లున్నాడు 'నిజమే, ఇక ప్రమాణం మాటేమిటి?' అన్నాడు థామస్ తో

వాళ్లు తెల్లమొహం వేశారు గొంతుక సవరించుకున్నారు కాలర్లు వదులు చేసుకున్నారు ఈ ప్రశ్నకి వారికి సమాధానం తెలియదు ఏవిధంగా చెయ్యాలి? ఎవరి ముందు చెయ్యాలి?

జాన్సన్ వాషింగ్టన్ కి టెలిఫోన్ చెయ్యటానికి నిశ్చయించుకున్నాడు దగ్గిరే ఒక ఫోన్ ఉంది కాని, దానిని ఉపయోగించలేదు కెన్నెడీ డెస్క్ దగ్గిర కూర్చుని మాట్లాడటానికి అతనికి మనస్సు ఒప్పలేదేమో కాని ఏకాంతంగా మాట్లాడాలని కూడా అయిఉండవచ్చు ఎందుచేతనంటే చివరికి అతనుతీసిన ఫోన్ కూడా కెన్నెడీ 'ఆంతరంగిక మందిరం' (విమానంలో) లోనిదే

ఈ రచయితతో జాన్సన్ 'తను చేసిన టెలిఫోన్ ల క్రమం మరిచిపోయానన్నాడు తను మరిచిపోయినా ఎవరికయితే చేశాడో వారితో చర్చలవల్ల ఈ క్రమాన్ని ఊహించవచ్చు

జాన్సన్ వివిధ వ్యక్తులతో మాట్లాడి ఒక విషయం తెలుసుకున్నాడు తను చట్ట సంబంధమయిన సందేహాలని అమెరికా ఎటార్నీ జనరల్ ని అడిగి తీర్చుకొనవలసిందే ఎటార్నీ జనరల్ ఎవరోకాదు, కెన్నెడీ తమ్ముడు రాబర్ట్ కెన్నెడీ ఇది విధి చేసిన క్రూరం, కాని, కొత్త అధ్యక్షుడికి గత్యంతరం లేదు

జాక్వెలిన్ కెన్నెడీ వాడిన మంచం అంచున కూర్చుని వర్జీనియాలో ఉన్న రాబర్ట్ కెన్నెడీకి టెలిఫోన్ చేశాడు

మొదట పరామర్శలు కొన్ని చేశాడు దీనికి ఎక్కువ వ్యవధిలేదు తను ఇప్పుడు ప్రపంచంలో చాలా పెద్ద పనులలో మునిగిన అధికారి వీలయినంత వెంటనే అసలు

సంగతికి వచ్చాడు హత్య 'ప్రపంచాని కంతా సంబంధించిన పెద్ద కుట్ర అయి వుండ వచ్చు' అన్నాడు ఈ సంభాషణ జరిగిన ఏడున్నర నెలల తర్వాత జాన్సన్ వారెన్ కమీషన్ ముందు సాక్ష్యం ఇస్తూ, ఎటార్నీ జనరల్ 'తాము ఎదుర్కొం టున్న సమస్యలని చర్చించాడు—ఈసమస్యలు అత్యవసర మయిన పరిష్కారం కావలసినవి, హత్య ఎందుకు జరిగిందో ఏమిటో సూచించే సమాచారం ఏదీ తెలియటం లేదు' అని, తన అభిప్రాయంతో రాబర్ట్ కెన్నెడీ ఏకీభవించినట్లు కూడా అన్నాడు

నిజానికి రాబర్ట్ కెన్నెడీ ముభావంగా ఉండి పోయాడు పెద్ద కుట్ర ఏదో ఉందని నమ్మని వారిలో అత నొకడు. జాన్సన్ చెప్పేది అతనికి సరిగ్గా అర్థం కాలేదు

'ఇక్కడ చాలా మంది నేను వెంటనే ప్రమాణ స్వీకారం చెయ్యాలంటున్నారు' అన్నాడు కొత్త అధ్యక్షుడు అసలు విష యానికి వస్తూ 'మీకే మయినా అభ్యంతరం ఉందా?'

కెన్నెడీ ఉలిక్కి పడ్డాడు, తుపాకి కాల్పు గురించి విని గంటం పావు కూడా కాలేదు దెబ్బ ప్రాణాన్ని అపహరించిందని విని గంట కూడా కాలేదు ఎటార్నీ జనరల్‌గా తనకి తొందర అర్థం కాలేదు అంతే కాక ఈ వ్యవహారం తనకి అతి ఆప్తుడయిన వ్యక్తికి సంబంధించినది తన అన్న మృత కళేబరం ఇంటికి తీసుకువచ్చిన తర్వాత ప్రమాణ స్వీకారం చేసుకోవచ్చు ననుకున్నాడు

'కాంగ్రెస్ (శాసన) సభ్యుడు ఆల్బర్ట్ థామస్ నేనిక్కడే ప్రమాణస్వీకారం చెయ్యా లనుకుంటున్నాడు' అన్నాడు జాన్సన్. 'ఇంకా కొంతమంది కూడా అదేవిధంగా అనుకుంటున్నారు'

కెన్నెడి టెలిఫోన్ నిశ్శబ్దంగా ఉండి పోయింది కెన్నెడీ అవుననలేదు, జాన్సన్ మరొకపద్ధతి అవలంబించాడు 'కుట్ర గురించి ఏదయినా సమాచారం తెలి సిందా?' అని అడిగాడు

'తెలుసుకుని నేను తిరిగి ఫోన్‌చేస్తాను,' అన్నాడు కెన్నెడి రిసీవర్‌పెట్టేసి, మళ్లీ ఫోన్‌చేసి తన అనుచరుడు నిక్ కాట్జెన్ బాక్‌తో అన్నాడు. 'లిండన్ జాన్సన్ లోనే ప్రమాణస్వీకారం చేస్తానంటున్నాడు, ఎవరు ప్రమాణం చేయించగలరని అడుగు తున్నాడు'

'రాష్ట్ర, కేంద్రచట్టాలక్రింద ప్రమాణ స్వీకారం ఏది చేయించగలిగినవారయినా దీనిని చేయించవచ్చునని నాకు జ్ఞాపకం కనుక్కొని చెప్తాను టెలిఫోన్ పెట్టెయ్య కుండానే ఉండగలరా?' అని అడిగాడు కాట్జెన్‌బాక్

బాబ్ సరే నన్నాడు నిక్‌కాట్జెన్‌బాక్ తమ లీగల్ డిపార్ట్‌మెంట్‌లోని హెరాల్డ్ రీస్‌కి ఫోన్‌చేసి (మరొక టెలిఫోన్ ద్వారా) అడిగాడు 'నువ్వు చెప్పింది సరిగ్గానే ఉంది' అన్నాడు రీస్

కూలిడ్జ్ అనే అధ్యక్షుడికి అతని స్వంత తండ్రి — ఆయన ఒక, జస్టిస్ ఆఫ్ పీస్—ప్రమాణంస్వీకారం చేయించాడన్న సంగతి గుర్తుచేశాడు ప్రమాణం పాఠం రాజ్యాంగంలోనే ఉంది అన్నాడు జాన్సన్ ఇతనితో మాటాడి ఉండాలి హత్యవల్ల కుంగిపోయిన రాబర్ట్ కెన్నెడిగారు ఆ సమ యంలో ప్రమాణం ఎక్కడ ఉంటుందో చెప్పలేకపోయారు

బాబ్ కెన్నెడీ తనకి అందిన సమాచారం జాన్సన్‌కి అందచేశాడు (అప్పటికి జాన్సన్ మెక్‌జార్జ్ బండీ అనే అధ్యక్షుడి కార్య దర్శితో మాట్లాడుతున్నాడు కెన్నెడీ ఈ సంభాషణకి అడ్డువచ్చి తనకి తెలిసినది చెప్పాడు) ఈ సందర్భంలో జరిగిన వీరి ద్దరి మధ్యసంభాషణ వివరాలు అంత



శ్రీ జాన్సన్

స్పష్టంగా తెలియటంలేదు. జాన్సన్ వారెన్ కమిషన్ ముందు ఇలా చెప్పాడు కెన్నెడీ వెంటనే నన్ను ప్రమాణస్వీకారం చేసుకో మన్నాడు వాషింగ్టన్ వెళ్ళేముందే చేసుకో మన్నాడు జుడిషియల్ ఆఫీసర్ ఎవరయినా ఈపని జరిపించవచ్చునన్నాడు యంగ్ బ్లడ్‌కి వివరాలు గుర్తులేవు కాని మొత్తం వివాద జరిగింది ఇదే అన్నాడు అదీకాక తను జాన్సన్ గొంతుకమాత్రం వినగలిగాడు కదా అన్నాడు కెన్నెడీ యేమో వెంటనే ప్రమాణస్వీకారం చెయ్యమని చెప్పలేదని అతని జ్ఞాపకం అప్పటి అతని మానసిక పరిస్థితినిబట్టి చూస్తే ఇది నిజమేనని పిస్తుంది 'ఎవరయినా ప్రమాణం చేయించ వచ్చు విహారే చెయించిన ఒక జడ్జి ఎవ రయినా ఉంటే విూకిష్టమేమో ఎవరయినా సరిపోతారు,' అన్నాడని తర్వాత అన్నాడు ఎడ్ గుత్‌మాన్ కూడా ఇదే అతను చెప్పిం దన్నాడు

ప్రమాణం పాఠం ఎలా ఉండాలి?

'తేలికగా తెలుసుకోవచ్చు ఇదేమీ కష్టం కాదు వాళ్లే కనుక్కొని చెప్పగలరు'

'మంచిది!' అని ఫోను పెట్టేశాడు జాన్సన్

కాని అంత మంచిగాలేదు పాఠం దొరక లేదు

పెద్ద గదిలో అతని కార్యదర్శి క్లిఫ్ కార్టర్ మారీ ఫెహ్మర్‌ని చూసి, 'నువ్వు లోపలికి వెడితే మంచిది, టెలిఫోన్ చేస్తు న్నాడు,' అన్నాడు

ఆమె లోపలికివచ్చి జాన్సన్ ఎదురుగా ఒక కుర్చీలో కూర్చుంది

'ఇది రాసుకో', అని జాన్సన్ ఆమెతో తన టెలిఫోన్ సంభాషణలకి సంబంధించిన నోట్స్ కొన్ని డిక్టేట్ చేశాడు తర్వాత 23 సంవత్సరాలుగా తన భార్య లాయ రుగా ఉన్న వాల్డ్రబర్లియన్‌కోసం టెలిఫోన్ చేశాడు అతను దొరకలేదు సారాహ్యూస్ కోసం ప్రయత్నించాడు ఆమెకూడా దొరక లేదు ఎలాగయినా ఆమెని వెతికి పట్టుకో మన్నాడు

మారీతో 'ఇర్వ్ గోల్డ్‌బర్గ్‌కోసం ప్రయ త్నించు!' అని చెప్పాడు గోల్డ్‌బర్గ్ జాన్సన్ రాజకీయ అనుచరులలో ఒకడు

జాన్సన్ అతన్ని అడిగాడు, 'లిండన్ మాట్లాడుతున్నాను. ఇక్కడ ప్రమాణ

# అధ్యక్షుని మరణం

స్వీకారం చేయించుకోమంటావా, వాషింగ్టన్‌లోనా?' అని

ఇర్వ్ వేగంగా ఆలోచించాడు 'ఇక్కడే బాగుంటుందనుకుంటాను'

'ఎవరు చేయిస్తే బాగుంటుంది?'

'సారాహ్యూగ్స్'

'ఆమెకోసమే ప్రయత్నిస్తున్నాను నువ్వూ ప్రయత్నించు'

సారా ప్రమాణం పాఠం మరిచిపోయింది కాని, అర్థం సరిగ్గా ఉంటే చాలు, మాటలు కొద్దిగా మారితే నష్టం ఏమి? అనుకుంటూ వేగంగా తన స్పోర్ట్స్ కారులో వివాహాశ్రయం వయిపు వెళ్ళిపోయింది జాన్సన్ ఆమెకి 1943 నుంచి తెలుసు 'అతనికి అవసరం ఎక్కువ. అతనంతే నాకు తెలుసు' అన్నది

అయితే జాన్సన్‌కి అవసరం మాత్రమే ఎక్కువకాదు పట్టింపుకూడా ఎక్కువే మళ్ళీ 2 20కి వాషింగ్టన్‌కి ఫోన్‌చేసి నిక్ కాట్జన్‌బాక్ ద్వారా ప్రమాణం పూర్తిపాఠం టెలిఫోన్ మీదనే చెప్పించుకున్నాడు, రాసుకున్నాడు

పెద్ద గదిలోకివెళ్ళి జాక్‌వాలంటీతో, 'ఇప్పుడే ఎటార్నీ జనరల్‌తో మాట్లాడాను ఇక్కడే ప్రమాణస్వీకారం చేయించవచ్చునని సలహా ఇచ్చాడు,' అన్నాడు

కొన్ని అడుగుల అవతల ఉన్న టెలివిషన్ సెట్టు సందడి అధికం అయింది డల్లాస్‌లో పోలీసువారు ఒక థియేటర్‌లోకి వెళ్ళి టిప్పిట్‌ని హత్యచేసినందుకు ఒక వ్యక్తిని అరెస్టు చేశారుట, ఈ వ్యక్తి అపుస్తకం కంపెనీలో పని చేస్తున్న వాడు హత్య జరిగిన అరగంటలో సూపరింటెండెంట్ రాయ్ ట్రూలీ అక్కడి వారందరి 'ఎటెండెన్సు' వేసినప్పుడు అతనొక్కడే హాజరుకాలేదని తెలుసుకున్నాడు ఈ కేసు కటిక చీకటిలో సన్నటి వెలుగు ప్రవేశించింది

జాన్ కెన్నెడీ చరిత్రలో అండర్ టేకర్ (అంత్యక్రియలు ఏర్పాటు చేసే వ్యక్తి) వెర్నన్‌వోనీల్ ఒక 'భారీ' మనిషి పొట్టిగా, లావుగా, ఎప్పుడూ విచారంగా కనిపించేవాడు కంటినిండా జుట్టు, మధ్య పాపిడి తీసుకునేవాడు. అతని షాపు చాలా అధునికంగా ఉండేది నేలమీద తివాచీ, చర్చిలో వినిపించే సంగీతం, కాఫీ బార్ (మరణించిన వారి బంధువులకి అక్కడ ఆకలి దాహాలువేస్తే), తెల్లటి శవ వాహనాలూ, రేడియో ఉన్న ఏంబులెన్స్‌లూ—వోనీల్ మంచి వ్యాపారి ప్రత్యేకంగా ఒక డిస్పాచ్ క్లార్క్‌ని కూడా పెట్టుకున్నాడు ప్రస్తుతం ఈ క్లార్క్ పోలీసువారితో తిరుగుతున్నాడు

నవంబర్ 22 తేదీ, వోనీల్ 'ఆఫీసు' లోని 18 మందిలో 17 మంది మధ్యాహ్నం విశ్రాంతి సమయంలో భోజనానికి వెళ్ళారు అతని డిస్పాచర్ మాత్రం ఉన్నాడు అధ్యక్షుడి ఊరేగింపు వారు అతి ప్రమాదకర పరిస్థితిని ప్రకటించటం అతను గమనించాడు తన యజమానితో చెప్పాడు వోనీల్ తల్లడిల్లిపోయాడు ఇంతలో టెలిఫోన్ మోగింది 'నాపేరు క్లింట్ హిల్ సీక్రెట్ సర్విస్ ఏజెంట్‌ని వెంటనే పార్క్‌లాండ్‌కి ఒక పేటిక తీసుకురావాలి'

'ఆగండి – ఆగండి!' అన్నాడు వోనీల్. 'అన్ని రకాల ధరలకి సరుకు ఉంది!'

'ఉన్నవాటిలో మంచిది తీసుకురా!' అన్నాడు క్లింట్

వోనీల్ తన 'స్టాక్' గదిలోకి వెళ్ళి అక్కడ ఉన్నవాటిలో అత్యుత్తమ మయినది ఏరాడు అది 'ఎల్గిన్ కాస్కెట్ కంపెనీ' వారి 'బ్రిటానియా' మాడెల్, 800 పవున్ల బరువు కలది, రెండు గోడలు. కాని, దానిని తనొక్కడూ తీసుకు పోలేదు బయటికి వెళ్ళి తన ఉద్యోగులు ముగ్గురు తిరిగిరాగానే వారి సహాయంతో ఆ శవ పేటికని ఒక ఎయిర్ కండిషన్ చేసిన 1964 మాడల్ కాడిల్లాక్ తెల్లరంగు శవ వాహనంలో పెట్టించాడు

పార్క్‌లాండ్ ఆస్పత్రిలో వోనీల్, అతని ఎకవుంటెంటు రేగ్లీసన్ కాడిల్లాక్ తలుపులు తెరిచారు రక్షక దళంవారూ, విలేఖరులూ వారికి సాయపడ్డారు శవపేటికని ఒక చిన్న తోపుడు బండిమీద ఉంచి శవం ఉన్న గది వద్దకి తీసుకుపోయారు విలేఖరులు బయట ఆగిపోయారు ఆండీ బెర్జర్ అనే ఏజెంటు కెన్‌వోడాన్నెల్‌తో తము సిద్ధంగా ఉన్నట్లు సంజ్ఞ చేశాడు

'మీతో మాట్లాడాలి!' అన్నాడు కెన్

శ్రీమతి కెన్నెడీతో ఆమెని తలుపు దగ్గరికి తీసుకు వెళ్ళాడు ఆమెకి అంతకి ముందు మాట ఇచ్చాడు—శవాన్ని పేటికలో పెట్టేముందు ఒకసారి ఆమెని చూడనిస్తానని ఇచ్చిన మాట తప్పనివ్వకుండా చూడాలనే ఆత్రంతో శ్రీమతి కెన్నెడీ వేగంగా వెళ్ళి తలుపు తెరిచే పిడి పట్టుకుంది

సర్జన్ కాంప్‌క్లార్క్ ప్రత్యక్షమయ్యాడు. 'నన్ను లోపలికి వెళ్ళనివ్వరూ?'

'వీల్లేదు, వీల్లేదు,' అని సణిగాడు అతను

ఆమె అతని వయిపుకి కొంచెం వంగింది 'శవపేటిక చూసి ఏడుస్తాననుకున్నారా డాక్టర్? నా భర్త చనిపోవటం చూశాను, నా చేతుల్లో తుపాకి దెబ్బ తిన్నాడు, అతని నెత్తురంతా నా మీద పలికింది ఇంతకన్నా ఘోరం ఏమి చూస్తాను?'

క్లార్క్ తగ్గిపోయాడు 'సరే, సరే! నాకూ తెలుసు!' అని పక్కకి తప్పుకున్నాడు

వోనీల్ వెంటనే వెళ్ళింది అధ్యక్షుడితో బాటు ఆ పేటికలో తనే వస్తువుని ఉంచగలదు? హటాత్తుగా ఆమెకి తన వివాహపుటుంగరం జ్ఞాపకం వచ్చింది అంతకన్నా పవిత్రమయిన వస్తువు తనకి లేదు అది పట్టి బంగారు ఉంగరం రాళ్ళు పొదిగిలేవు అసలది మగవారు ధరించే రకం అధ్యక్షుడు దానిని అవసరప్రసరంగా పెళ్ళిముందు కొన్నది దానిమీద తేదీకూడా చెక్కించటానికి వ్యవధిలేక పోయింది అప్పుడు! తర్వాత షాపుకి తీసుకువెళ్ళి వివాహం తేదీ చెక్కించుకున్నది అది సరిగ్గా ఉంటుంది కాని, వేలుమీద నుంచి తియ్యటానికి వస్తుందా? ఎడమచేతి మేజోడు తియ్యటానికి ప్రయత్నించింది, దాని గుంజి కూడా రాలేదు,

గది అప్పటికి శుభ్రం చేశారు అంతకి ముందు పోగయిన వారు వెళ్ళిపోయారు వోనీల్ శవ పేటికి మీదకి వంగి ఉన్నాడు డల్లాస్ పోలీస్ సర్జంట్ బాబ్ డగ్గర్ ఆమెతో బాటు లోపలికి వచ్చాడు మనిషి చురుకుగా కనిపించాడు మవునంగా తన ఎడంచెయ్యి అతని వయిపు చాపింది అతను వెంటనే అర్థం చేసుకున్నాడు ఆమె చేతిమీది గ్లవ్ తీసివేశాడు

అధ్యక్షుడి పక్కకి వెళ్ళింది మృదువుగా అతని చేతిని ఎత్తింది ఉంగరం తొడిగి చేతిని దించివేసింది అతనివంక చూస్తూ ఉండి పోయింది

అధ్యక్షుడు పార్క్‌లాండ్‌కి పెద్ద సందడితో వచ్చాడు మళ్ళీ పెద్ద సందడితో వెళ్ళిపోతున్నాడు

వోనీల్‌కి తన బ్రిటానియా శవపేటిక లోపలి శాటిన్ గుడ్డ మరకలు పడిపోతుందని భయవేసింది లోపల ఒక ప్లాస్టిక్ గుడ్డ వేయించాడు దేహానికి మరొక ప్లాస్టిక్ దుప్పటి కప్పారు తలకి రబ్బర్ సంచులు ఏడు తొడిగారు — రక్తం ఏ మాత్రం కారకుండా ఇదంతా పూర్తికావటానికి 20 నిముషాలు పట్టింది శ్రీమతి కెన్నెడీ ఇదంతా చూసి పూర్తిగా కుంగిపోయింది 'గాయపడిన కుందేలులా ఉంది,' అనుకున్నాడు గొంసాలెజ్ ఆమె కుర్చీలో కూలబడటం చూసి

అకాలంగా వైధవ్యం పొందిన ఈ వనిత అక్కడి అధ్యక్షుడి పరివారంలో వారందరికీ ఒక అపూర్వ వ్యక్తిగా, దుఃఖానికి ప్రతిబింబంగా కనిపించింది అందరూ తమ దుఃఖాన్ని పంచుకుంటున్నారనిపించింది హ్యానీ బయటికి వస్తూ ఒక యువజంట కవుగిలిలో ఉండటం చూశాడు ఇద్దరూ ఒకరి కొకరు సమదాయించుకుంటున్నారనుకున్నాడు ఆ అమ్మాయి (ఒక నర్సు) హటాత్తుగా ముసిముసి నవ్వు నవ్వటం చూసి, 'కొంచెం గౌరవం చూపండి!' అన్నాడు కోపంగా వారిద్దరూ అక్కడి నుంచి పారిపోయారు

ఆ ఆస్పత్రిలో అందరూ వెకిలిగా ప్రవర్తించారనికాదు ఎందరో తమ సాయశక్తులా అన్నీ చేస్తున్నారు, తామూ విచారంలో పాలు పంచుకున్నారు కాని ప్రమాదాల వార్డులలో పనిచేసేవారు మొద్దుబారిపోతారు

అధ్యక్షుడి పరివారంలో కొందరు ఇదంతా గమనించి జాక్వెలీన్ కెన్నెడీ ఏ అసభ్య సంఘటననీ ఎదుర్కొనకుండా ఎన్నో కట్టుదిట్టాలు చేశారు కాని ఈ కట్టుదిట్టాలు ఒక కాథలిక్ ఫాదరీ విషయంలో పని చెయ్యలేదు

ఫాదర్ థామస్ కెయిన్ చాదస్తుడు వెకిలిగా ప్రవర్తించే అలవాటు ఉంది అధ్యక్షుడు కాథలిక్ మతంవాడు అతను గాయపడ్డాడని వినగానే తను అక్కడికి వెళ్ళటం అవసరం అని వచ్చేశాడు తన దగ్గర 'అసలు క్రాస్'లో నుంచి తీసి పొదిగిన క్రాస్ ఒకటి ఉంది దానిని తీసుకుని హడావుడిగా వచ్చేశాడు దారిలో ఎవరో అధ్యక్షుడు పోయాడని చెప్పగా విన్నాడు

తన ఎదుట నుంచుని ఉన్న ఫాదరీని చూసింది శ్రీమతి కెన్నెడీ అతని కళ్ళు పిచ్చిగా వెలుగుతున్నాయి

'ఎప్పుడు చనిపోయాడు?'

'కారులో అనుకుంటాను' అన్నది ఆమె నిర్లిప్తంగా

ఫాదర్ కెయిన్ సంచీ తెరిచాడు 'నా దగ్గర అసలు క్రాస్ పొదిగినది ఉంది' ఆమె వయిపు దానిని చాపి 'భక్తి చూపించ' మన్నాడు ఆమె దానిని ముద్దుపెట్టుకుని ఇచ్చివేసింది దీనిని అధ్యక్షుడి దగ్గరకి తీసుకుపోవాలన్నాడు కెయిన్ 'పాపం ఎంత భక్తి, ఎంత గౌరవం,' అనుకుంది ఆమె. 'జాక్‌కి దీన్ని ఇస్తాడుగావును' వోడానెల్ తల ఊపాడు ఫాదరీ లోపలికి వెళ్ళి క్రాస్ చేతపట్టుకుని శవపేటిక చుట్టూ తిరిగాడు

బయటికి వచ్చేసి, 'అసలు క్రాస్ పొదిగిన దాన్ని మీ భర్త చుట్టూ తిప్పాను,' అన్నాడు

ఆమె విస్తుపోయి చూసింది 'ఇదేమిటి, క్రాస్ అక్కడ ఇవ్వలేదూ?' అనుకుంది

వోడానెల్ అతని వయిపు కదిలాడు ఫాదర్ కెయిన్ అంత తేలికగా వదిలేవాడు కాదు అతనికి ఆవేశం వచ్చేసింది శ్రీమతి కెన్నెడీ చెయ్యిపట్టుకున్నాడు, చుట్టూ చేతులు వెయ్యబోయాడు, ఆమెని 'జాకీ' అని సంబోధించాడు, తర్వాత ఉత్తరం రాస్తానన్నాడు వోడానెల్, లారీ, డేవ్‌లు అతన్ని పట్టుకోబోతూ ఉండగా అక్కడి నుంచి ఎగిరి వెళ్ళిపోయాడు వోనీల్ చుట్టూ ఎగిరాడు బయట నుంచుని ఉన్న కొందరు ఆస్పత్రి ఉద్యోగులకి 'లార్డ్స్ ప్రేయర్' చదివి వినిపించాడు తిరిగి శ్రీమతి కెన్నెడీ వద్దకి వచ్చాడు ఆమె చేతిని అందుకోబోయాడు

'ప్లీజ్ ఫాదర్ నన్ను బాధ పెట్టకండి!' అన్నది ఆమె చేతిని లాగివేసుకుంటూ

వోడానెల్ అతని మీదకి వచ్చేశాడు అతను క్రాస్ ఉన్న సంచిని గట్టిగా పట్టుకుని నిష్క్రమించాడు దూరంగా అతని ప్రార్థనలు వినిపిస్తూనే ఉన్నాయి! వెళ్ళిపోయాడనుకున్నారు కాని అతను ఆ ఉద్రేకంలో లేడు అక్కడే నక్కి ఉన్నాడు

(ఇంకా వుంది)

**కుమారి డి పరమేశ్వరి, భీమావరం**

నాకు జీవితం అంటే విరక్తి కల్గుతున్నది ఏమిచేయమంటారు?

రక్తి కల్గేలాంటి పనులేవైనా తలపెట్టండి

**ఎమ్ వి ఆర్ భాగ్యలక్ష్మి, ఉరవకొండ**

ద్వేషం అభిమానం ఎందుకు పుట్టుకొస్తాయి మనిషిలో?

మనిషి కనుకనే

**కె టి. ఎన్ సుబుద్ధి, బరంపురం**

పరస్త్రీలను ఎలాగు చూడాలని మీ అభిప్రాయం?

ఎందుకో చెప్తే సమాధానం చెప్పడం సులభం సుబుద్ధిగారూ!

**పి ఎలీషా, పర్కాల్**

ఒక కథ వ్రాయుటకు ముఖ్యమైనది ఏమిటి?

వ్రాయగల్గడం!

**ఎన్ పద్మ, అంగలూరు**

తామే అందరికంటె గొప్పవారమని భావించేవారితోను డబ్బుందని గర్వపడేవారితోను మెలగడం ఎలాగ?

తప్పించుకు తిరగాలే కాని వారితో మెలగాలని ప్రయత్నం చేయడం దేనికి?

**జి ఉమాకాంతరావు, వరంగల్లు**

ఈ రోజుల్లో విలువగలవారు స్త్రీలా? పురుషులా?

ఒకరికి ఒకరు!

**కె కృష్ణ, కొత్తగూడెం**

నేను కథలు వ్రాస్తాను కాని ఏం లాభం? నేను చాలా బీదరాలను పంపలేక పోతున్నాను మాకథలు మూలబడి పోతున్నాయి

ఆత్మదారిద్రం కథలకు ఆపాదించుకొని ఖిన్నపడడం దండుగని పోస్టేజిలేక పోవడంవల్ల వో ఉత్తమ కథకురాలు దేశానికి కాకుండా పోతోందన్న బాధతో— మా సానుభూతి మీదే!

**ఎస్ ఎమ్ హసన్, భువనగిరి**

నా కెప్పుడు ఏదో కథ రాయాలని పిస్తుంది కాని పద గాంభీర్యంలేక ప్రచురించడానికి యోగ్యంగా కనిపించదు

పదగాంభీర్యమే కథకు ఆయువుపట్టని మీ నమ్మకమా? మీకే యోగ్యంగా కనిపించని రచనలు వెలుగు చూడకపోవడమే మంచిది

**టి శోభ, సికింద్రాబాదు**

మనసులో భావం కల్గితే పుస్తకంపెట్టి కలంతో వ్రాసి ఆ భావానికి ఆకృతి ఇచ్చే వరకు మనస్సు ఊరుకోదు...అందరూ పత్రి




కలకి పంపించ మంటారు

తప్పకుండా పంపించండి ఎవరు వద్దంటున్నారని ఈ ప్రశ్న? లేక అంతదాకా కూడా మనస్సు నిలువదా!?

**డి దుర్గ, మంగళగిరి**

కథలు వ్రాయాలంటే మొదట ఏమి చేయవలెను? దానికేమైనా డిగ్రీలు కావాలా?

కథలు వ్రాయడానికి మొదట కూర్చోవాలి! అలా కూర్చుని వ్రాయడం సుఖం కనుక పోతే డిగ్రీల బాధలేని రంగాలు రెండే ఉన్నాయి— ఒకటి రాజకీయ రంగం, రెండు కళారంగం

**కె విజయ, కాకినాడ**

నేను రచయిత్రిని కావాలని ఎన్నాళ్ల నుంచో ఉబలాట పడుతున్నాను భావాలు కాగితంమీద పెట్టాలంటే కలం సాగదు

మీ ఉబలాటం అర్థం చేసుకోగలను కాని వూహలొక్కటే ఉంటే చాలదు నిజంగా రచయిత అయిన వాడు ఆ వూహలచేత కూడా పని చేయిస్తాడు

**శాగంటి సంయుక్త, హైదరాబాదు**

నాకు కథలు వ్రాయడం వచ్చుగాని అవి బాగా అనిపించవు అవి పత్రికలలో పడగలవా?

సంపాదకులు చాలా విశాలహృదయంతో పరీక్ష చేస్తారు రచనలని కాని మీకే బాగు అనిపించని రచనలని వారికి పంపడం వారి ఓర్మికి పరీక్ష పెట్టడమే

**ఐ బి ఆర్ రాహిమి, రాయవరం**

నేనూ చాలా బీదదాన్ని కథలు వ్రాసి కష్టపడి చదువుకొని ఏదైనా ఉద్యోగంచేసి బ్రతకాలని ఉంది హిందీలో, తెలుగులో, ఇంగ్లీషులో చాలా కథలు వ్రాశాను నేను ఎనిమిదవ తరగతి చదువుతున్నాను

సినిమాలలో నాయిక కష్టాలు వచ్చినప్పుడు అంట్లు తోమి, పిండిరుబ్బి, బియ్యం దంచి, నానా చాకిరీచేసి అయినవారిని ఆదుకున్నట్టుగా చూపారేగాని, యిప్పటిదాకా డబ్బులేక కథలు వ్రాసి పైకివచ్చిన నాయికను ఎందుకు చూపలేదా అనిపించింది చిరంజీవీ, నీ ఉత్తరం చదవగానే! ఇన్ని భాషలలో కథలు వ్రాయకల్గిన నువ్వు యింకా ఎనిమిదవ తరగతిలో ఉన్నాననడం బాగులేదు!

**ఎస్ హరిప్రియ, గుంటూరు**

కథలు వ్రాయాలంటే ఎక్కువ చదువు కావాలా? ఇంగ్లీషు పదాలు ఎక్కువగా ఉపయోగించాలా? నా అచ్చయిన కథ బాగు లేదని ఒకామె వ్రాసింది

ఇలా ప్రశ్నించేవారుకూడా కథలు వ్రాయాలా అని నా ప్రశ్న! కథ అచ్చుపడితే అందలం ఎక్కినట్లు, తిరిగివస్తే నడుము విరిగినట్లు అనుకోకూడదు విమర్శను తట్టుకోవాలి ప్రతిరంగంలో లాగే ఈ రచనా రంగంలో కూడా జయాపజయాలు ఉంటాయి

**జి వి వాసంతి, శ్రీరామ తీర్థం**

మంచిగా బ్రతికేవారికి తావు లేదేమో?

పెద్దవాళ్ల కాళ్లకి అడ్డం పడకుండా బ్రతకడం నేర్చుకోవడమే

**అవధానుల జగన్నాథరావు, అనకాపల్లి**

ఈమధ్య ప్రతి పత్రికలోనూ రచయిత్రులకి ముఖ్యస్థానం ఈయడంలో సంపాదకుల ఉద్దేశ్యాలు ఏమై ఉంటాయి?

ప్రత్యేకమైన ఉద్దేశ్యాలెందుకుంటాయి? అందరూ చదువుతారన్న రచనలు సంపాదకులు ప్రచురించడానికి ప్రయత్నిస్తారు అయినా ఈ మధ్య ఆడవారిపేర్లు ఎక్కువగా కనబడుతున్నాయంటూ యిదైపోతున్నారు కాని మొత్తం వస్తున్న రచనల సంఖ్యలో వీటి శాతం చాలా తక్కువ అని ఎవరూ గుర్తించరెందుచేతనో?

**యస్ త్రివేణి, ఖర్గపూరు**

ఎదుటివారిని చూసి ఓర్వలేని వారికెలా బుద్ధిచెప్పాలి?

బుద్ధి చెప్పడమే ప్రధానం అనుకునే పక్షంలో ఈ కథ వినండి వెనుకటికి ఇద్దరు శత్రువులు ఒక వోడలో ప్రయాణం చేస్తున్నారట ఓడ ప్రమాదంలో చిక్కుకుంది చుక్కానివైపున కూర్చున్నవాడు 'అయ్యా వోడ మునిగిపోతే ఎటువైపు ముందు మునుగుతుంది?' అని అడిగాడు 'అటువైపు' అని వచ్చిన సమాధానం విని ఎంతోసంతోషించాడుట— తన శత్రువు ముందు మునిగి పోతాడుకదా అని! కొంచెం విపరీతం అయినా ఇలా బుద్ధిచెప్పడం ఎలా ఉంటుందంటారు? ఎదుటివారికి బుద్ధి చెప్పదలిస్తే ఈమాత్రం బాధపడక తప్పదు!

# మాతృదేవోభవ, పితృదేవోభవ

## ధర్మపథం



తల్లిదండ్రులు దైవసమానులనీ—అసలు దేవునికంటే కూడా ఎక్కువవారనీ మనవారి అభిప్రాయం తల్లిదండ్రులను పూజిస్తే దేవుణ్ణి పూజించకపోయినా బాధలేదనికూడా చెప్పారు, తలిదండ్రులనే ముఖ్యమైన దేవతలుగా భావించాలని 'మాతృదేవోభవ, పితృదేవోభవ' అనే శ్రుతి చెప్తూ ఉన్నది దేవుని కంటె తలిదండ్రులనే ఎక్కువగా చూసే వారూ లేకపోలేదు

మహారాష్ట్ర దేశంలో యిప్పుడు పండరిపురం వున్నచోట పుండరీకుడనే భక్తుడు ఉంటూ ఉండేవాడు అతడు గొప్ప విష్ణుభక్తుడు విష్ణుభక్తి అతనికి యెంతవున్నదో పితృభక్తి అంతకంటె ఎంతో ఎక్కువ! అతడు మొదట వృద్ధులైన తలిదండ్రులకు శుశ్రూష చేసి వారికి భోజనం పెట్టి, వారి సేవ పూర్తి అయిన తర్వాతనే భగవంతునిధ్యానంలో నిమగ్నుడవుతూఉండేవాడు

అతడు ఉదయాన్నే లేచి తలిదండ్రులకు సాష్టాంగపడి, వినయ విధేయతలతో వాళ్ల సౌకర్యాలు గమనిస్తాడు వారు మిక్కిలి వృద్ధులు, శక్తిహీనులు, కన్నులు సరిగా కానరావు అందువల్ల తాను వారి సంరక్షణలో ఎంతో శ్రద్ధవహిస్తాడు పుండరీకుడు తన తండ్రికి స్వయంగా తలంటి నీళ్ళుపోసి, భద్రంగా తడి ఒత్తి, జుత్తు చిక్కు విడదీసి, ఆరబెట్టి, మడుగు ధోవతులు కట్టిస్తాడు దేవతార్చన చెయ్యనిదే తండ్రి భుజించడు. అందువల్ల తాను దగ్గరనే ఉండి, కావలసిన పూజా ద్రవ్యాలను అందిస్తూ, పూజా విధానం తప్పిపోకుండా నడుమ నడుమ శ్లోకాలను అందిస్తూ దేవతార్చన చేయించి ఇష్టములూ, పథ్యములూ అయిన పదార్థాలతో భోజనంపెట్టి ఎంతో సంతృప్తిని కలిగిస్తాడు అతని భార్య అత్తగారికీ అదే విధంగానే సేవ చేస్తుంది

పుండరీకుడు ఈ విధంగా పితృ సేవ చేస్తూ వున్నా, తన విహితకృత్యాలను మానలేదు సమాధినిష్ఠలో భగవంతుని ధ్యానించడం ఆతని నిత్యకృత్యాలలో ప్రధానమైనది నిశ్చలమై, నిష్కళంకమైన భక్తి అతని సొమ్ము, అతడు భగవంతుణ్ణి సాక్షాత్కరింపజేసుకొనుటకు కావలసిన పద్ధతులను అవలంబించి ఉండేవాడు

ఇలా వుండగా ఒకనాడు తాను అనుకోకుండా—ఇలువేల్పయిన శ్రీ కృష్ణుడు పుండరీకునికి ప్రత్యక్షమయ్యాడు అప్పుడు యితడు సమాధినిష్ఠలో లేడు తలిదండ్రుల శుశ్రూషలో నిమగ్నుడై ఉన్నాడు

ప్రత్యక్షమయిన శ్రీ కృష్ణుని చూడగానే పుండరీకుడికి ఎంతో ఆశ్చర్యం కలిగింది అతడు చకితుడైపోయాడు క్షణకాలం ఏమీ చెయ్యలేక అలాగే ఉండిపోయాడు తర్వాత కొంత తెప్పరిల్లి, మనస్సును కుదుటబరచుకున్నాడు

పుండరీకుడు శ్రీ కృష్ణుని చూచి చేతులు జోడించి 'కృష్ణా! భగవంతుడవైన నీవు అనుకోకుండా నావంటి అల్పునికి ప్రత్యక్షం కావడం నా మహాభాగ్యం! నిన్ను స్తుతించి, గౌరవించి నీ సేవలు చెయ్యడం నా ధర్మం అయినా యిప్పుడు నేను వేరే సేవలో నిమగ్నుడనయి ఉన్నాను తలిదండ్రులు దైవసమానులని నీకూ తెలుసును నీవంటివారే వారు, వారివంటివాడవే నీవు! ఇప్పుడు నేను వారి శుశ్రూషలో నిమగ్నుడనై ఉన్నందున—మధ్యలో వారి సేవను విడిచిపెట్టి నీ వద్దకు రావడం భావ్యం కాదుగదా! నేను వారి సేవ ముగించుకొని వచ్చేవరకూ కొంత కాలం నీవు నిరీక్షించవలసి ఉంటుంది నన్ను అన్యథా భావించవద్దు వీలయినంత శీఘ్రంగానే నిన్ను గమనిస్తాను నేను వచ్చేవరకూ నీవీ ఇటుకరాతిమీద నిలబడి ఉండవలెను' అని అంటూ ఆ సమీపంలో ఉన్న ఒక పెద్ద యిటుకరాతిని తెచ్చి శ్రీ కృష్ణుని దగ్గర ఉంచి, దానిపైని ఉండవలెనని కోరి పితృ సేవకై వెళ్లిపోయాడు భక్తపరాధీనుడైన శ్రీ కృష్ణుడు మారు మాట చెప్పకుండా, పుండరీకుడు చెప్పినట్లే ఆ యిటికమీద నిలబడి ఉండెను

తన పితృ సేవ పూర్తి అయిన తర్వాత పుండరీకుడు వచ్చి భగవంతుడిని వేయి విధాల స్తుతించి, తనయందు అనుగ్రహం ఉంచి ప్రత్యక్షమయిన శ్రీ కృష్ణునికి పెక్కు విధాల సేవలు చేశాడు పుండరీకుడు, తన్ను గమనించకుండా తలిదండ్రుల సేవకు పోయినందుకు భగవంతుడికి అతని మీద కించిత్తయినా కోపం రాలేదు సరిగదా, సంతృప్తి కలిగింది నిజమే! తలిదండ్రులనే దైవ స్వరూపులుగా భావించేవారికి వేరే దేవతలను పూజించడం అక్కరలేదు ఈ విషయం భగవానుడైన శ్రీకృష్ణుడికి తెలియదా?

తర్వాత శ్రీకృష్ణుడు పుండరీకుడి కోరికపై, అక్కడే, ఆ ఇటుక రాతిమీదనే స్థిరపడి, అది గొప్ప క్షేత్రమైనట్లూ—పుండరీకుని పేర పౌండరీక క్షేత్రమని ప్రసిద్ధమయేటట్లూ వరమిచ్చాడు

ఇటుకరాతి మీద వెలసిన దేవుడగుటవల్లనే శ్రీకృష్ణుడు విఠలదేవుడైనాడు ●

—బులుసు వెంకటరమణయ్య

# శాసనసభ వనితామణులు-6

## శ్రీమతి విమలాదేవి



శ్రీమతి ఎన్. విమలాదేవి

'అనుకూలాం విమలాంగీం, కులజాం కుశలాం సుశీలసంపన్నాం, పంచలకారాం భార్యాం, పురుషః పుణ్యోదయాల్లభ్యతే' అన్నారు మన పెద్దలు. విమలాదేవిగారి విషయంలో ఆ మాట స్ఫురిస్తుంది.

నిన్నటిదాకా గడపదాటని గృహిణి. విమలమైన భావాలతో, కోమలమైన మనస్సుతో రాజకీయ నందనోద్యానంలో ప్రవేశించిన— విరిబోడి శ్రీమతి విమలాదేవి.

జనగామా తాలూకాలోని రామవరంలో ఆమె 1932 లో జన్మించారు. వరంగల్లు జిల్లాలో వాసికెక్కిన కడారు నర్సింహారావు గారి కూతురు ఏడవతరగతి వరకు ఆమె ప్రైవేటుగా చదివారు. వడ్డెకొత్తపల్లి గ్రామం వెలమదొర నెమరుగొమ్ముల యతి రాజారావుగారితో పదిహేనవ ఏట విమలాదేవిగారి వివాహం జరిగింది. తాలూకా స్థాయినుండి జిల్లా కాంగ్రెస్ కమిటీ అధ్యక్షపదవి వరకూ ఉన్నత హోదాలను ఆయన నిర్వహించారు. జిల్లా అగ్రగామి నాయకుల్లో ముఖ్యులు.

చెన్నూరు నియోజక వర్గం నుండి ఆయన ఇండిపెండెంటు అభ్యర్థిగా 1962 లో శాసనసభకు ఎన్నికయ్యారు. ఆ నియోజకవర్గం నుండి తొలిసారిగా ఎన్నికైన కాంగ్రెస్ అభ్యర్థి శ్రీమతి విమలాదేవి, 1949 నుండి పార్టీ సభ్యురాలు. భర్త కొంతకాలం పార్టీకి దూరమైనా, భార్య పార్టీని వదలలేదు.

ఇటీవలి ఎన్నికల్లో ఆమెతో అతివాద కమ్యూనిస్టు, స్వతంత్రపార్టీ, జనసంఘం అభ్యర్థులు తీవ్రమైన పోటీ చేసారు. రిటర్నింగ్ ఆఫీసరు ఎదుట నామినేషన్ పత్రం దాఖలుచేసి ప్రమాణ స్వీకారం చేయడానికి మాత్రమే విమలాదేవిగారు ఇంటి నుండి బయటికి వచ్చారు. ఎన్నికల కోలాహలంలో పాల్గొనక పోయినా, 6800 వోట్ల మెజార్టీతో ఆమె విజయం పొందడం శ్రీ యతి రాజారావు పలుకుబడిని, సంస్థ పట్ల ప్రజలకు గల అభిమానాన్ని అభివ్యక్తం చేస్తున్నది. ఎన్నికల ఫలితాలు వెల్లడి కాగానే ఆమె గ్రామాల్లో పర్యటించి, పెక్కు సభల్లో పాల్గొన్నారు.

ఐదుగురు కుమారులు, ఒక కూతురు విమలాదేవిగారి సంతానం. ఒక కుమారుడు మెడిసన్ చదువుతున్నాడు. ఆమెకు ఇంటి పనులపట్ల అపారమైన అభిమానం. తీరిక సమయాల్లో గ్రంథపఠనం హాబీ. తెలుగులో ఆమెకు చక్కని ప్రవేశం ఉంది; ఇంగ్లీషు చదవడం, వ్రాయడం నేర్చుకున్నారు. చెప్ప దల్చుకున్న భావాలను నిష్కర్షగా చెప్పే సాహసం ఆమెలో కనిపిస్తుంది. తిరుమల వెంకటేశ్వరుడిని ఇటీవలనే ఆమె సందర్శించారు.

రాజకీయరంగంలో ప్రవేశించడానికి భర్త కారణం. ఆమె బంధువులంతా రాజకీయాల్లో ఉన్నవారే. మంత్రివర్యులు జె. వి. నర్సింగరావుగారి సతీమణి — విమలాదేవిగారు అక్కాచెల్లెళ్ల కూతుళ్లు. రాజకీయ ప్రపంచంతో సంబంధం లేకుండా స్వీయగృహ ప్రాంగణంనుండి సరాసరి శాసనసభా ప్రాంగణంలో పాదమిడిన శ్రీమతి విమలాదేవిగారు ప్రత్యేకతను సాధించుకోవలసివుంది.

—బాసాని సుదర్శన్ రెడ్డి ●

## డాక్టర్ సలహా

# స్వంతరక్తం ట్రాన్స్‌ఫ్యూషన్!

ఎంతో బాగుంది కదూ ఈ ఊహ!

శస్త్రచికిత్స పొందినతర్వాత రక్తం కావలసినవారికి, ఆపరేషన్‌ముందు వారి రక్తమేతీసి దాన్ని మళ్లీ ఎందుకు ఎక్కించకూడదు?

ఈవిధంగా ఇతరులనెత్తురువాడితే వచ్చే ప్రమాదాలనన్నిటినీ తప్పించుకోవచ్చు.

మనిషి దేహంలోనుంచి రెండు కప్పుల నెత్తురు ఆపరేషన్‌ముందు తీస్తే అపాయం ఏమీ ఉండదు. అసలు ఇలా తీస్తే శస్త్రచికిత్స మరింత బాగా జరుగుతుందని కొందరు వైద్యులు అంటారు.

ఆపరేషన్ జరిగే ఒకటి, రెండు వారాలముందు నెత్తురుతీసి ఉంచితే మంచిది. కొందరు వారానికి రెండు కప్పులచొప్పున రెండువారాలు తీస్తారు.

ఇది తేలికఅయిన పద్ధతి, అపాయంలేదు, ఖర్చుతక్కువ. అబ్బెట్టుగా కూడ లేదు!



హెచ్. ఎల్. హెర్మన్‌సెన్
(కాపీరైటు)

పి. ఎస్.

# పుష్టికరమైన ఆహారం

రోజుకొక యాపిల్ పండు తింటే అసలు డాక్టర్ దగ్గరకే వెళ్ళవలసిన అవసరం వుండదని ఇంగ్లీషులో ఒక సామెత వుంది అలాగే శరీరానికి ఆవశ్యకమైన పోషక పదార్థాలన్నీ మిశ్రమమైన ఆహారం తీసుకుంటే, అనారోగ్యం వుండదు మందుల వాడకం తగ్గుతుంది శరీరం శక్తివంతంగా మనస్సు ఉత్సాహంగా, మెదడు చురుకుగా పని చేస్తాయి నిజమే అయితే ధరలు విపరీతంగా పెరిగిపోయి, కల్తీలేని ఆహార వస్తువులు సకాలంలో దొరకడమే కష్టంగా వున్న ఈ కాలంలో పుష్టికరమైన ఆహారాన్ని కుటుంబ సభ్యులందరికీ అందించడం గృహిణికి ఎంతో కష్టంగా వున్నదంటే ఆశ్చర్యపడనక్కరలేదు పాలు, పళ్ళు, కాయగూరలు, బియ్యం, గోధుమలు, పప్పులు ఇవ్వన్నీ మనకి చాలా అవసరంకదా! పాల సంగతే తీసుకోండి పాల ధర చాలా పెరిగింది పల్లెల్లో తప్ప ఒక మాదిరి బస్తీల్లో పాలు, కల్తీ కలవనివి దొరకడం కష్టం శేరు రూపాయికి తక్కువ పొయ్యడం లేదు కుటుంబంలో అందరికీ త్రాగడానికి పాలు కావాలంటేనూ, రోజూ రెండు పూటలా అందరికీ చిక్కని మజ్జిగ అమరాలంటేనూ, రోజుకు రెండు మూడు శేర్ల పాలు కొనవలసిందే ఆ లెక్కన నెలకు 90 రూపాయలు పాల ఖర్చు అంచేత పాలు త్రాగడం అన్నది అందరికీ సాధ్యం కావడంలేదు. పసి పిల్లలకు, వ్యాధిగ్రస్థులకూ తప్పనిసరిగా ఇవ్వవలసి వుంటే చేసేదిలేక కొనడమే ఈ పాలు చిక్కనివీ, తాజావీ దొరకడం లేదు మిల్క్ ప్రాజెక్టు వున్నచోట కార్డు పెట్టుకుని క్యూలో నిలబడితే ఒక గంటకు వస్తాయి పాలు అది కూడా పాల సరఫరాని బట్టి పోస్తారుగానీ మనకి అవసరమైనన్ని పోయరు పళ్ళు కూడా అంతే బత్తాయిలు, కమలాలు, ద్రాక్ష, చక్కెరకేళీలు — యివ్వన్నీ కూడా వెల పొడుగునా కొనే స్తోమత మధ్య తరగతి గృహిణికిలేదు భోజనంలోకి రెండు పూటలా కూరలు కొనేసరికే కూరల ఖర్చు రోజుకు రూపాయి దాటిపోతుంది కూరలూ లేక, పళ్ళూలేక శరీరానికి అవసరమైన విటమిన్లు ఎలా సమకూరతాయి మరి! నెయ్యి కూడా కల్తీలేనిది దొరకదు దొరికితే ధర హెచ్చు బియ్యం కొంటే బ్లాక్‌లో కొనాలి లేకపోతే క్యూలో నిలబడి పోస్తిచ్చిన రకం తెచ్చుకుని తినాలి గోధుమలు కూడా పూర్వంలా దొరకడం లేదు. బియ్యం వాడకం తగ్గించమని పెద్దలు చెబుతున్నారు తగ్గిద్దాం అనుకుంటే, గోధుమలు దొరకవు మరి ఇంక ఏమి తినాలి? దొరకని వస్తువులు ఎక్కువ ధర హెచ్చించి కొనవద్దంటారు అసలిప్పుడు దొరికే వస్తువులేవి? దొరకనివేవి? ఇలాంటి పరిస్థితుల్లో గృహిణి కర్తవ్యం ఏమిటి!

విందులూ, వినోదాలూ తగ్గించి డబ్బు పొదుపుచేసి ఉన్నదాంట్లో పుష్టికరమైన ఆహారం తినాలని చెబుతాం మందులపై ఆధారపడేకన్న ఆ డబ్బుతో పళ్ళూ, పాలూ కొనుక్కోమంటాం ఖరీదైన బట్టలు, నగలు, కాస్మటిక్స్ మానివేయమంటాం ఇవన్నీ బాగానే వున్నాయి విందులనేవి ఎప్పుడోతప్ప మధ్యతరగతి కుటుంబాల్లో అరుదే వినోదాలకూ తక్కువే ఖర్చు పెడుతుంది పోతే నెలకొక సినిమా అయినా చూడాలనే ఆసక్తిని అరికట్టడం అసాధ్యం. ఒక సినిమా చూసేసరికి చాలా కష్టం. ఇంట్లో అందరికీ కట్టుకునేందుకు చాలు గైదుజతల బట్టలుండి, ఇబ్బందిలేకుండా గడిస్తేచాలు బంగారం ఖరీదైన చీరెలూ కొనగలిగే శక్తి ఆసక్తి నేటి మధ్యతరగతి గృహిణికి లేవు కాస్మటిక్స్ అంటారా, స్నో, పౌడర్ తప్పనిసరే – తక్కిన బ్యూటీ ఎయిడ్స్ కొనేవారు తక్కువమంది

కనుక నేటి మధ్యతరగతి గృహిణి చాలా ఓర్పుగా, నేర్పుగా సంసారం చక్కదిద్దుకోవలసివుంది ఇంటెడుపనీ ఓర్పుగా చేసుకుంటూ, అతిథి, అభ్యాగతులనుచూస్తూ, బజారు పనులుచేస్తూ ఇంకా వీలుంటే సంపాదిస్తూంది కూడా పూర్వం బట్టలు ఉతకడానికి చాకలివారిని రోజూ పెట్టుకునేవారు. ధాన్యమో అన్నమో పెడితే ఎన్ని బట్ట



క్లైనా ఉతుక్కొచ్చేవాళ్ళు వాళ్ళు. ఈనాడు బట్టలు బండలకేసి బాదేవికాదు కున్నితంగా ఉతికి ఆరవేయవలసినవి. ఈ బట్టలన్నీవేస్తే ధోబీ ఖర్చే చాలా అవుతుంది అందుకని ఎవరికివారే సబ్బుతో ఇంట్లో ఉతుక్కుంటున్నారు ఇలా అనేక విధాలుగా గృహిణి సంసారాన్ని ఎంతో పొదుపుగా చేస్తున్నది ప్రభుత్వం, వర్తకులు సామాన్య గృహిణికి శత్రువులు కాకూడదు సహకారం అందజేయడానికి సిద్ధంగా వుండాలి చవక ధరలకు ఆహారధాన్యాలు దొరికేటట్లు ప్రభుత్వమూ, స్వంతలాభం కొంత తగ్గించుకుని తోటివారికి సాయపడాలనే దృక్పథం వర్తకులకూ అలవడాలి అంతేకాకుండా వీలున్నంత వరకూ గృహిణులు పెరటితోటల్లో కూరలు పండించడానికి ప్రయత్నించాలి వేపుడు కూరలూ, పిండివంటలూ తగ్గించి పాలూ పళ్ళూ తినడం నేర్చుకుని పిల్లలకు కూడా అదే అలవాటు చేయాలి పిండి వంటల రుచి మరిగిన పిల్లలు పళ్ళు తినడానికి గొడవచేస్తారు అందుకని మొదటి నుంచీ వాళ్ళకి పళ్ళు, కాయగూరలు తినడం అలవాటు చేయాలి పండగలూ, అవీ వచ్చినప్పుడు బోలెడు డబ్బు ఖర్చుచేసి పిండి వంటలు చేయడానికి మనం వెనుదియ్యం కాని మామూలు సమయాల్లో ఒక డజను బత్తాయిలు కొనడానికి ఆలోచిస్తాం ఈ మన

# పుష్టికరమైన ఆహారం

స్తత్వం మారితేగానీ అజీర్ణ వ్యాధులు తగ్గవు మందుల వాడకం తగ్గదు కొందరు పిల్లలకు చాకలెట్లూ, బిళ్ళలూ తెగకొని పెడ్తారు ఇవి లెక్కలేకుండా తినడం వలన జబ్బులు రావడం ఖాయం వాటి బదులు ఏ సపోటాపళ్ళో అరటిపళ్ళో, ఏ సీజనులో ఏవి దొరికితే అవికొనిపెడితేఎంతో ఆరోగ్యం

కొందరు మొటిమలతో చర్మవ్యాధులతో, భారీ శరీరంతో బాధపడుతూ వుంటారు ఇలాంటి వాళ్ళు కొవ్వు పదార్థాలు తగ్గించడం ఎంతో మంచిది నెయ్యి ఖర్చు తగ్గించి దాని బదులు తేలికగా జీర్ణమయ్యే మరొక ఆహారం తీసుకోవచ్చు ఇలా తెలివిగా ఓర్పుగా ఆహారాన్ని ఒక పద్ధతి ప్రకారం తీసుకుని శరీరాన్ని శక్తివంతంగా తయారు చేసుకుని స్వయం శక్తితో పనులు చేసుకోగలగాలిగానీ, ప్రతి పనికీ పనిమనుషులమీద ఆధారపడి బ్రతకడం అనారోగ్యకరం కొందరి శరీరానికి బలమైన ఆహారం తీసుకోడమే తప్ప పరిశ్రమ వుండదు ఇలాంటి వాళ్ళకెప్పుడూ అజీర్ణవ్యాధులు వస్తూంటాయి అంచేత శరీరానికి పుష్టికరమైన ఆహారం ఎంత అవసరమో, పరిశ్రమ కూడా అంతే అవసరం ●




**వంటలు:**

## స్పానిష్ ఆమ్లెట్

కోడిగుడ్లు — 2
ఉర్లగడ్డ — మామూలు సైజుది 1
పచ్చిమిరపకాయ - సుమారు సగంకాయ
ఉల్లిపాయ సగం గడ్డ.
నెయ్యి లేక నూనె - సుమారు 4 చంచాలు.
ఉప్పు కావలసినంత

ఆమ్లెట్ బాగా రావాలంటే పాత్రలు శుభ్రంగా ఉండాలి గుడ్లని గిన్నెలోకి విరక్కొట్టి నురుగురాకుండా కలపాలి

నూనె లేక నేతిని వేడిచేసి గుడ్లని వేసి తొందరగా వండెయ్యాలి

తరిగిన ఉల్లిపాయ, పచ్చిమిరపకాయ వేరే సుమారు ఒకటిన్నర చంచా నూనె లేక నేతిలో కొద్దిగా వెయించి, ముక్కలుగా తరిగిన ఉర్లగడ్డవేసి మరికొంత వేగిన తర్వాత ఆమ్లెట్ లోపల 'కూర'గా వాడాలి

ఆమ్లెట్ వేసేముందే 'కూర' తయారు చేసి ఉంచటం మంచిది

## టొమేటో గుడ్లు

టొమాటోలు పెద్దవి 4
ఉల్లిపాయ పెద్దది 1
నూనె లేక నెయ్యి మూడు చంచాలు
గుడ్లు 4
పాలు సుమారు 6 చంచాలు
పిండి ఒక చంచా

తరిగిన ఉల్లిపాయ ముక్కలని సుమారు రెండున్నర చంచాలలో వేయించి ఎర్రబడగానే సగంగా తరిగిన టొమాటోలు వేసి అవి మెత్తబడేదాకా మరికొంత వేయించాలి మిగిలిన కొద్ది నెయ్యి లేక నూనె వేసిన తర్వాత అంతకి ముందే కలిపి ఉంచిన గుడ్లు, పాలు, పిండి (అవసరమయితే ఉప్పు) చేర్చాలి గట్టిపడుతూ ఉండగా తిరగవేస్తే గుడ్లు టొమాటో ముక్కల కింది భాగాలలో ఉండిపోతాయి

వేడిగా తింటేనే బాగుంటాయి

—ఎ వి ●

## అభియోగాలలో వింతలు

# డాక్టర్ల మీద దావా వేసిన వనిత

కుటుంబడాక్టర్లిద్దరు వైద్యం చేసిన ఫలితంగా తన కంఠస్వరం మారిపోయి సమాజంలో చాలా ఇబ్బంది పడవలసి వస్తున్నదని శ్రీమతి మారీన్ హక్స్ దావా వేసింది. ఆమె వయస్సు 31 సంవత్సరాలు 'పర్సెల్ హార్ట్' అను వాడడంవల్ల తనకు ఈ దుర్దశ పట్టిందని ఆమె అభియోగం.

మానసికంగా దెబ్బతిన్నట్టున్నందు వల్ల 'పర్సెల్ హార్ట్'లను సేవించ వలసినదిగా ఆమెకు డాక్టర్లు సలహా యిచ్చారు. రోజు కొకటి చొప్పున వాడమన్నారు. కానీ, ఒక్కొక్కరోజు మరచిపోయేది. అందుకని కొన్నిరోజులు నాలుగు వేసుకునేది.'

ఆమె ఫిర్యాదు ఇట్లా ఉన్నది: "నా వైద్యం సంగతి డాక్టర్ జాన్‌హల్యా కోల్ అతని భాగస్వామి డాక్టరు హెన్రీ పీటర్స్ నిర్లక్ష్యంచేశారు. ఫలితంగా నారక్తం కలుషితమైనది. మెదడు దెబ్బతిన్నది."

ఆమె న్యాయవాది శ్రీ జాన్‌వుడ్ న్యాయమూర్తి లాటన్‌కు ఇట్లా చెప్పారు: మృత్యు ముఖద్వారం వద్దకు చేరుకుంటున్న సమయంలో శ్రీమతి హక్స్‌కు అద్భుతమైన వైద్యం జరిగినది. ఆమె బ్రతికి బయట పడినది.

"1962 లో మూడవ కాన్పుకుముందు తన వేలిమీద ఏవో మచ్చలు కనిపించగా డాక్టరు కోల్‌ను సంప్రతించినది. "టెట్రసిక్లిన్" వాడారు ఆమెకు ఈ మందుకు లొంగని జబ్బు ఆమెవంట్లో ఉన్నదని ఆ తరువాత పరిశోధనాలయంలో జరిగిన పరీక్షలో తెలిసినది. అయినప్పటికీ మందును మార్చలేదు."

న్యాయస్థానంలో శ్రీమతి హక్స్ ఇట్లా చెప్పింది: 'కాన్పు తరువాత తొమ్మిదో నాడు ఆస్పత్రినుంచి విడుదలచేశారు నన్ను. పొట్టలోనెప్పి అప్పటికీ తగ్గలేదు. ఆస్పిరిన్ మాత్రలు రెండు ఇచ్చింది సిస్టర్.

"ఇంటికి వెళ్లాను. పొట్టలోనెప్పి ఎక్కువైంది. ఆరోజు శనివారం. ఆనాటి సాయంకాలం డాక్టరు కోల్‌ను పిలిపించాము. సోమవారంనాడు నేరుగా ఆస్పత్రికి తీసుకు వెళ్లాడు డాక్టర్ కోల్ నన్ను."

శ్రీమతి హక్స్ స్వరపేటిక శాశ్వతంగా దెబ్బతిన్నదని న్యాయవాది వుడ్ వాదించారు. గుర్తు పట్టడానికి వీలులేనంతగా మారి పోయింది ఆమెస్వరం. కొన్ని పదార్థాలు మింగడానికి చాలా బాధపడుతున్నది.

శ్రీమతి హక్స్ స్వస్థలం రోటింగ్‌టన్ లోని గోరామ్ అవెన్యూ. తనకు కలిగిన ఈకష్ట నష్టాలకు వెల్లింగ్టన్, ఫోర్ స్ట్రీట్ డాక్టర్లు పరిహారమివ్వాలని ఆమె వాదన.

శ్రీమతి హక్స్‌కు తాము అపకారం చెయ్య లేదని డాక్టర్లు వాదించారు.

తన భార్యమాటలను అర్థం చేసుకొనడం ఇప్పుడు చాలా కష్టమవుతున్నదని ఆమె భర్త ఎరిక్ చెప్పారు న్యాయస్థానంలో. "కులాసా కాలక్షేపాలలో ఇంతకు ముందు హాయిగా పాల్గొనేది. బయటకి వెళ్లడానికే భయపడుతున్నది ఇప్పుడు" అన్నారు. ●

## అల్లాటప్పయ్య

ఏమండోయ్ మీచొక్కాలు ఉతికేసేను. బూట్లు పాలిష్ చేసేను.. మీపేకలు మీ పేంటుజేబులో పెట్టేను. ఇంకా ఏంచెయ్యాలో చెప్పండే దబ్బున —

శాంతా...

నువ్వు దేవతవి

నన్ను భర్తగా పొందే అర్హతలన్నీ నీకున్నాయ్

ఎంత మంచివారో

సత్యమూర్తి

# మునిమనుమడి మేధా ప్రదర్శనం

ఇది పదకొండవ శతాబ్దంలోని చివరి దశాబ్దం నాటిమాట. వయసు మళ్లిన భక్తుడు ఒకాయన శ్రీరంగం నుంచి కంచికి నడిచి వెడుతున్నాడు. వెంటనే ఇద్దరు శిష్యులు కూడా వెడుతున్నారు. ఆయన పేరు ఆళవందార్ లేక యామునాచార్యుడు చాలాకాలం శ్రీరంగంలోనే ఉంటూ ఎందరికో జ్ఞాన భిక్ష పెడుతూ వచ్చాడు. ఒకనాడు, హఠాత్తుగా, కంచికి వెడుతున్నట్లు శిష్యులకి తెలియ చేశాడు. వారు ఆశ్చర్యపోయారు. ఈ వయసులో ఇంత దూర ప్రయాణం చెయ్యగలడా అని సందేహించారు. అసలు తమ గురువు కంచికి ఎందుకు వెడుతున్నదీ వారికి తెలియదు, ఆయన చెప్పలేదు. గత్యంతరం లేక ఇద్దరిని వెంటపంపించారు.

కాంచీపురం చేరగానే ఆళవందార్ వరదరాజస్వామి ఆలయంలోకి వెళ్లిపోయాడు అక్కడ ఒక మూల వేదాంతోపన్యాసం జరుగుతోంది ఉపన్యాసకుడు మహాపండితుడయిన యాదవ ప్రకాశుడు. ఉపన్యాసం వినే యువ శిష్యులలో ఒక వ్యక్తి పేరు రామానుజుడు. అప్పటికి అతని వయసు పన్నెండు మాత్రమే. అంత చిన్న వయస్సులోనే ఎంతో మేధావిగా వెలిగి పోయేవాడు. వేదాంత సిద్ధాంతాలని చక్కగా అర్థం చేసుకున్నవాడేమో ఉపన్యాసం జరుగుతున్నప్పుడు ఎన్నో విషయాలు గురువుగారితో చర్చించాడు.

ఒక మూలగా ఇదంతా గమనిస్తున్న యామునాచార్యుడు చాలా సంతోషించాడు. వచ్చినట్లే శ్రీరంగానికి తిరిగి వెళ్లిపోయాడు. శ్రీరంగం చేరుకున్న తర్వాత తను కంచికి ఎందుకు వెళ్లిందీ చెప్పాడు శిష్యులకి.

ఆళవందార్ శ్రీరంగంలో వానప్రస్థాశ్రమం స్వీకరించిన తర్వాత అతని మనుమడు శ్రీశైలపూర్ణుడు, తాతగారి అనుమతితో, తిరుపతికి వెళ్లిపోయి శ్రీ వేంకటేశ్వరస్వామి సన్నిధిలో జీవించటానికి నిశ్చయించుకున్నాడు. ఈయన తన చెల్లెలిని ఆ సూరికేశవుడనే ఆయనకిచ్చి పెళ్లిచేశాడు. ఈ దంపతుల కొడుకే ఆళవందార్ చూసిన యువ మేధావి, రామానుజుడు. వానప్రస్థాశ్రమం స్వీకరించిన ఆళవందార్ ఇంతకి ముందెప్పుడూ తన మునిమనుమడిని చూద్దామనుకోలేదు కాని అతని మేధాశక్తి కీర్తి గురించి తెలుసుకున్న తర్వాత కంచి వెళ్లిరాకుండా ఉండలేకపోయాడు.

కొన్ని సంవత్సరాలు గడిచాయి. ఆళవందార్ మరణశయ్యమీద ఉన్నాడు. తన తర్వాత పీఠాధిపతి రామానుజుడు అవాలని అతని కోరిక. దానిని శిష్యులకి తెలియచేశాడు.

రామానుజుడు వేదాంత సిద్ధాంతాలని పూర్తిగా తెలుసుకున్నాడు. తల్లి కోరికని కాదనలేక వివాహం చేసుకున్నాడు. కాని, కొంతకాలం తర్వాత భార్యని పుట్టింటికి పంపించివేసి, సన్యాసాశ్రమం పుచ్చుకున్నాడు. అందువల్లనే, ఆళవందార్ శిష్యులు వచ్చి తనని పీఠాధిపతి కమ్మని కోరినప్పుడు సంతోషంగా అంగీకరించాడు. అతను శ్రీరంగం చేరేటప్పటికి ఆళవందార్ చనిపోయాడు.

పీఠాధిపత్యం వహించినతర్వాత రామానుజుడు బ్రహ్మసూత్రాల వ్యాఖ్య రాశాడు. దీనినే 'శ్రీ భాష్యం' అంటారు. ఇది రాసినందువల్లనే రామానుజుడికి 'భాష్యకారు'డనే బిరుదు వచ్చింది. రామానుజుడు రాసిన ఇతరగ్రంథాలు కొన్ని—భగవద్గీత వ్యాఖ్య, 'వేదాంతదీపం, వేదాంతసారం, వేదాంత సంగ్రహం, గద్యత్రయం.'

విశిష్టాద్వైతమతం స్థాపించినది రామానుజుడే, ఉపనిషత్తులు, ఆళ్వార్ల పాటలు ఈ మతానికి ఆధారాలు. విశిష్టాద్వైతమత స్థాపకుడుగా రామానుజుడు విశేషకీర్తి సంపాదించి నప్పటికీ శైవమతాభిమానం అధికంగాకల చోళరాజు కుళోత్తుంగుడు అతనిని హింసపెట్టటం ప్రారంభించటంతో శ్రీరంగం వదిలి హొయిసాలరాజ్యానికి పారిపోవలసి వచ్చింది. అక్కడ రాజు బిట్టిదేవుడిని రామానుజుడు వైష్ణవమతానికి మార్చాడు. ఈ రాజు సహాయంతో గట్టి వైష్ణవమత ప్రచారం ప్రారంభించాడు.

ఇంతలో చోళరాజు మరణించాడు. అతని తర్వాతివాడు వైష్ణవమత ద్వేషికాడు. రామానుజుడు శ్రీరంగానికి తిరిగి వచ్చివేశాడు.

తన జీవితాంత కాలం వనివాసిస్తూ ఉండగా డెబ్బయినలుగురు శిష్యులని పిలిచి తను స్థాపించిన వివిధ కేంద్రాలలో తన ప్రతినిధులుగా నియమించాడు.

రామానుజాచార్యులు ఈ లోకాన్ని క్రీ.శ. 1137 లో తన 120 వ ఏట వదిలి వెళ్లినట్లు సాంప్రదాయం.

—ఎస్.



# గొలుసుకథ | జి.వి.సాయికుమారి

## 2వ భాగం

# పరివృత్తం



▣ నా పేరు ఇందిర. బసవరాజు అండ్ బ్రదర్స్ బ్రాంచిలో చేరి అప్పుడే వారం రోజులైపోయింది. ఇక్కడున్న మనుషుల తత్వాలు నాకు బొత్తిగా అర్థం కాలేదు ఈ వారం రోజుల్లో. పద్మ, ముకుందల్రావు వీళ్లిద్దరే నాకు బాగా తెలిసిన మనుష్యులు.

ప్రతిరోజు మధ్యాన్నం ఒంటి గంటకి రాంప్రసాద్ కారు హారన్ వినగానే, పిల్లి మెడలో గంట శబ్దం విన్న ఎలకల్లా చెల్లా చెదురుగా అటు, ఇటు పరుగెడుతారు మిగతా జనం. ఆఫీసులో అడుగుపెట్టి రాంప్రసాద్‌ని చూచినప్పుడు ముకుందం లేచి నుంచోవటం గాని, కనీసం విష్ చెయ్యటం గాని జరుగదు. ప్రతిరోజు రాంప్రసాద్ ఒక్క నిముషం ముకుందం సీటు దగ్గర కావాలనిచెప్పి ఆగి ఒక పురుగును చూచినట్టు అతన్ని చూసి తన రూంలోకి వెళ్లిపోతుంటాడు.

పాపం, రాంప్రసాద్ అవస్థ చూస్తుంటే నవ్వు వస్తుంది నాకు మకుటంలేని రాజు ననుకుంటాడు తను అతని భ్రమకి ప్రత్యర్ధిగా ముకుందం ఒక్కడే కన్పించాడు నాకు అయినా ముకుందం మూర్తీభవించిన శోకంలా వుండేవాడు

ముకుందం ఆ రోజుల్లో ఎలా వుండేవాడు? అరవై రెండులో గాబోలు నేను పి. యూ. సి చదివేటప్పుడు అతను ఫైనలియర్ చదివేడు ఆ రోజుల్లో చాకులా తళుక్కు మంటుండేవాడతను అప్పుడతను కవిత్వం రాసేవాడు వార్షికోత్సవంలో అతని కవిత్వం ఒక ప్రత్యేకమైన కార్యక్రమం. అతను చక్కగా పాడేవాడు, లతని గొంతులో అమృతం పుష్కలంగా వుండేది ఆరోజుల్లో అతన్ని చూసి అనుకునేదాన్ని—'ముకుందం ఏనాటికైన వెలిగిపోగలడని' పాపం! ఎలా అయిపోయాడో. మునుపటి ఉత్సాహం, మునుపటి కళాకాంతు లిప్పుడు లేవు అన్నిటినీ పోగొట్టుకొని కేవలం అభిమాన ధనంతో బతుకుతున్నాడతనిప్పుడు మే గడ్ బ్లెస్ హిమ్!

'ఏమిటి ఆలోచిస్తున్నావు' అన్నది పద్మ టైపు మిషన్ ఆపి. ఆ మిషన్ ఆపితే పెద్ద వర్షం వెలిసినట్లు వుంటుంది నాకు.

'ముకుందం గురించి పద్మా' అన్నాను నవ్వుతూ.

ఆ మాట విని పద్మ ఆశ్చర్యపడిపోలేదు.

'అతను మా కాలేజిలోనే చదివేవాడు. నాకు సీనియర్. నేను గుర్తు వుండివుండ దతనికి. నాకు ఆశ్చర్యంగా వుంది పద్మా! అంతి సరదా అయిన మనిషి ఇప్పుడిట్లా ఎందుకు మారిపోయాడాని'

పద్మ పన్నగా నవ్వి కళ్లు ఎత్తి చూడకుండానే 'ఈ ఆఫీసే ఒక పెద్ద ఆశ్చర్యం. ఆఫ్టరాల్ అతనెంత?' అన్నది

పద్మ చెప్పినట్లు ఆఫీసంతా వింత వింతగా వున్నది కాని ఆ వింత ఇంత

వరకు నా వరకు రాలేదు. అందుకే నిర్లక్ష్యంగా నవ్వి వూరుకున్నాను ఎదురుగా వున్న గోడగడియారం ఐదు కొట్టింది. పద్మ వెంటనే కుర్చీలోనుండి లేచి,

'ఊ, పద, పద అంతా వెళ్ళేవరకు వుండటం మనకంత మంచిది కాదు' అంటు నా టేబుల్‌మీద కాయితాలు కూడ గబగబ సర్ది పక్కన పెట్టేసింది. ఇద్దరం హుషారుగా రోడ్డుమీద పడ్డాము.

రూం తాళం తీస్తునే ఉష్ మంటు చాప మీద చతికిలపడ్డాను. నన్ను చూసి నవ్వింది పద్మ.

'అప్పుడే ఇంత హైరానా పడిపోతున్నావు. ముందు ముందు మన్నేం భరించ గలవు ?' అంటు దొడ్లోకి వెళ్ళి కాళ్ళు కడుక్కుని స్టౌ వెలిగించి కాఫీకి నీళ్ళు పడేసింది.

'ఊ, వూ లేచి కాళ్ళు ముఖం కడుక్కురా, ఇంతలో కాఫీ అయిపోతుంది. కాఫీ తాగితే కొంచెం ప్రాణం కుదుటపడుతుంది' అన్నది

పద్మకి నామీదవున్న ప్రేమని చూస్తుంటే ఎన్ని జన్మాల అనుబంధమో ఇది అనిపిస్తుంది ఏ క్షణాన్ని పద్మని చూశానోగాని నా అదృష్టం! నాకు వేరే రూం కావలసిన అవసరం కలగనియ్యలేదు పద్మ ఏం తెలియని అమాయకురాలినట నేను వంటరిగావుంటే ప్రమాదమట అందుచేత వేరే ఎక్కడో వుండద్దు తనదగ్గరే వుండమని బలవంతం చేసింది పద్మ వంట వార్చి కంచంలో వడ్డిస్తే తినటమే నా పని నేనేమైనా పని దగ్గరికివస్తే ఖస్సుమనేది

పద్మ గది మరీ పెద్దదికాదు చాల చిన్న గద నే చెప్పాలి మా ఆఫీసుకి ఈ అద్దె గది చాలదూరం వూరిచివర్లో ఇరుకు సందుల్లో వుంటుందా గది గాలి వెలుతురికి నోచుకోలేదు అద్దె తక్కువని పొరుగు మంచిదని ఈ మూల తీసుకుందట పడుకు నేప్పుడు రెండు చాపలు వేసుకునేవాళ్ళం మళ్ళి వంట, భోజనాలు చేసేటప్పుడు వాటిని తొలగించి వేయవలసిందే గదికి ఒకటే కిటికీ, గదికి ఓమూల ఒక బల్ల, దాని మీద ఒక కూజా, గ్లాసూను ఇంకో ప్రక్క మా ఇద్దరి ట్రంకుపెట్టెలు గదికి మధ్య ఒక దండెం ఇదీ మా ఆస్తి అన్నిటికంటే చిత్రమైనది గదిలో ఒకచోట సాలీడొకటి సాలెగూడు అల్లటం ప్రారంభించేది. పద్మ రోజు చీపురుతో తుడిచి ఆ పురుగుని తరిమేసినా మళ్ళి మరో సుప్రభాతాన ఆ పురుగు మా గదిలో మరోమూల తన ప్రయత్నం కొనసాగిస్తుండేది! నా కిదంత చిత్రంగా వున్నది

'ఇదిగో కాఫీ, కాళ్ళు ముఖం కడుక్కోలేదుగా' అన్నది పద్మ కాఫీగ్లాసు నా ముందు పెడుతూ.

'కాఫీ తాగి కడుక్కుంటానులే పద్మా. భలే బద్ధకంగా వుంది' అన్నాను

ఆమె కూడ తన గ్లాసు తెచ్చుకొని నా ప్రక్క కూర్చుంది. 'పద్మా' అన్నాను కాఫీ తాగుతూ.

'వూ.'

'రాంప్రసాద్ నువ్వు అన్నంత—అదే మనం అనుకున్నంత విచిత్రంగా ఏం లేడే' అన్నాను.

'తొందరపడకు. క్రొత్త పిట్ట బెదిరి పారిపోతుందేమోనని ఇంకా వుచ్చులు పన్నలేదు! అట్లాంటి పరిస్థితులు రాకుండానే వుండాలి. వస్తే, భరించగల ధైర్యం నీకిమ్మని భగవంతుడిని ప్రార్థిస్తున్నాను' అన్నది కాళీ గ్లాసులు తీసుకు వెళ్ళిపోతూ

* * *

'ఎక్కడినుండి వుత్తరం' అన్నది పద్మ స్టైపు చేస్తూనే

'అమ్మ రాసింది' అన్నాను చదివేసిన వుత్తరం మడిచి కవర్లో పెడుతు

'అన్నయ్యకి వారం రోజులనుండి వంట్లో ఏం బాగాలేదట మందులు వాడేందుకు చేతిలో డబ్బు లేదట పోతే—నా జీతం. ఈ జీతం చేతిలో పడేందుకు కొన్ని రోజు లాగాలి. ఏం చెయ్యాలో తోచకుండా వుంది పద్మా'

'నా దగ్గిర ఒక పది రూపాయిలున్నాయి ప్రస్తుతానికి అవి పంపేయి నువ్వేం బాధపడకు' అన్నది పద్మ నన్నూరడిస్తు.

వెనకేదో చప్పుడయితే చటక్కున తిరిగేను నిశ్చేష్టురాలనైపోయి నా నోట మాట రాలేదు. మా వెనక జగన్నాధం! ఇందాకటి నుండి మా మాటలు వింటున్నాడన్నమాట నేను చూడగానే తడఒడుతూ ఏదో పని వున్నట్లు అక్కడినుండి వెళ్ళిపోయాడు.

'జగన్నాధం మన వెనక నుంచుని మన మాటలు వింటున్నాడు' అన్నాను గాబరాగా

'ఇందాకటినుంచి నువ్వు అతన్ని చూడలేదా ? నేను ఎప్పుడో చూశాను. అతని పాడుబుద్ధి తెలుసు నాకు' అన్నది పద్మ నిశ్చింతగా.

రెండు మూడు గంటల తరువాత వాగన్న వచ్చి 'అయ్యగారు పిలుస్తున్నారమ్మా' అన్నాడు.

ఆ మాట వినగానే నా గుండె దడ దడ లాడింది. లేచి నుంచున్నాను ఇక్కడ వుద్యోగంలో చేరిన తరువాత రాంప్రసాద్ నన్ను పిలవడం ఇదే మొదటిసారి!

పద్మ నా వంక జాలిగా చూసింది. నాలుగడుగులు వేశాను

'కొత్తావిడ క్కూడ పిలుపొచ్చిందిరోయ్' అన్నారు వెనకాల ఎవరో

'అవును పాపం, కానీ ఆలస్యంకదూ' అిట్టేకాదు మరొకడు

వెంటనే పకపకలు! అసహ్యం అనిపించి గబుక్కున వెనక్కి తిరిగి చూశాను అంతా నావంక విలాసంగా చూస్తున్నారు. ముకుందంమాత్రం తలవంచుకొని వ్రాసుకుంటునే వున్నాడు!

రాంప్రసాద్ ఖరీదైన రోజ్‌వుడ్ కుర్చీలో ఖరీదైన బట్టల్లో ఖరీదుగా వున్నాడు అందమైన 'కళ్లజోడు ఫ్రేం సవరించుకుంటు తల వంచుకొని కాయితాలు చూస్తున్నాడు. ఒక్కనిముషం తలుపుదగ్గర నుంచుండి పోయాను.

అతని టేబుల్‌మీద అయిదురూపాయిల నోట్లు కట్ట సీలింగ్ ఫానుగాలికి రెపరెపలాడుతుంది. దానికి దగ్గర్లో ఎర్ర గులాబీలు పసుపు గులాబీలు ఆకులతో గుత్తిగా కట్టివున్నాయి

'కమిన్ మిస్ ఇందిరా! మీకోసమే చూస్తున్నాను. కూర్చోండి' అన్నారు

అతనికి ఎదురుగా కుర్చీలో కూర్చున్నాను. రెండుమూడు నిముషాలు అతనేం మాట్లాడలేదు. నాకేంతోచక గులాబీలని తీసుకొని చూస్తున్నాను ఆకుల్లోవున్న గులాబిముల్లు నా వేలులోకి దిగిపోయింది. 'అబ్బా' అంటు గుత్తిని టేబుల్‌మీద పెట్టేశాను.

'అరే, ముల్లుగుచ్చుకుందా? నాన్సెన్స్! అంత అందమైన పూవుచుట్టు ముళ్ళేమిటి చెప్పండి? అందుకే దేవుడ్ని తలుచుకోవాలంటే చెడ్డచిరాకు నాకు ఆ ముళ్ళకి బదులు ఏ మున్నితమైన ఆకులోవుంటే గులాబికి యింకా

# పరివృత్తం

మరకు పట్టినట్లు ఎంత అందంగా వుంటుంది? దేవుడు కొన్నికొన్ని విషయాల్లో దానవుడై పోతుంటాడు. నన్నడిగితే అందరికి ఆనందాన్నిచ్చే అందమైన వస్తువు అందమైన చోటేవుండాలి ఉదాహరణకి మనుషుల్నే తీసుకుందాం అందమైన అమ్మాయిలుంటారనుకోండి, వాళ్ల చుట్టాలు కష్టాలు, దుఃఖాలు ఆవరించేస్తే చూసే నాబోటివాడేమైపోవాలి' దేవుడసలు లేనేలేడనుకుంటాను. అవునా?' అన్నాడు నవ్వుతూ.

తలెత్తి అతనివేపు చూశాను అందంగా నవ్వుతున్నాడతను. అందమైన కళ్ళజోడులో నుండి అతని కళ్ళు కూడ నవ్వుతున్నాయి కాని ఆ నవ్వు వెనక, ఆ కళ్ళవెనక ఏదో కాంక్ష ఎదుటి మనిషిని తినేసేటట్లున్నాయి

'మాటల్లో మర్చిపోయాను మిస్ ఇందిరా! మీకేదో డబ్బు అవసరం వచ్చిందట కదూ?' జగన్నాథం చెప్పాడు ఏదైనా అలాటి అవసరం వస్తే మీరంత బాధపడిపోగూడదు. మీ అవసరాల్లో ఆదుకునే మనిషిగా నేనున్నాను' అంటు టేబుల్‌మీద నోట్లకట్ట నాముందుకు విసిరాడు.'

'తీసుకోండి, మీ ఇష్టం వచ్చినంత తీసుకోండి'

గబగబా ఒక యాభై రూపాయిలు తీసుకొని మిగతాది టేబుల్‌మీద పెడుతూ. 'థేంక్సు. సమయానికి ఆదుకున్నారు. నా జీతం రాగానే తిరిగి ఇచ్చేస్తాను' అన్నాను మెల్లిగా.

'నాన్సెన్స్. వాట్ మిస్ ఇందిరా? మీకిచ్చిన వెధవ యాభైరూపాయలు మళ్లీ తీసుకోనా? ఈచేతో వేలకివేలు సంపాయిస్తూ మరోచేతో అంతా ఖర్చు చేస్తుంటాను. నాకొచ్చే జీతం నా కారు పెట్రోలుకే సరిపోదు అవుతే నేనింత ఎలా సంపాయిస్తున్నానో, ఎలా బ్రతుకుతున్నానో మీకు తెలుసా. బహుశః తెలీదేమో! చెప్తాను వినండి నేను మడికట్టుకోను నాకు తోచింది, మంచిదనిపిస్తే దాన్ని వెంటనే చేసి పారేస్తాను. అది నీతి కానిండి, అవినీతి గానిండి. అంతే మీరు గానిండి, నేను గానిండి—మనం తలుచుకుంటే కాని పనంటు వుండదు, వుండకూడదు. అందుకే నాచేతుల్లో కనక వర్షం కురుస్తుంటుంది. అట్లాంటి నేను మళ్ళీ మీ దగ్గరనుండి యాభై రూపాయిలు తీసుకుంటానా? షేమ్ నా వుద్యోగానికే షేమ్' పకపక నవ్వేశాడతను

అతనలా నవ్వేసరికి నేను బాగా భయపడిపోయాను—నవ్వుకుతోడు మనిషి వూగుతున్నాడు. గుండె దడదడ లాడింది. మరేం మాట్లాడకుండా 'థేంక్స్ సార్' అంటు గబగబ గదినుండి బయటపడ్డాను.

'యాభై రూపాయిలు ఇచ్చాడు పద్మా! జగన్నాథం చెప్పాడట నాకు డబ్బు అవసరంగావుందని' అన్నాను మెల్లిగా

'ఇదంతా నీమీద జాలికాదు ఇందిరా! రాంప్రసాద్ డబ్బుకి లొంగని వస్తువు ఈ ప్రపంచంలోలేదనుకుంటాడు జాగ్రత్త' అదోలా నావంకచూసి చెప్పింది పద్మ

* * *

'మిస్ ఇందిరా' కారు డోర్‌కి ఆనుకొని నుంచుని నన్ను పిలిచారు రాంప్రసాద్. అయిదయింది. పద్మ, నేను గేటుమండి బయటికి వస్తున్నప్పుడు అతని పిలుపు వినబడగానే, నేను పద్మ ఒక్కసారే వెనక్కి తిరిగి చూశాము. అతను పిలుస్తుంటే వెళ్ళటమా, మానటమాని ఆలోచిస్తు వుండిపోయాను నాతో ఏమీ చెప్పకుండానే పద్మ చర, చర ముందుకి నడిచింది నేను మెల్లగా అతనిదగ్గరకి వెళ్ళాను

'మిస్ ఇందిరా, మీకేం అభ్యంతరం లేకపోతే అట్లా చల్లగాల్లో షికారుగా వెళ్ళదాం' అన్నాడతను.

వెంటనే ఏంచెప్పలేకపోయాను. వెనక్కి తిరిగి చూసేసరికి పద్మ కనుచూపు మేరలో వున్నది. గుండె నిబ్బరంచేసుకుని 'పదండి' అన్నాను.

'దటీజ్ గుడ్, మంచి అమ్మాయిలంటే అట్లా వుండాలి, కమిన్ హార్టీ వెల్‌కమ్' అంటు ఫ్రంటుసీటు డోర్ తెరచి పట్టుకున్నాడు నేను కూర్చోగానే తలుపువేసి తనూ వచ్చి కూర్చుని కారు స్టార్టుచేశాడు. కారు కదిలింది.

'ఏమైనా మాట్లాడండి ఇందిరా!' అన్నాను.

'ఏంమాట్లాడను' జంకుతూ అన్నాను.

'అందమైనవారు ఏంమాట్లాడినా అందంగానే వుంటుంది' అంటూ నవ్వేశాడతను.

# పరివృత్తం

[illegible] అవసరంగా తప్పుతాడు.

కారు కృష్ణా బేరేజ్ మీద ఒక ప్రక్కగా పార్కు చేశాడు. చుట్టూ చీకట్లు కమ్ముకుంటున్నాయి బేరేజి మీద లైట్లు వెలిగాయి దూరంగా వూళ్లో వున్న లైట్లు నక్షత్రల్లా మెరుస్తున్నాయి. కృష్ణ గాలికి ప్రాణం లేచివచ్చినట్లనిపించింది నాకు

ఆ చల్లగాల్లో రాంప్రసాద్ ఎక్కడే చాల మాట్లాడేస్తున్నాడు అంత చల్లటి గాల్లో నాకు మా అద్దెగది గుర్తుకు వచ్చింది

'రోజూ ఇక్కడికి వచ్చేవాళ్ళు ఎంత అదృష్టవంతులో' అన్నాను అప్రయత్నంగా

'ఎవరో ఎందుకు కావాలి? ఆ అదృష్టవంతులు, మనమే కాకూడదూ? అన్నట్లు అడగటం మర్చిపోయాను, మీకేమయిన డబ్బు అవసరమా?' అన్నాడు సిమెంటు బెంచిమీద కూర్చుంటూ నేనేం చెప్పలేదు. నేనింకా నించునే వున్నాను అప్పుడతనే అన్నాడు 'కూర్చోండి ఇందిరా! అంత సిగ్గుపడతారే? చదువుకున్నవాళ్ళు కూడ ఇంత విడ్డూరంగా వున్నారు గనకనే ఈ దేశం ఇట్లా అఘోరిస్తుంది కూర్చోండి' అన్నాడతను తన ప్రక్క కూర్చోమన్నట్లు స్థలం చూపిస్తూ

బల్లకి చివరగా ఒదిగి కూర్చున్నాను కొంచెం జరిగితే క్రిందపడేట్లున్నది నా పరిస్థితి చాలసేపు నేనలాగే బొమ్మలా కూర్చుని అతని ఆవేశమంతా విన్నాను చివరికి నేనే అన్నాను 'ఇంక వెళ్ళదాము, పద్మ నాకోసం చూస్తుంది'

'పద్మా?' ముఖం చిట్లించాతడను 'పద్మ గురించి మాట్లాడకండి ఇందిరా! నా కసహ్యం. ఆ అమ్మాయి కంటే ఒకరాయి నయం'

అప్పుడు నేనేం మాట్లాడలేదు అతనే మనుకున్నాడో ఏమో

'ఊఁ సరే పదండి మీరుండేదీ ఆమె రూంలోనే నేమిటి? యమకూపం! పద్మకి సుఖపడటం చాతకాదు మిమ్మల్ని సుఖపడనీయదు' అంటు చరచర కారువైపు నడిచాడతను కోపంగా

*  *  *

మరో రోజు 'మిస్ ఇందిరా, జేమ్స్ బాండ్ సినిమా వచ్చిందని తెలిగానే మనిద్దరికి టికెట్లు బుక్ చేయించాను సాయంత్రం నాకు చెప్పకుండా వెళ్ళిపోకండి' అన్నాడు రాంప్రసాద్ ఆఫీసులో నా టేబుల్ దగ్గరకి వచ్చి నుంచుని

ఈ మాట పద్మకూడా విన్నది ఏమైనా సరే వెళ్ళి తీరాలనుకున్నాను అందుచేత ఆ సాయంత్రం నేను రాంప్రసాద్‌తో బాటు సినిమాకి వెళ్ళాను

'సినిమా చూస్తున్నంతసేపు పద్మే గుర్తుకు వస్తుంది సరిగ్గా చూడలేకపోయాను సినిమా మధ్యలో అకస్మాత్తుగా నా చేతిమీద రాంప్రసాద్ చెయ్యి పడింది. వులిక్కిపడి నా చేతిని లాక్కోబోయాను. కాని, రాంప్రసాద్ నా చేతిని ఇంకాస్త గట్టిగా వుచ్చుకున్నాడు తల ఎత్తి అతని ముఖంలోకి చూశాను నవ్వుతున్నాడతను ఏం చెయ్యటానికి తోచక మెల్లగా చెయ్యి విడిపించుకున్నాను ఇంక తరువాత సినిమా అసలు చూడలేకపోయాను సినిమా అయిపోయిన తరువాత కారెక్కాను కారు కదిలింది. ఏం జరుగనున్నదోనని నా గుండెల్లో భయంగా వున్నది రాంప్రసాద్ నా భుజం మీద చెయ్యి వేశాడు చీమలు పాకినట్లు అయింది నాకు చుర, చురా చూశాను

'ఏం అంత భయపడతావు? నీ కిది క్రొత్తలా వుంది' అన్నాడతను ఏమనుకున్నాడో గాని—ఆపైన ఇంకేం మాట్లాడలేదు తిన్నగా అద్దె గది ముందు కారు ఆపేడు భగవంతుడికి మనస్సులోనే ధన్యవాదా లర్పిస్తూ గదిలో అడుగు పెట్టాను. పద్మ ఇంక భోంచెయ్యకుండా నా కోసం కూర్చుంది అప్పుడు పద్మ ముఖం సూటిగా చూడలేకపోయేను.

లైటు తగ్గించి పడుకన్నాము పావు గంట గడిచాక ఎందుకో అమ్మ, అన్నయ్యలు గుర్తుకు వచ్చారు అప్రయత్నంగా కళ్ళ నీళ్లొచ్చాయి. అమ్మ, అన్నయ్యల ప్రేమలో అల్లారుముద్దుగా పెరిగేను పరిస్థితుల ప్రభావంవల్ల ఇట్లా రావలసి వచ్చింది. మళ్ళీ ఎప్పుడు వెళ్ళి వాళ్ళ దగ్గర పడతాను!

'ఇందూ, ఏడుస్తున్నావా?' అన్నది పద్మ నా వైపు ఆశ్చర్యంగా చూస్తూ

'ఛా లేదు లేదే' అన్నాను

'ఇందూ, చిన్నదానవని ఒక్కమాట చెపుతున్నాను ఏం అనుకోక ఆడది హద్దులు మీరి ప్రవర్తిస్తే అందం వుండదు అయిన దానికి విచారిస్తే లాభం వుండదు కుసుమకేం జరిగిందో నీకు చెప్పనే చెప్పాను.' అన్నది పద్మ.

తల ఎత్తి చూశాను సాలెపురుగు గబ గబ గూడ అల్లేస్తుంది చూస్తుండగానే అది రాంప్రసాద్ అయిపోయింది రాంప్రసాద్ కుసుమ చుట్టూ, నా చుట్టూ సాలె గూడు అల్లేసి మమ్మల్ని మింగేయటానికి వస్తున్నాడు కెవ్వున కేకవేసి దిగ్గున లేచి కూర్చున్నాను. నా కేక విని ఏం అర్థంకాక

మా ఆయన్ని ఎప్పుడూ ఇంట్లోనే కూర్చోమంటూ ఆయన ఇలా వరండాలో కూర్చోడం నాకిష్టంలేదు ఆయనకి చలిగాలి పడదు కూడాను

నా వంక తెల్లబోయి చూస్తోంది పద్మ.

* * *

పద్మ పుట్టినరోజు పద్మకి ప్రజెంటేషన్ కొనటానికి బజారు వెళ్ళాను ఒంటరిగా. తెలుపుమీద వైలెట్ పువ్వుల కటావాయిల్ చీర వైలెట్ జాకెట్టు పీసు తీసుకున్నాను ఇరవైమూడు రూపాయిలయింది పావలాకు మల్లెపువ్వులు తీసుకున్నాను టైం ఐయిదయి పోతుంది

ఈ సరికి ముకుందం వచ్చేసివుంటాడు, పద్మ నా కోరికమీదే ముకుందాన్ని ఒక్కడినీ పార్టీకి పిలిచింది. నేనే పద్మకి ఇష్టమైన గులాబ్‌జాం, విజిటబుల్ సమోసాలు చేశాను వెళ్ళుతూ ఒకడజను చక్కరకేళిలు కొనుక్కు వెళ్ళితే సరిపోతుంది నడిరోడ్డుమీది నా ఆలోచనలకి చిన్నకారు ఆనకట్టలా నిలబడింది

'ఏయ్! నడిరోడ్డుమీద నడుస్తున్నాననుకుంటున్నావా? ఆకాశంలో విహరిస్తున్నాననుకుంటున్నావా? కొంచెంపుంటే కారుక్రింద పడేదానివి' అంటున్నాడు డ్రైవర్.

ముందుసీట్లో అందమైన అమ్మాయి నన్నే చూస్తోంది గబుక్కున కారుదిగి నాచెయ్యి పట్టుకొని 'నువ్వు ఇందిరవి కదూ? నేను గుర్తున్నానా? సరళనీ'

సరళెవరో వెంటనే గుర్తుకు రాలేదు నీకు.

'ఇంకా గుర్తురాలేదా? మనం బందర్లో సెకండుఫారం చదువుకున్నాము...'

ఇంకా ఏమిటో అంటుంది. అవును గుర్తుకు వచ్చింది. ఒకరోజు సైన్సు టీచరు 'నీరు ఎందుకు పల్లంలోకి ప్రవహిస్తుంది' అని అడిగారు క్లాసులో. సరళ టక్కునలేచి,

'నీరు పల్లమెరుగు, నిజం దేవుడెరుగు అంటారు కదండి! అందుకు.' అన్నది తడుముకోకుండా. టీచరుతోసహా క్లాసంతా గొల్లుమన్నారు. ఆనాటి సరళకి, ఇప్పటి సరళకి చాలమార్పు కన్పించింది నాకు. అందుచేతనే వెంటనే గుర్తుపట్టలేకపోయాను.

సరళా వాళ్ళు లక్షాధికారులు. వాళ్ళ నాన్నగారు ఏదో బిజినెస్ చేస్తూ, మా చిన్నతనంలోనే బొంబాయి వెళ్ళిపోయారు. అప్పటి సరళని మళ్ళీ, ఇప్పుడు చూశాను ఆనందం పట్టలేకపోయాను.

# పరివృతం

'ఏలా, బాగున్నావా? ఏంచేస్తున్నావు?' అన్నాను.

'అదంతా చెపుతానుగాని ముందుకారెక్కు, మా ఇంటికి పోదాం' అన్నది.

'సారీ! సరళ. ఇప్పుడు రాలేను, ఇంటి దగ్గర అర్జంటుపని వున్నది. ఇంకోసారి వస్తాను. ఏపేటలో వుంటున్నారు?' అన్నాను.

'గాంధీనగరంలో. గ్రంధాలయందగ్గర. నాన్నగారి పేరు తెలుసుగా ఎవరినడిగినా చెప్తారు. తప్పక వస్తావుకదూ' అన్నది కారెక్కుతూ.

'వస్తాను' అన్నాను చెయ్యి వూపుతూ. కారు నాముందునుండి కదిలిపోయింది.

ఇంటికి వెళ్ళేసరికి ముకుందం పద్మా, ఇద్దరం నూ-పలుకూ లేకుండా బొమ్మల్లా కూర్చున్నారు, వాళ్ళిద్దరిని చూసేసరికి నాకు నవ్వు వచ్చింది గట్టిగానే నవ్వేశాను ఇద్దరు తలెత్తి నావంక ఒకేసారి చూశారు 'ఏమిటండి బాబు, ఇదికూడా ఆఫీసను కుంటున్నారా ఏమిటి? మీరిద్దరు తల లొంచుకూర్చోవటం బాగోలేదు' అన్నట్లు వీరాడు వచ్చి చాలసేపయిందా ముకుందం గారు? క్షమించాలి దారిలో నా చిన్ననాటి స్నేహితురాలు కనిపిస్తే మాట్లాడుతూ నుంచున్నాను' అన్నాను పళ్ళూ, పూలూ బల్లమీద పెడుతూ

'ఫర్వాలేదులెండి, నేనూ ఇప్పుడే వచ్చాను' అన్నాడతను.

పద్మ ప్లేట్లలో గులాబిజాం, సమోసాలు ముగ్గురికి పెట్టింది. మెల్లగ తింటూ అడిగేను. 'నేను గుర్తున్నానా ముకుందం గారూ?'

ముకుందం నావంక ఒకసారి ఆలోచిస్తూ చూశాడు 'లేదండి. కాని ఎక్కడో చూసిన గుర్తు—'అన్నాడు.

'మీరు బందరు హిందూ కాలేజిలో చదివేరుకదూ. అరవై రెండులో నేనక్కడ పి. యూ సీ స్టూడెంటుని. బహశ గుర్తు వుండివుండను'

'క్షమించాలి గుర్తుకురాలేదు' అన్నాడు నొచ్చుకుంటూ.

నవ్వువచ్చింది నాకు 'ఫర్వాలేదులెండి. ఒకవిషయం అడగాలని మిమ్మల్ని చూచి నప్పటినుండి అనుకుంటున్నాను. మీరు చదువుకునేరోజుల్లో అంత వుత్సాహంగా, సరదాగా వుండేవారుకదా .మరి ఇప్పుడిలా అయిపోయారే?'

చిన్నగా నవ్వేడతను. ఆ నవ్వులో చచ్చేంత వేదాంతముంది. బోలెడంత నీరసం వుంది నవ్వింతర్వాత అతను చెప్పింది గూడ తమాషాగా వున్నది.

'నా చదువు పూర్తిఅయిన తర్వాత మా నాన్నగారు పోయారు. సంసారం నా ఒక్కడి మీద పడింది. చదువుకునే తమ్ముడు, పెళ్ళికెదిగిన చెల్లి, విధవప్పగారు వున్నారు పైగా—మన ఆఫీసులో పనిచేస్తున్నవాడు ముసలవ్వ పోతున్నా సరదాలు, సంతోషాలు ఘనీభవించి యంత్రంగా మారిపోతాడు. ఇదొక పెద్ద నరకం గనుక సుఖపడేరాతవున్న మనిషికూడ సుఖపడలేడు. అలాంటిది, నాలాటి దవుర్భాగ్యుడి బతుకు గురించి మరి చెప్పనక్కరలేదు.' అన్నాడతను.

జాలేసింది. రెండునిముషాలు గడచిన తర్వాత నాకోరిక పురస్కరించుకుని అతడు 'చల్లగాలిలో యమునాతటిపై' పాటపాడేడు ఎంతందంగా పాడగలిగేడు!

* * *

కారు హారన్ వినగానే బయటకు పరు గెత్తుకొచ్చాను. రాంప్రసాద్‌ని చూస్తూనే 'గుడీవినింగ్ సార్' అంటూ కారు దగ్గరకి వెళ్ళాను.

'గుడ్‌ఈవినింగ్ మిస్ ఇందిరా! మీ కోసమే వచ్చాను. వొస్తారా అలా, అలా వెళ్ళొచ్చేద్దాం'

పద్మ ఇంట్లో లేదు. బజారు వెళ్ళింది. రూంకి తాళంవేసి పక్కింట్లో ఇచ్చి వేనిటీ బ్యాగ్ పుచ్చుకొని బయలుదేరాను

కారు కృష్ణా బారేజి వైపు కదిలింది. చేతిలో వేనిటీ బ్యాగ్ తెరచి చూశాను. ఎందుకో నాకు నవ్వు వచ్చింది

'ఏమిటి అంతలా చూస్తున్నారు బ్యాగ్ లోకి, ఎంత తెచ్చారేమిటి?' రోడ్డుమీదికి చూస్తూ అడిగేడు

'అబ్బే ఏం తేలేదండి! అయినా మీరుండగా నన్ను డబ్బు ఖర్చుపెట్టనిస్తారా? ఖర్మ! బ్యాగ్‌లో కర్చీఫ ఉందేమోనని చూస్తున్నా' అంటు హేంకీ పైకి తీశాను.

కాసేపటిలో నాకెందుకో భయంవేసింది. 'తలనొప్పిగా వున్నది' అన్నాను భయాన్ని కప్పి పెట్టుకొని

'చెప్పేరు కాదే—రండయితే కాఫీ తీసుకుందాం' కారు హొటల్‌ముందు ఆపేడు. ఫేమలీ రూంలోకి దారితీశాడతను.

'ఏం తీసుకుంటారు?' అన్నాడతను.

'ఏం వద్దు వట్టి కాఫీ చాలు' అన్నాను విసుగ్గా.

కాఫీ ఒకటి చెప్పి, తనకోసం ఏదో ఖరీదైన డ్రింక్ ఒకటి తెప్పించుకున్నాడు

నా మనస్సు పద్మవైపు పోయింది. ఇంటికి వేసిన తాళంచూసి ఏమనుకుంటుందో. ఇవాళ మేమిద్దరం సినిమాకి వెళ్ళాలను కున్నాం. హొటల్ నుండి బయటపడ్డాము.

కథల పోటీకి గడువు తేదీ ఇవాళే గదండీ! పోస్టులో పంపడానికి టైం లేక నేనే పట్టుకొచ్చేశాను!



ఈ తడవ కారు మరో వైపుకి మళ్ళించాడు. నిర్మానుష్యమైన రోడ్డుమీద మా కారు వేగంగా పోతుంది. బాగా చీకటిపడింది. భయంవేస్తుంది. అతను నా మాటల్ని వినే స్థితిలో లేడు ఏదో ఆలోచిస్తూ కారు డ్రైవ్ చేస్తున్నాడు. ఇక తప్పదన్నట్లు భయంగా అడిగేను.

'ఇంక తిప్పండి ఇంటికి పోదాం. పద్మ నా కోసం ఎదురు చూస్తుంటుంది పదండి'

కాని అతను ఇదేమి పట్టించుకోలేదు. అతని కళ్ళల్లో క్రొత్త రంగేదో తళుక్కుమని మెరిసింది. అప్పుడతన్ని చూస్తుంటే మా గదిలో పాలెపురుగు మళ్ళీ జ్ఞాపకం వచ్చింది. భయంతో నా చేతులు వణుకుతున్నయి గట్టిగా నా వేనిటీ బ్యాగ్‌ని గుండెకి హత్తుకున్నాను.

'వెళ్ళిపోదాం మరీ అంత తొందరెందుకు ఇందూ' అని అనగలిగేడు ఎప్పటికో.

ఉన్నట్లుండి కారు మామిడితోట దగ్గిర ఆగిపోయింది అక్కడినుండి చుట్టుచూశాను కొంచెం దూరంలో తారురోడ్డు కన్పిస్తుంది. ఎక్కువ జనం లేరు అప్పుడో కారు, అప్పుడో సైకిలు వెళ్తున్నయి.

'వెన్నెల చల్లగా వుంది కదూ, గాలి హాయిగా వుంది కదూ' ఏమేమో అంటున్నారు రాంప్రసాద్ కారు దిగి

'వెన్నెల చల్లగా వుండక, గాలి హాయిగా వుండక నీ తలకాయిలా వుంటుందేమిటి?' అని తిట్టుకున్నాను

'ఇందూ, ఇక్కడ చాల బావుంది కదూ' వెకిలిగా నవ్వేడు.

'ఎడంకాలి చెప్పుతో రైట్ అండ్ లెఫ్ట్ ఇచ్చేవాడు లేకపోతే సరి బాగుండదట బాగు' —ఏడుపొస్తుంది నాకు ఇంత మొండిగా ఇంతసేపు ఇట్లా అతనితో వంటరిగా వుండగలిగిన నా ధైర్యానికి నేనే ఆశ్చర్యపోయాను

'ఏమిటి ఇందూ, మాట్లాడవు? ఇక్కడ ఎవ్వరు లేరుగా?' అన్నాడు దగ్గర, దగ్గరకి వస్తు ఆ క్షణంలో అతని కళ్ళు చూస్తుంటే గడ గడ లాడిపోయాను

'మిస్టర్ రాంప్రసాద్! కొంచెం దూరంగా వుండండి. మరీ దగ్గరికివస్తే మర్యాద దక్కదు' అన్నాను వేరేమార్గంలేక

పకపక విలన్‌లా నవ్వేడతను 'ఏం చేస్తావు, అరుస్తావా? అరిచి గీపెట్టి వచ్చినా నిన్ను రక్షించే మానవమాత్రులు లేరు' అన్నాడు ఛాతీ విరుచుకుని అడుగు వేస్తూ,

వెంటనే వేనిటీ బ్యాగ్‌లోనుండి రివాల్వర్ తీసి అతనికి గురిపెట్టాను. ఒక్కనిమిషం తెల్లబోయి ఆగిపోయాడతను.

'మర్యాదగా చెప్తున్నాను మిస్టర్! అడుగు ముందుకువేశావా, ప్రాణాలుదక్కవు, నేనేం కుసుమనుకోకు. మవ్వాడించినట్టల్లా ఆడి ఓడిపోయేందుకు.' అన్నాను కసిగా.

నా మాటలువిని అతను విరగపడి నవ్వసాగేడు. 'పూర్‌గర్ల్! బొమ్మ తుపాకితెచ్చి భయపెడదా మనుకున్నావా? తాటాకు చప్పుళ్ళకి భయపడేరకంకాదు ఈ రాంప్రసాద్, కుసుమకథ తెలిసిందా, అబలా! భేష్!'

'రాంప్రసాద్, అడుగు ముందుకు వెయ్యద్దు ఇది బొమ్మ పిస్తోలుకాదు. నిజమైన రివాల్వరు నిన్నుకాల్చేదా, నీ కారు టైరుని కాల్చేదా, ఆల్‌రైట్, నీ ప్రాణం తీసేంత రాతి గుండెకాదు నాది నీ కారు టైరుమీద ప్రయోగిస్తున్నాను చూడు' అంటు అతని కారుటైరుకేసి కాల్చాను

'టస్' మంటు టైరులో గాలిపోయి క్షణంలో అప్పడంలా నేలకి అంటుకు పోయింది రాంప్రసాద్ బ్రాన్పడిపోయారు గబగబ వెనక్కి కదిలాడు

'వూ, ముందు కారెక్కు' అన్నాను అతను మాట్లాడకుండా కారెక్కేశాడు. డోర్‌ని లాక్‌చేశాను.

'టా, టా మిస్టర్! రేపొద్దున్న నీతోక జగన్నాథాన్ని పంపుతాను. ఈరాత్రికి జాగారణ చెయ్యక తప్పదు ఉదయం ఇంటికి చేరి బుద్ధిగావుండు జాగ్రత్త'.

అని చెప్పి వేగంగా తారురోడ్డువైపు కొచ్చి నించున్నాను. ఇంకానాకు భయం, భయంగానేవున్నది. నాకథకిది కొత్తమలుపు. నన్నడుగులే ఈ సంఘటన రసవత్తరమని చెప్తాను. ఏమైతే అయింది. నాప్రయత్నంలో నేనుండాలి తప్పదు.

నడకవేగం పెంచాను. వెనక్కి తిరిగి చూడకుండా నడుస్తున్నాను ఒకచోట మాత్రం ఆగిపోక తప్పింది కాదు.

ఆపద్బాంధవుడిలా ముకుందం సైకిలు పుచ్చుకుని ఓ చెట్టు దగ్గర నిలబడి వున్నాడు. అతన్ని చేరుకున్నాను.

'మీ చేతిలో ఆయుధం వుంది కనక మీరు బతికిపోయారు, తెలిసిందా రాంప్రసాద్ దుర్మార్గం ఇందిరగారు?'

'మీ రెందుకొచ్చారిక్కడికి?'

'యాదృచ్ఛికం, కాని, నా అవసరం లేకుండానే పని జరిగి పోయింది వెల్‌డన్!'

'ప్లీజ్, ఈ విషయం ఎవరోను చెప్పకండి అదిగో వొచ్చే ఆ స్టేట్‌బస్సులో నన్నెక్కించండి ఈ తాళం చేతులు మీ దగ్గిరుంచండి. కొంచెం సేపాగి ఆ కారు తలుపులు తెరవండి లేకపోతే అరచి చావ గలడా రాంప్రసాద్! దయచేసి ఇక్కడ జరిగినది మాత్రం ఎవరోను చెప్పనని ప్రామిస్ చెయ్యండి చేస్తారా?'

'ప్రామిస్' అన్నడతను అయోమయంగా.

'థేంక్స్' అన్నాను ఆనందంగా.

తాళం చేతులు అతనికిచ్చాను. స్టేటు బస్సు ముందు ఆగింది. వెళ్ళి బస్సులో కూర్చున్నాను.

(ముగింపు పైవారం)







బొమ్మల్లో కూడా పరిమితి కుటుంబం!

చిన్న వయసులో అధిక భాగం ఆటల్లోనే గడిచిపోతుంది. ఆటల్లో ప్రధాన స్థానం వహించేది 'బొమ్మ'. బొమ్మలంటే పిల్లలకు ప్రాణం.

చిన్నపిల్లలకే కాకుండా అమ్మలకు కూడా బొమ్మలంటే యిష్టమే. బొమ్మల కొలువు పెట్టుకుని వాటితో ఆడుకుంటూ వుంటారు!

బొమ్మలంటే ఎవరికి ఇష్టముండదు గనక?

సృష్టికర్త బ్రహ్మదేవుడికి కూడా బొమ్మలంటే ఎంతో ప్రీతి. అందుకనే ఎడతెరపి లేకుండా బొమ్మల్ని తయారు చేసేస్తూ వుంటాడు. వాటికి ప్రాణం పోస్తూ వుంటాడు. అవి నవ్వుతున్నా ఏడుస్తున్నా, ఆడుతున్నా పాడుతున్నా ఆనందిస్తూ వుంటాడు.

మనకు పూర్వంనుంచీ చాలా బొమ్మలున్నాయి. కొండపల్లి బొమ్మల్లాంటి పేరెన్నికగన్న కొయ్యబొమ్మలున్నాయి. దంతపు బొమ్మలున్నాయి. మట్టిబొమ్మలున్నాయి శిల్పాలు సరేసరి; అతిప్రాచీన కాలంలోనే అవి స్థానం ఆక్రమించుకుని మన జాతీయ సంస్కృతికి నిదర్శనాలుగా నిలబడి వున్నాయి.

విజ్ఞానం వికసించుతున్న కొద్దీ బొమ్మలు ఆధునికమైన రూపురేఖలు, తీరు తెన్నులు సంతరించుకుంటూ వున్నాయి.

బొమ్మల్లోనే యుద్ధాలు చేయించగల కాలం వచ్చేసింది!

బొమ్మల ప్రమాణం ఎంతగా పెరిగినా ఆశ్చర్యపడవలసినదని ఇప్పుడు మనకేమీ కనిపించడం లేదు.

మాంబళంలోని వడివేలు పురంలో ఒక బొమ్మల పరిశ్రమ వుంది. మద్రాసులో ప్రఖ్యాతి గాంచిన ఈ పరిశ్రమ 'డాల్స్ ఆఫ్ ఇండియా'గా ప్రపంచమంతటా పేరు తెచ్చుకుంది.

ఏడేళ్ళక్రితం, సరదాగా బొమ్మలు చేయడం మొదలు పెట్టిన శ్రీమతి పిల్లుట్ల కనకదుర్గగారు వారి సోదరి శ్రీమతి మాతి శారదాదేవిగారి సహాయంతో



బొమ్మల అలంకరణలో
శ్రీమతి శారదాదేవి

ఇప్పుడు సుమారు ఇరవై మంది స్త్రీలకు పని కల్పించిన సంస్థగా తయారు చేశారు!

వీరు సగటున నెలకు నాలుగు వందల బొమ్మల్ని తయారు చేస్తారు మనదేశంలోనే కాకుండా విదేశాలకు కూడా ఎగుమతి అవుతున్న ఈ బొమ్మలు సాలీనా ముప్పయ్‌వేల రూపాయిలు పైగా ఆర్జించి పెడుతున్నట్లు తెలుస్తోంది!

ఈ సంస్థ తరఫున తయారయిన బొమ్మల్లో ఏ బొమ్మను చూసినా అందాల రాసిలా కనిపిస్తుంది. కట్టు బొట్టు మొదలయిన రీతుల్లో బొమ్మలన్నీ ప్రాంతీయ వాతావరణానికి మచ్చుతునకలుగా వుంటాయి. ప్రాణ ప్రతిష్ఠ చేసినట్టు నిండుగా కళకళలాడుతూ చూపరులను ఇట్టే ఆకట్టుకొనేలా వుంటాయి.

కాటన్ స్టఫ్ఫింగ్ డాల్స్, వయిర్ డాల్స్, కేలండర్ డాల్స్, మూవింగ్ డాల్స్ అనే నాలుగు రకాలయిన బొమ్మలు ఇక్కడ తయారవుతున్నాయి.

### కాటన్ స్టప్పింగ్ డాల్స్ (గుడ్డ బొమ్మలు) చేస్తున్న విధం:

కావలసిన రంగులో గుడ్డను తీసుకుంటారు. దానిమీద ఏ అంగానికి ఆ అంగము కొలతల ప్రకారం డ్రాయింగు వేస్తారు. కత్తిరించి మిషన్ మీద కుడతారు అవసరమైన చోట చేతికుట్టు కుట్టడం కూడా వుంటుంది. దూదితోనింపి దానికి తీరయిన ఆకారం తీసుకు వస్తారు. ఇలా

కాళ్లూ చేతులూ మొండెమూ వేరు వేరుగా తయారు చేస్తారు

క్రతోను, మోల్డింగ్ పద్ధతిలోను తలలు రెండు విధాలుగా తయారు చేస్తున్నారు.

మోల్డింగ్ పద్ధతిలో చేసిన వాటికి కన్నుముక్కు నోరు ఏర్పడిన ముఖం ఉంటుంది

క్రతో తయారయిన తల ఇలా వుండదు. కోలగా నునుపుగా వుంటుంది. బొమ్మంతా తయారయిన తర్వాత రంగులు వేయడం ద్వారానే కన్నుముక్కు మొదలయినవి ఏర్పడతాయి.

తలమీద జుట్టుకు వెంట్రుకలుగాని, నల్లని వూలు—నూలుగాని ఉపయోగిస్తారు.

వేర్వేరుగా తయారయిన భాగాల నన్నిటినీ కూర్చి చేతికుట్టు వేసి పొందికగా అతికిస్తారు.

ఇలా అతికించిన బొమ్మకు ఒక ఆకారం వచ్చేస్తుంది. చివరి మార్పులు చేసి దానికి సరిపడిన బట్టలు కుట్టి తొడుగుతారు ఆభరణాలు అలంకరించుతారు. ముఖానికి, చేతులు కాళ్లకు రంగులు వేస్తారు

## వయిర్ డాల్స్
## (తీగబొమ్మలు)

నడుము, కాళ్లు, చేతులూ వుండేలా తీగను వంచి మనిషి ఆకారాన్ని తయారు చేస్తారు.

దానిమీద వూలుగాని, మేలురకం దారంగాని చుట్టి కండపుష్టి తీసుకు వస్తారు.

తల మాత్రం అన్ని తరహాల బొమ్మలకీ పైన చెప్పినట్టుగా రెండు విధాలుగానూ ఉపయోగిస్తారు.

తీగతో తయారయిన బొమ్మల్ని ఎలా బడితే అలా వంచి ఆ 'యాక్షన్'లో వుంచవచ్చు నాట్యం చేస్తున్నట్టుగాను. నడుస్తున్నట్టుగాను, కూర్చున్నట్టుగాను మన యిష్టం వచ్చినట్టు ఎలాగయినా చేసుకోవచ్చు

బొమ్మలు తయారు చేయడాన్ని వివరిస్తూ 'వయిర్ డాల్స్‌కే ఎక్కువ మార్కెట్ వుంది' అని అన్నారు శ్రీమతి కనకదుర్గ.

## కేలండర్ డాల్స్
## (కేలండరు బొమ్మలు)

'డయినింగ్ మాట్స్' అని కొన్ని చాప



తీగబొమ్మ అభినయం

లున్నాయి. ఇవి రకరకాల సైజుల్లో అనేక రంగుల్లో, అందమయిన డిసయిన్లతో బజారులో దొరుకుతాయి.

ప్రత్యేకంగా తయారుచేసిన బొమ్మల్ని ఈ 'చాప'ల మీద కుడతారు. ఈ బొమ్మలు తయారీ వేరుగా వుంటుంది. మోల్డు చేసిన ముఖాన్ని మాత్రమే అతికిస్తారు.

తక్కిన భాగాలన్నీ—వెనకవయిపు చదునుగాను పైకి మాత్రం ఉబికి— పుష్టిగాను వుంటాయి.

ఉడుపులు, ఆభరణాలు మామూలుగావే వుంటాయి కొన్నిటిని 'చాప'కు స్థిరంగా కుట్టేస్తారు.

చాపకు అత అయ్యే రంగుల్లో బొమ్మల్ని అతికిస్తారు. అప్పుడు బొమ్మల అందం ఇనుమడిస్తుంది

వీటికి కేలండర్లు జోడించినప్పుడు ఎంతో ఆకర్షణీయంగా వుంటాయి.

కేలండర్ డాల్స్‌ని గోడలకి తగిలించినప్పుడు గదికి ఎంతో అందం వస్తుంది!

## మూవింగ్ డాల్స్
## (కదిలే బొమ్మలు)

కదిలే బొమ్మలు తయారీ అంతా తీగతో చేసిన బొమ్మల మాదిరిగానే వుంటుంది అయితే, మొండెము కాళ్లు మాత్రం విడి విడిగా వుంటాయి కాళ్ల మీదకు పరికిణీలాంటిది వుంటుంది. అది వెడల్పయిన చుట్టుకొలతతో కదులుతూ వుంటుంది. నడుము దగ్గర్నుంచి కదిలి వయ్యారంగా ఆడుతుంది.

ఈ రకం బొమ్మల్ని ఇప్పుడిప్పుడే తయారు చెయ్యడం మొదలు పెట్టారు. బొమ్మలన్నిటిలోను వీటికి విశేషమయిన ఆదరణ తప్పకుండా లభిస్తుంది.

కేలండర్ డాల్స్‌కి తప్ప మిగతా మూడు రకాలయిన బొమ్మలకీ క్రింద నిలబడడానికి చెక్కదిమ్మ (వుడెన్ బేస్) వుంటుంది.

వీరు సాధారణంగా 6 నుంచి 16 అంగుళాల వరకు వేరువేరు సైజుల్లో బొమ్మల్ని తయారు చేస్తూంటారు

ఈ బొమ్మలు — ఆంధ్ర, పంజాబ్, మహారాష్ట్ర, గుజరాత్, కాశ్మీర్ మొదలయిన ప్రాంతాలవారీగా జాతీయతను ప్రతిబింబితం చేస్తూ వుంటాయి

కేవలం మనుష్యుల్నే కాకుండా జంతువులు, పక్షులులాంటి బొమ్మల్ని కూడా తయారుచేసి ఆబాల గోపాలానికీ 'డాల్స్ ఆఫ్ ఇండియా' ఆనందాన్ని పంచి యిస్తుందని ఆశిద్దాం!

రోజులు మారుతున్న కొద్దీ వేషభాషలు, ఆచార వ్యవహారాలు మారిపోతున్నాయి. ఇప్పుడున్న 'ఫాషన్' రేపటికి చప్పబడిపోతున్నది. మళ్లీ పాతకాలంనాటి ఫాషనే సరికొత్త నాగరికతతో స్థానాన్ని సంపాదించుకోవచ్చు!

ఇవి 'మినిస్కర్ట్'ల కోసం, 'బికినీ'ల కోసం ఎగబడే రోజులు!

కాలంనాటి నాగరకతకు దృష్టాంతాలుగా వుండగల బొమ్మలు మనకు తప్పకుండా కావాలి!

—సి. కనకాంబరరాజు ●

# బికనీర్ రాకుమారి రాజ్యశ్రీ

'భారత జాతీయ సంఘా'నికి చెందిన ఒక వక్త ఇలా అన్నారు 'బికనీర్ రాకుమారి రాజ్యశ్రీ సాధించిన విజయం అద్భుతమయినది. ఎంతో అనుభవజ్ఞులయిన పురుషుల తలదన్ని ఆమె పోటీలో పేరు తెచ్చుకున్నది.'

ఇటీవల అఖిలభారత 'రయిఫిల్ షూటింగ్' పోటీ ఒకటి జరిగింది. అందులో బికనీర్ రాకుమారి రాజ్యశ్రీ ప్రథమశ్రేణిలో ఎన్నికయింది 'ఆశియా ఛాంపియన్‌షిప్' కోసమని ఎన్నికచేయడానికి జూన్ 19వ తేదీన అహ్మదాబాదులో ఈ పోటీ ఏర్పాటు చేశారు.

రాకుమారి రాజ్యశ్రీ వయస్సు పధ్నాలుగు సంవత్సరాలు ఆమె మహామహులైన పురుషులతో పందెంకట్టింది! అగ్రశ్రేణిలో 358—400 (89 5%) విజయాన్ని సాధించింది ఆమెతో పోటీచేసిన లెఫ్టినెంట్ రామచంద్ర (సికింద్రాబాదు) 325-400 స్కోరుచేశారు. అంతకంటె ఎవరూ దాటలేక పోయారు.

14 ఏళ్ల బాలిక అంతటి ఉన్నత పరిమాణాన్ని అందుకున్నదీ అంటే భారత దేశానికి ఒక ప్రతిభ! టోక్యోలో జరిగే ఆశియా ఛాంపియన్‌షిప్ పోటీల్లో రాజ్యశ్రీ నెగ్గితీరుతుందని అందరూ భావిస్తున్నారు. ప్రపంచంలోని వార్తాపత్రికల పతాకశీర్షికకు ఎక్కడానికి పధ్నాలుగేళ్లు చాలునని ఆమె అప్పుడు నిరూపిస్తుంది!

—విసు. ●

## మీరు మీ చంటి బిడ్డను ముద్దాడునప్పుడు...

మీ చంటి బిడ్డ యొక్క శరీరము, ప్రపంచములోని అన్ని వస్తువులకంటే మృదు
వైనదిగాను, నున్నితమైనదిగాను యున్నట్లు భావించరా?
ముమ్మాటికి అది నిజం! అందుచేతనే మీ చంటి బిడ్డ యొక్క శరీరమునకు, నున్ని
తమైన, వాత్సల్యమైన బ్రాడోసోల్ యొక్క జాగ్రత్త అవసరమైయున్నది
ఏంటి సెప్టిక్స్‌లలోకెల్ల బ్రాడోసోల్ అతి విధేయమైనది ఇది బినాకా బేబీ పౌడరు
లో మాత్రమే కలదు ఇది మీ చంటి బిడ్డ యొక్క మృదువైన శరీరాన్ని, నూగు
పొక్కులనుంచి, దురద, చెమట మొదలైన వాటినుంచి కాపాడును
గాను. బినాకా బేబీ పౌడరు కూడా చంటి బిడ్డలను ప్రేమించుచున్నది
మీ చంటి బిడ్డకు బినాకా బేబీ పౌడరును వాడండి. ఆ బిడ్డ సంతోషమును చిరు
నవ్వును కనిపెట్టండి.

# “అమ్మా
# బినాకా ఇదిగో”




శుభ్రమైన తెల్లని డబ్బాలు అందమైన నీల మేఘపు రంగు గీతలతో ప్రతి చోటా దొరకుచున్నది.

# మెదడుకి మేత



డాక్టర్ మహీధర నళినీమోహన్



## పొద్దు తిరుగుడు పక్షి

(త) పొద్దు తిరుగుడు పక్షి.

ఒక జానపదగాథలో ఒక గద్ద సూర్యుడిని చేరుకోవాలని ప్రయత్నించేదట ప్రతి రోజూ పొద్దున్నే సూర్యోదయం అవగానే ఆ గద్ద సూర్యుడు కనిపిస్తున్న వైపుగా ఎగిరేది సూర్యుడు నడినెత్తికి వస్తే తానూ అటువైపే ఎగిరేది అటుతరువాత సూర్యుడు పశ్చిమానికి పోతూ ఉంటే తానూ కూడా పడేది సూర్యుడు అస్తమించేసరికి అది ఆకాశంలో ఎక్కడో తన గూటికి పైన ఉండేది నిరాశతో కిందికి దిగేది మళ్ళీ మరునాడూ ఇదే పద్ధతి'

ఈ కథ తమాషాగా బాగానే ఉంది కాని, ఇందులో చిన్న లొసుగు ఒకటి ఉంది సూర్యోదయమైనప్పటి నుంచి మిట్ట మధ్యాహ్నం వరకూ ఆ గద్ద, సూర్యుడు ఒకరికొకరు ఎదురెదురుగా ప్రయాణం చేస్తున్నారు. సాయంకాలం వేళ సూర్యుడు దూరంగా పోతూ ఉంటే గద్ద సూర్యుడి వెంటపడి వెనక్కాలే వెడుతుంది దీనిని బట్టి పొద్దుటికన్న సాయంకాలం ఆ పిచ్చి పక్షి మరింత ఎక్కువ దూరం ఎగిరేది అని తెలుస్తోంది కదా! అందుచేత సూర్యాస్తమానం అయేసరికి అది తన గూటిపైన ఉండక, గూటికి పడమరగా కొంతదూరంలో ఉంటుంది మళ్ళీ మరునాడు నిన్నను విడిచిన చోటి నుంచి బయలుదేరితే సూర్యుడు అస్తమించే సరికి పశ్చిమంగా మరికొంత దూరాన ఉంటుంది ఈ విధంగా ఆ పక్షి నానాటికీ పడమరగా ప్రయాణం చేస్తూ ఉండి ఉండాలి.

ప్రతిరోజూ సూర్యాస్తమానం అయేసరికీ ఆ పక్షి బయలుదేరిన చోటికి 500 మైళ్ళ పడమరగా ఉంటుందనుకుందాం భూమి చుట్టుకొలత 25 వేల మైళ్ళు అయితే, భూప్రదక్షిణం చేసి ఆ గద్ద బయలుదేరిన చోటికే రావడానికి ఎన్ని రోజులుపడుతుంది?

* * *

(చ) అగ్ని ప్రమాదం.

'బింక్స్' అనే అసామీ అగ్ని ప్రమాదం నుంచి తప్పించుకోడానికని ఒక సాధనం కనిపెట్టి, 'పేటెంటు' చేసుకున్నాడు అందులో ప్రత్యేకత ఏమీలేదు ఒక గిలక దాని మీద బలమైనతాడు ఆ తాడుకి అటు కొసని ఒక బుట్ట, ఇటువైన మరో బుట్టా కట్టి ఉంటాయి అగ్ని ప్రమాదం జరిగినప్పుడు పై అంతస్థులలో ఉన్న మనుష్యులు ఇల్లు విడిచి పారిపోవడానికి ఈ సాధనం ఉపయోగపడుతుంది ఒక బుట్టలో మనిషి కూర్చుని, రెండవ బుట్టలో అతడికన్న కొంత తక్కువ బరువున్న రాళ్ళుగాని, మరేదైనా వస్తువును గాని ఉంచితే, మనిషి నింపాదిగా కిందికి దిగుతాడు తేలిగా ఉన్న రెండవ బుట్ట పైకి లేస్తుంది ఇందులో అంతకన్న విశేషమేమీ లేదు ప్రపంచంలో ప్రతిమేడకీ పై అంతస్థులలో ప్రతి గది దగ్గరా ఇటువంటి సాధనం అమర్చాలని బింక్స్ ఉద్దేశం.

లండన్‌లో ఒక పెద్ద హోటలుకి అర్ధరాత్రివేళ నిప్పు అంటుకుంది అందులో ఉంటున్న జనం అంతా వికావికలై పారిపోయారు కాని, రాత్రి కాపలాదారు, అతని కుటుంబమూ మాత్రమే గాఢ నిద్రలో ఉండి, ఓ పట్టాన లేవలేదు ఆఖరికి ప్రజల హాహాకారాలకు ఆ కుటుంబం



నిద్ర మేలుకుని చూచేసరికి మంటలు అన్ని వైపులా కమ్ముకు ఉన్నాయి కర్రతో చేసిన మేడ మెట్లు ఇంతకుముందే కాలిపోయాయి. అదృష్టవశాత్తూ బింక్స్ సాధనం ఒకటి వాళ్ల గది కిటికీ దగ్గర అమర్చి ఉంది. ఇంక అదొక్కటే శరణ్యం దాని సహాయంతో ఆ కాపలాదారు, అతని భార్య, పసిపిల్లవాడు, వాళ్ల కుక్క—ఈ నలుగురూ కిందికి దిగిపోవాలని ప్రయత్నం చేశారు. అందరూ ఒక్కసారిగా దిగినా దిగవచ్చును గాని రెండవబుట్టలో తగిన బరువులు ఏవీ సిద్ధంగా లేకపోవడంచేత అది సాధ్యంకాదు. రెండు బుట్టలలోని బరువులకీ భేదం 30 పౌనులకన్న అధికమైతే బరువైన బుట్ట బహువేగంగా కిందికి దిగి, అందులో కూర్చున్నవారికి కాలో చెయ్యో విరిగే ప్రమాదం ఉంది కనుక ఈ భేదం 30 పౌనులను మించకపోవడం చాలా ముఖ్యం.

కాపలాదారు బరువు - 90 పౌనులు.
అతని భార్య బరువు - 210 పౌనులు.
కుక్క బరువు - 60 పౌనులు.
పిల్లవాడి బరువు - 30 పౌనులు.

పైగా కుక్కగాని, పిల్లవాడుగాని బుట్టలోకి తమంత తాము ఎక్కలేరు దిగలేరు. అతడుగాని, ఆమెగాని వాళ్ళని ఎక్కించాలి. దింపాలి

అంతకంతకు ఎక్కువైపోతున్న మంటల నుంచి సాధ్యమైనంత వేగంగా ఆ నలుగురూ తప్పించుకుపోవడం ఎల్లాగ?

(జవాబులు 64 వ పేజీలో)

విస్తరాకులు






మల్లన్న మంత్రిగా ఉన్న రాజ్యానికి పదివేలసైన్యం ఉండేది అందులో తొమ్మిదివేల సైన్యాన్ని తీసికొని రాజు, సైన్యాధిపతి ఉత్తర దేశంమీదకు దండయాత్రకు వెళ్లేరు మిగిలిన వెయ్యిమంది సైన్యంతో మల్లన్నమంత్రి దేశరక్షణ నిమిత్తం రాజధానిలో ఉండి పోయేడు

దక్షిణదేశపు రాజుకు యీ సంగతి తెలిసింది, అతనికి మూడువేలసైన్యం ఉంది. అందుచేత యీ రాజ్యాన్ని జయించడానికి యిదే సమయమను కొన్నాడు. వెంటనే తన మూడువేల సైన్యంతో దక్షిణదేశపురాజు మల్లన్న మంత్రిమీదకు దండయాత్రకు బయ ల్దేరేడు.

ఈ సంగతి చారులద్వారా మల్లన్న మంత్రికి తెలిసింది ఉత్తరదేశం మీదకు దండెత్తి వెళ్లినసైన్యం తిరిగి వచ్చివేస్తున్నట్లుగా దేశంలో వదంతిని కల్పించేడు తరువాత మల్లన్న మంత్రి లక్ష విస్తరాకులను కొన్నాడు. ప్రతి ఆకుకు కొంచెం పెరుగుఅన్నం పూసి, కొంచెం పచ్చడి, కూరఉంచి, ఉత్తర దేశంనుంచి సైన్యం వచ్చే దారిలో ప్రతి మజిలీలోను తొమ్మిది వేల విస్తరాకుల చొప్పున పారవేయించేడు.

మల్లన్నమంత్రి కల్పించిన వదంతి దక్షిణదేశపు రాజు చెవినికూడా పడింది. వెంటనే ఆ రాజు కొంతమంది భటులను ఉత్తరదిక్కుకు పంపించేడు కొద్దిరోజుల్లోనే ఆ భటులు తిరిగి వచ్చి దక్షిణదేశపు రాజుకు యిలాగ విన్నవించేరు. ప్రభూ! ప్రతి మజిలీ లోను తొమ్మివేలది యెంగిలి విస్తరాకులు పడిఉన్నాయి ఆ విస్తరాకులు కొద్దిరోజుల క్రిందటనే పడవేసినట్లు కొత్తగా ఉన్నాయి. అందుచేత ఉత్తర దిక్కుకు వెళ్లినసైన్యం తిరిగి వచ్చి ఉంటుంది.'

ఉత్తరదేశం మీదకు వెళ్లిన సైన్యం తిరిగి వచ్చివేసినట్లయితే మల్లన్నమంత్రిని జయించడానికి అవ కాశంలేదు కాబట్టి తరువాత యేమి జరుగుతుందో చూద్దామని దక్షిణదేశపు రాజు రాజధానికి చాలా దూరంలోనే ఉండి పోయేడు

ఈ లోపున మల్లన్నమంత్రి వెయ్యి వెదురుగడలను తెప్పించేడు. ఒక్కొక్క వెదురుగడ అడ్డంగా ఉంచి దానికి పదేసి కాగడాల చొప్పున కట్టించేడు. ఒకనాటిరాత్రి ఆ వెదురుగడలను తీసి కొని బయలుదేరవలసినదిగా మల్లన్న మంత్రి తన వెయ్యిమంది భటులతో చెప్పేడు ఒక్కొక్క భటుడు ఒక్కొక్క వెదురుగడను తీసికొని కాగ డాలను అంటించి కోటనుంచి బయ ల్దేరేడు

దక్షిణదేశపు భటులు చాలా దూరం నుంచి యీ కాగడాలను చూసేరు. వెలుగుతున్న పదివేల కాగడాలు తమ వైపు రావడం గమనించి తను రాజుకు యీ సంగతిని తెలియజేసేరు. ఉత్తర దిక్కుకు వెళ్లిన మల్లన్నమంత్రి సైన్యం తిరిగి వచ్చింది. అందుచేతనే ఆ పదివేలసైన్యం తమ మీదకు దండెత్తి వస్తున్నదని అనుకొని దక్షిణ దేశపురాజు భయపడి సైన్యంతోసహా పారిపోయేడు. ●



'హలోగురూ! తిరువతా?'
'కాదు! నువ్వు అంటగట్టిన హెర్ఆయిలు...!'

# అరవిందస్వామి

ఆగస్టు పదిహేను మన స్వాతంత్ర్య దినోత్సవం మాత్రమే కాదు, ప్రపంచ మహా పురుషులలో ఒకరయిన శ్రీ అరవిందుల జన్మదినం కూడా. అరవింద్ ఘోష్ 1872 లో కలకత్తాలో జన్మించాడు. తలిదండ్రులు ఆయనని ఏడవ ఏటనే చదువు కోసం ఇంగ్లాండు పంపించారు. ఇంగ్లీషు, ఫ్రెంచి, లాటిన్, గ్రీక్ భాషలలో పాండిత్యం సంపాదించు కుని 'ఇండియన్ సివిల్ సర్వీస్'లో ఘనవిజయాన్ని సాధించారు. కాని, స్వాతంత్ర్యాభిలాషి అయిన వారు ఆంగ్లేయులవద్ద బానిస ఉద్యోగం చెయ్యటానికి ఇష్టపడ లేదు

1893 లో శ్రీ అరవిందులు తిరిగి భారత దేశానికి వచ్చి వేశారు. బరోడా మహారాజా వద్ద కొంతకాలం ఉండి అక్కడ కాలేజి 'వైస్ ప్రిన్సిపాల్' అయ్యారు. బెంగాలీ, సంస్కృతాలు ఈ కాలంలోనే నేర్చు కున్నారు. అంతేకాక భారతీయ సంప్రదాయాలు ఎన్నిటితోనో పరిచయం చేసు కున్నారు. యోగసాధనం పట్ల ప్రత్యేక మయిన శ్రద్ధ చూపించేవారు ఈ కాలం లోనే వారి ఆత్మ భక్తి, ధ్యాన, యోగ మార్గాల వయిపు ఆకర్షింపబడింది. నర్మదా నదీ తీరాన చాలా సంవత్సరాలుగా తపస్సు చేసుకుంటూ ఉన్న శ్రీ బ్రహ్మనందస్వాముల వారిని శ్రీ అరవిందులు తరచు కలుసు కుంటూ ఉండేవారు.

బరోడాలో ఉన్నప్పుడే అరవిందులకి శ్రీ భోపాలఘోష్‌గారి కుమార్తె మృణాళినీదేవి గారితో వివాహం జరిగింది.

1915లో వంగరాష్ట్రాన్ని విభజించారు. దేశంలో కల్లోలం బయలుదేరింది. ఈ సందర్భంలో బెంగాల్‌లో జాతీయ కళాశాల ఒకటి నిర్మించారు. నెలకి 70 రూపాయల జీతంమీద అరవిందఘోష్‌గారు ఈ కళాశాల ప్రిన్సిపాల్‌గా కుదిరారు! బాలగంగాధర్ తిలక్ ఆదర్శాలని దేశవ్యాప్తం చేసే ఉద్దేశంతో 'వందేమాతరం' అనే దినపత్రిక స్థాపించారు, ఒక సంవత్సరం దానిని నడిపారు.

1907 లో అరవిందుడిని జెయిలుకి పంపించారు కాని, వెంటనే విడుదలచేశారు ఇంతలో 1908 సూరత్ కాంగ్రెస్‌సభకి అధ్యక్షులుగా ఎన్నిక అయ్యారు. 1908లో తిరిగి తమ్ముడు శ్రీ బీరేంద్రకుమార్ ఘోష్‌తోబాటు ఎరెస్టుఅయి (తగినంత సాక్ష్యం దొరకనందున) తిరిగి విడుదల అయ్యారు.

శ్రీ కృష్ణభగవానుడు శ్రీ అరవిందులకి అంతర్వాణిగాను, ప్రత్యక్షంగాను దర్శనమిచ్చి ప్రపంచాన్ని ఉద్ధరించేమార్గం గీతాతత్వమే అని చెప్పినట్లు తమ ఉపన్యాసాలలో తెలిపారు.

శ్రీ అరవిందులు 'కర్మయోగి', 'ధర్మ' అనే ఇంగ్లీషు, బెంగాలీ పత్రికలని ప్రారంభించారు. 1910 లో పాండిచ్చేరి (లేక పుదుచ్చేరి)కి వెళ్ళిపోయారు అప్పటినుంచి రాజకీయాలని పూర్తిగా వదులుకుని ఆధ్యాత్మికసాధనలో మునిగిపోయారు. 'ఆర్య' అనే పత్రిక స్థాపించారు.

కొంతకాలం తర్వాత శ్రీ అరవిందుల ఆశ్రమానికి శ్రీ తల్లిగారు వచ్చారు. క్రమంగా ఆశ్రమ నిర్వహణ బాధ్యత పూర్తిగా ఆమె మీద పడిపోయింది అంతేకాక, శ్రీ అరవిందులు కూడా ఆమెమాట జవదాటక పోయేవారు

శ్రీ అరవిందులు సంవత్సరానికి నాలుగు సార్లు మాత్రమే దర్శనమిచ్చేవారు ఈ దర్శనార్థమై ఎందరో ఆశ్రమానికి వచ్చి పోతూ ఉండేవారు వీరికి శ్రీ అరవిందులని చూసినంతమాత్రానే ఏదో దివ్యానుభూతి కలిగేది.

1950 డిసెంబర్ 9వ తేదీన శ్రీ అరవిందులు తమ దేహయాత్రని చాలించారు. ఆశ్రమంలోనే వారి సమాధి ఏర్పరిచారు. నేడు ఆశ్రమ నిర్వహణ పూర్తిగా శ్రీ తల్లిగారిదే ఆశ్రమవాసులలో అమెరికా, ఆఫ్రికా, జపాను, ఫ్రాన్సునుంచి వచ్చిన వారిలో చాలా మంది ఉన్నారు. శ్రీ అరవిందుల గ్రంథాలు అన్నీ ప్రచురితం అయ్యాయి. అవి ఆసక్తి ఉన్న వారందరూ చదువుకోవచ్చు.

—'మాత్యాన్నపూర్ణ'



ఇంతవరకు కథ

శంకరం మాష్టారి ప్రభావంవల్ల వేణు ప్రవర్తన చాలవరకు మారిపోయింది. అతను అక్టోబరు ధాన్సులో స్కూలు పైనలు పాసయ్యాడు. శంకరాన్నిపోలీసు కేసులో యిరికిద్దామని వేసిన వరద రాజులుపథకాన్ని వేణు విఫలంచేస్తాడు. వేణు అక్క జ్యోతి. ప్రాణస్నేహితులయిన జ్యోతి, రమణలు చాలకాలానికి కలుసుకుంటారు. పార్టీరాజకీయాలతో విరోధవర్గాలయిన కుటుంబాలు వాళ్లవి. జ్యోతి రమణ ఇంటికి వెళ్లడాన్ని జ్యోతిభర్త ఆనందరావు సహించలేకపోయాడు. మాటమాట పెరిగి మళ్లీ విడిపోతారు. వేణు కాలేజీలో చేరాడు. జ్వరంతో పరీక్షలు రాస్తాడు. సెలవుల నెపంమీద సుశీలను చూడ్డానికి అక్కగారింటికి వచ్చి, ఆమెకు చదువు చెప్పడానికి జ్యోతిని నియోగిస్తాడు. ఆనందరావు వెంకటరావులమధ్య విరోధం రోజురోజుకి రగులు కొంటూవుంది.

# 18

కొద్దిరోజులు గడిచాయి...

ఆనందరావు అప్పుడే వచ్చి రచ్చబండ మీద కూర్చున్నాడు. అటునుండే వెళ్తున్న వి. ఎల్. డబ్ల్యూ. ఆనందరావును చూచి నమస్కారం చేశాడు. ప్రతి నమస్కారం చేస్తూ, 'రండి...రండి... ఎక్కడికో వెళ్తున్నట్టున్నారే అర్జంటుగా...' అని అడిగాడు ఆనందరావు.

'ఇక్కడికేనండి...వెంకయ్యగారి కిష్టయ్య గారి చేలో మందు కొట్టిద్దామని వెళ్తున్నాను' అని జవాబిచ్చాడు వి. ఎల్.డబ్ల్యూ.

'అది సరే — అమోనియా యిస్తున్నారటగా ?...వెంకట్రావు మనుషులు అప్లికేషను పెట్టారని విన్నాములెండి...'

'అవునండీ...ప్రత్తి వేసినవాళ్లకు ఇస్తున్నాం...'

'ఓహో!...సరేలెండి...వెళ్లిరండి పాపం పొద్దు పోతున్నట్లుంది మీకు...హడావుడిగా వెళ్తుంటే 'ఎక్కడికా' అని పిల్చాను. అంతే...' అనగానే వి. ఎల్. డబ్ల్యూ. వెళ్లిపోయ్యాడు...'వస్తా'నని చెప్పి. అతడటు వెళ్లగానే వచ్చాడు సుబ్బయ్య, 'ఏం దానందరావ్ ! మన లెవెల్ వర్కర్ ఏందో అంటున్నాడు?' అంటూ.

'రా సుబ్బయ్యన్నా !... ఏముందీ !...ఆ వెంకట్రావు మనుషులు ప్రత్తికోసం, అమోనియా కావాలని, అప్లికేషను పెట్టారట.'

'పత్తి ఎక్కడిదీ?...వాళ్లు పత్తేసింది

సీరియల్

పూర్వా సంధ్యా ప్రవర్తతే...

తేజోవతి

రెండెకరాల అరట్లలోనేగా ?...మిగతావి ఒట్టి అరట్లే వేశారు...' అన్నాడు సుబ్బయ్య బీడీ వెలిగించుకుంటూ.

'అయినా వాళ్ల కమోనియా ఎందుకో! విత్తేస్తే విరివిగా పండే భూములుగా వాళ్లవి! అప్పుడే రోడ్డు వేయిస్తామంటే అడ్డు చెప్పినే 'మావి బంగారం లాంటి భూములని !...' బీడీ దమ్ము గట్టిగా లాగి మళ్లీ అన్నాడు సుబ్బయ్య.

'హఁ...హఁ...అప్పుడే బస్తాలు చేతి కొచ్చినయ్యిటయ్యా?....రెండెకరాల్లో పత్తేసి అరటి తోటకు అమోనియా కాజేస్తామంటే పడనిస్తామా సుబ్బయ్యన్నా?...'

అప్పుడేవచ్చి రచ్చబండమీద కూచ్చుంటూ, చుట్ట వెలిగిస్తున్న రవణయ్య—

'ఆనందరావ్! ... హరిజనులకు నివేశన స్థలాలు ఏవో యిస్తారన్నారు.. అవి శాంక్షను అయినట్టేనా?...' అని అడిగాడు...

'వేనాటే పట్టించుకోడంలేదుగానీ యించుమించు పూర్తయినట్లే ... ' అన్నాడు ఆనందరావు...

'మొత్తానికి ఘటికుడవయ్యా వెంకట్రావ్!...ఆఁ...ఆరినీ... ఆ ఎస్. ఇ. ఒ. ని ఆ హెల్తు యినస్పెక్టర్ను పిలుచుకొచ్చాడు చూపించాడు ... వాళ్ళచుట్టూ తిరిగాడు. మొత్తానికి సాధించాడు! ... హరిజనులు చేత 'మంచి' అనిపించు కుంటున్నాడు!... రేపు వాళ్ళ ఓట్లు కొట్టేస్తాడు ... తప్పదియ్యా! నువ్వయ్యా వెంకట్రావ్!...మా ఐ ఎమ్మెన్‌లోన్లు పడనీక పోయినా ... నీ పన్లు మాత్రం సాధించుకున్నావ్! ... స్వగతంలా అనుకున్నాడు రవణయ్య అక్కను కొద్దీ...అతడి మాటలు ఆనందరావు మీద బాగా పని చేసినయి... అందులోనూ లోను మాట ఎత్తేసరికి, ఆనందరావుకు తలవంపు లయింది.

'నువ్వా అట్లా అంటావేం రవణయ్య బాబాయి ! ... ఇల్లలకంగానే పండగయి పోతుందా!...కానీ...కానీ ... శాంక్షను కానీ చూద్దాం ... ' అన్నాడు ఆనందరావు రవణయ్యకు వూరడింపుగా...

మరి కొద్దిరోజులు గడిచాయి...

అరుగులమీద కూచుని కబుర్లు చెప్తు కుంటున్న వెంకట్రావు మాట వరసకు అన్నాడు నరసింహంతో, 'ఏందో మావా!... మన రోజులేం బాగున్నట్టు లేవు...ఏది చేద్దామన్నా వాడు సైంధవుడిలా అడ్డు పడుతుండె! ... ఆ హరిజనులకు నివేశన స్థలాలు యిప్పిస్తామని మాట యిచ్చాం గదా... ఎలక్షన్లలోపునే చేయిద్దామని, ఆ ఆఫీసర్లచుట్టూ తిరిగి తిరిగి అంతా చేయిస్తే, ఏనాడో మూలపడ్డ గంగానమ్మగుడి వుందిట అక్కడ !... జాతర్లవీ చేసుకుంటారు ... ఆ చోటు గ్రామం వుమ్మడి అనుభవంలో వుంది కాబట్టి అది హరిజనుల యిళ్ళ స్థలాలకు కేటాయిస్తే, గ్రామస్థుల కిబ్బంది కాబట్టి, యిళ్ళ స్థలాలు వేరేచోట యిప్పిస్తే మంచిదని అడ్డుపుల్ల వేసె ఆనందరావు. మళ్లీ ఆఫీసర్లు కూడా కాదనడానికి వీల్లేకుండా! ఏంటో వ్యవహార మంతా ఎదురు తిరుగుతోంది తప్ప!...'

వెంకట్రావుకు నిరాశ కలుగుతోంది యివన్నీ తల్చుకుంటే... 'డబ్బుపోయి శనీ పట్టుకుందన్న' సామెత జ్ఞాపకం వచ్చింది అతడికి...కడుపులో దాచుకోలేక అన్నాడు విచారంగా వెంకట్రావు...

'మనదట్టా చెడగొట్టాడా?...తనేమో యీ వూరికి ప్రైమరీ హెల్తు సెంటర్ తెప్పిస్తాట్ట!...అట్లా అని నలుగురితో చెబుతున్నాడు గూడానట! ...' అన్నాడు నరసింహం, వెంకట్రావు నిరాశను యీసుగా

మార్చడానికి ప్రయత్నిస్తూ...

'ఇన్నాళ్ళకుగాను ప్రజలకు పనికొచ్చే పని చెయ్యాలనిపించింది ఆనందరావుకు... ఏదో కాలానికి కడగండ్లున్నయ్యే?'

'కాలానికి కాదయ్యా కడగండ్లు ... మనకు! ... ప్రజలకోసమా అది! ... ఓట్లకోసమన్నా. నే నొప్పుకుంటాను ... అతడు ఏంచెయ్యబోయినా మనం సాగనివ్వక పోతిమి. ప్రజలు 'ఏందయ్యా నువుజేసింది' అంటూ నిలేస్తారని ... గట్టి ప్రయత్నం చేస్తున్నాడు—'

'ఏమైతేనేం మనూరికి పి. హెచ్. సి. వుండాల్సిందే ఆనందరావు మంచిపని జేస్తున్నాడు...లేకుంటే, కాస్తకూ, కూస్తకూ యీ మూలనుంచి బస్తీకి పోవాలంటే ఛస్తున్నాం... మొత్తానికి 'సమితి'లో మంచి పలుకుబడేవుంది ఆనందరావుకు!...'

'అయ్యో! నీ వెర్రిగాలా! ... అతడు పి.హెచ్.సి. పెట్టించాడూ అంటే నువు 'సర్‌పంచ్' అయ్యేదికల్ల...మనం తలపెట్టిన మంచిపన్లకు అతడేమాత్రం సంతోషించాడేంటి?...ఆ భరోసాతోనే అంటున్నాట్ట!— ఈమాటు గూడా నేనే గెలుస్తాను...సమితికి 'వైస్ ప్రెసిడెంట్' గూడా అవుతానని... ఇది జరగనిచ్చావో యిక మనపని వుత్తది...కావాలంటే మనం గెల్చాక పెట్టిద్దాం ... ఏమంటావ్?' అన్న నరసింహం మాటలకు వెంకట్రావు కాస్సేపు ఆలోచించి, 'అవును నిజమే మావా! ... ఏదో వుపాయం ఆలోచించాలి' అన్నాడు.

* * *

'మీఅబ్బాయి సుబ్బారావ్‌వున్నాడాండి?...'

గత రెండు రోజులుగా ఒంట్లో నలతగా వున్నందున స్కూలుకు సెలవుపెట్టి యింట్లోవున్న వరదరాజులుగారు, నెమ్మదిగా లేచి బయటకువచ్చి—

'ఎవరు నీవు?' అని అడిగారు.

'నేను లాయరు జగన్నాథరావుగారి కారు డ్రైవర్ని...సుబ్బారావుకోసం వచ్చాను.'

'సుబ్బారావ్ యింట్లో లేదు...ఎటో వెళ్ళినట్టున్నాడు ... ఎందుకూ ...'' అని అడిగారు వరదరాజులుగారు.



# పూర్వాసంధ్యా ప్రవర్తతే...

'మా అయ్యగారు జగన్నాథరావుగారు పంపించారండీ...వాళ్ళింట్లో గోపీ బాబుగారి వాచి తీశాడుట ... అందుకని దగ్గరుండి పిల్చుకురమ్మని పంపారు...'

'ఎవరు? మావాడా!...వాచి తీశాడా?... నే నొచ్చి మాట్లాడుతానని చెప్పు ఆయనతో' అని చెప్పి ఆయన వంకీకున్న చొక్కా తొడుక్కుని బయలుదేరారు. అసలీ మధ్య ఆయన సుబ్బులు సంగతి పట్టించుకోడం మానేశారు...ఎస్సెల్సీ మూడుసార్లు తప్పడంతో యిక వీడు పాసవడని చదువు మాన్పించేశారు...ఇక ఎప్పుడో ఆకలయినప్పుడు అన్నానికి రావడం, రాత్రి పదిగంటలకు పడుకోడానికి రావడం...యిదే యిప్పుడు సుబ్బులుకు యింటితోవున్న సంబంధం... తన జేబులో డబ్బులు మాయమవుతుంటే ఆయన జాగ్రత్తపడి జేబులో పెట్టడం మానేశారు...అంతేగాని తన కొడుకు ఎంత చెడ్డా దొంగతనం చేస్తాడంటే నమ్మలేక పొయ్యారు వరదరాజులుగారు. జగన్నాథరావుగారి అబ్బాయి గోపీ, సుబ్బులూ చిన్నప్పుడు క్లాస్‌మేట్స్. ఆ చనువుతో సుబ్బులు వాళ్ళింటికి వెళ్ళి పత్రికలూ, డిటెక్టివ్ నవలలు అవీ తెచ్చుకోడం కద్దు. ఆ విషయం ఆయనకు తెలుసు కూడా... 'కానీ అంతమాత్రాన వాడిమీద యింత అభాండం వేస్తారా?' అని ఆయనకు జగన్నాథరావుగారి మీద కోపం కూడా వచ్చింది...

ఉదయం పదిగంటలవేళ ... ఆ ఎండలో పడుతూ లేస్తూ వెళ్ళి పండిన మొఖాన పట్టిన చెమటను తుడుచుకుంటూ లోపలికి అడుగుపెట్టారు వరదరాజులుగారు...ఆయనన్ను చూచి పంచలోనే వున్న జగన్నాథరావుగారు, 'రండి' అంటూ కుర్చీ చూపించారు...

జగన్నాథరావుగారిది పెద్ద యిల్లు... ఇంటి ముందు పంచ...ముందు మెట్లమీద, కుండీల్లో పెట్టి పెంచుతున్న రకరకాల గులాబీ మొక్కలు యింటికంతా అందమిస్తుంటాయి...పంచలోకే వుంటుంది వాకిటి గది తలుపు...అదే గోపీ గది...అతడి క్లాస్‌మేట్స్ వాళ్ళూ వస్తుంటారని ఆ గది అతడికిచ్చారు. ప్రత్యేకంగా వుంటుందని...

ఎండలో వచ్చిన వరదరాజులుగారు రెండు నిముషాలదాకా మాట్లాడలేక పొయ్యారు... ఆ తర్వాత 'మా అబ్బాయికోసం వచ్చాడు మీ డ్రైవరు 'మీరు పిల్చుకురమ్మన్నార'ంటూ...' అంటూ ఆయనే ఎత్తారు...

ఇంతదాకా మౌనంగా వున్న జగన్నాథరావుగారు, 'అవునండీ.. నేనే కబురుపెట్టాను. మా అబ్బాయేమో స్నానానికి వెళుతూ రిస్ట్‌వాచి గదిలో టేబిల్ మీద పెట్టి వెళ్ళాట్ట. వచ్చి చూసుకుంటే లేదు. ఈ లోగా మీ సుబ్బులు లోపలికొచ్చి పుస్తకం పెట్టి వెళ్ళాట్ట...అందుకని అతడేమన్నా తీశాడేమో అడుగుదామని...' అన్నారు.

'అబ్బే! మావాడు అలాంటివాడు కాడండీ ఇంకెవరైనా లోపలికొచ్చారేమో వాకబు చెయ్యండి... అయినా మావాడు లోపలికెళ్ళడం ఎవరన్నా చూశారా?...' అని అడిగారు వరదరాజులుగారు...ఆయనకు లోపల మండిపోతోంది, వీళ్ళకు ఎన్ని లక్షలు ఆస్తి వుంటే మటుకు మావాడ్ని దొంగ అంటారా? అని?...

జగన్నాథరావుగారు డ్రైవరు వైపు సాభిప్రాయంగా చూశారు జరిగింది చెప్పమన్నట్లు...

'నేను చూశానండీ ... పొద్దున్నే కారు తుడుస్తున్నాను...శ్రీనివాసరావుగారి అబ్బాయి గారు వేణుబాబు వచ్చి 'గోపీ వున్నాడా?' అని అడిగారు ... 'స్నానం చేస్తున్నారు అబ్బాయిగారు' అని చెప్పాను... 'సరేలే కాలేజికి వెళ్ళేటప్పుడు మళ్ళీ వస్తాను.' అని చెప్పి వెళ్ళిపొయ్యారా బాబు...ఆ తర్వాత మీ అబ్బాయొచ్చి, గబ గబా గదిలోకి వెళ్ళబోతుంటే, 'అబ్బాయిగారు స్నానం చేస్తున్నారు ... వచ్చేదాకా యీ కుర్చీలో కూర్చోండి' అని పంచలోవున్న కుర్చీ చూపానండి...'కూర్చోడం ఎందుకు పుస్తకం యివ్వడానికి వచ్చాను...లోపల టేబిలు మీద పెట్టి వెళతాలే' అంటూ లోపలికి వెళ్ళాడు. రెండు నిముషాలకు తిరిగి వెళ్ళిపొయ్యాడు.' అంటూ డ్రైవరు చెప్పాడు.

ఇంతలో వాకిట్లో సైకిలు బెల్లు వినిపించింది...అంతా అటు చూశారు...

'కాలేజికి యిప్పటికే లేటయింది... ఇంకా నిలబడున్నావేరా గోపీ?...' అంటూ వాకిట్లోంచే కేకవేశాడు వేణు ... ఇందాకటి మంచి తండ్రి ప్రక్కన తలవంచుకుని విచారంగా నిలబడ్డ గోపీ వేణును లోపలికి రమ్మని సైగచేశాడు....

వేణును చూడగానే వరదరాజులుగారు 'గదిలోకి వేణు, సుబ్బులు యిద్దరూ వచ్చారంటున్నాడు...మరి మావాడేచేశాడని ఎందుకనుకోవాలి? ... ఇతడే తీశాడేమో కనుక్కోండి ముందు...ఇతడి సంగతి మీకు బాగా తెలియదు ... ఇతడి సావాసాలుగానీ, పోకిరీ వేషాలుగానీ అన్నీ నాకు బాగా తెలుసు—సిగరెట్లు కాల్చడంలాంటి దురభ్యాసాలు కూడావున్నయి... పచ్చి రౌడీ ... పైగా మా సుబ్బులంటే మొదట్నుంచీ గిట్టదు వీడికి...తనే తీసి సుబ్బులుమీద పెట్టొచ్చులే అని చేశాడేమో...గట్టిగా అడగండి...అదే బయటికొస్తుంది...లేనిపోనివి మా వాడిమీద అనే ముందు వాడ్ని కనుక్కోండి...' అన్నారు...ఆయన మాటల్లో ఆవేశంవుంది. అక్కసూ వుంది... 'ఏమో యీ రౌడీ వెధవ దొంగవాత్రం ఎందుకై వుండగూడదు!' అనుకున్నారు మనసులో...

వేణుకిదంతా అర్థంకాక తెల్లబోయి చూస్తున్నాడు అందరి మొఖాల్లోకి...వరదరాజులుగారు మింగేసేలా చూసి తలవంచుకున్నారు—

'ఏమిట్రా గోపీ?...' అని అడిగాడు వేణు గోపిని.

'నా వాచిరా...గదిలో టేబిల్‌మీద పెట్టి స్నానానికి వెళ్ళొచ్చేసరికి మాయమైంది... నువ్వేమన్నా చూశావురా?' అడగకూడదనుకుంటూనే అడిగేశాడు గోపీ విచార స్వరంతో.

'నేనా?'...' వేణు నిర్ఘాంతపొయ్యాడు.

'గోపీ స్నానం చేస్తున్నప్పుడు మా సుబ్బులుకంటె ముందు నువ్వెళ్ళావుటగా గదిలోకి?' వరదరాజులుగారు వేణును సూటిగా ప్రశ్నించారు దబాయిస్తున్నట్లుగా.

క్షణంలో వేణు అంతా గ్రహించాడు... జగన్నాథరావుగారు టేబిల్‌వైపు చూస్తూ ఏదో ఆలోచిస్తున్నారు. గోపీ యివేవీ విన్పించుకునే స్థితిలోలేడు...అతడి కళ్ళ ముందు ముచ్చటపడి కొనుక్కున్న 'రోలెక్స్' వాచి కదులాడుతోంది ... వరదరాజులుగారు దొంగను చూసినట్లే తీక్షణంగా చూస్తున్నారు....వేణుకు అంతా తననే అనుమానిస్తున్నట్లు అనిపించింది...

# ఎన్నో రకాలు ఎన్నుకోవడానికి

రేడియోలు మరియు ట్రాన్సిస్టర్లు
రు. 125 లు మొదలుకొని వున్నాయి





మోడెల్ టిఎ 0816



మోడెల్ టిఎ 0581



మోడెల్ టిఎ 0579



మోడెల్ టిఎ 0509



మోడెల్ టిఎ/టియు 0777



మోడెల్ టిఎ 0926



మోడెల్ టిఎ/టియు 0202



మోడెల్ టిఎ/టియు 0776



మోడెల్ టిఎ/టియు 0824



మోడెల్ టిఎ 0366

వాటిని మీ స్నేహితుడైన మర్ఫీ డీలరు వద్ద యీరోజే చూడండి.

**murphy** మర్ఫీ మీ గృహానికి ఆనందాన్నిస్తుంది!

*Murphy sets the standard*

# పూ ర్వా సం ధ్యా ప్ర వ ర్త తే..

'గోపీ! ... ఫ్రెండ్‌వని యింటికొచ్చినందుకు మంచి బుద్ధిచెప్పావ్! నేనే తీశానని మీ అందరికీ అనుమానంగావుంటే — ఇదిగో గోపీ! .. ఈ గడియారం నీదగ్గర వుంచుకో జగన్నాధరావుగారూ!... ఆ 'వాచి' ఎంతకుకొన్నదీ చెబితే యిప్పుడే యింటికి వెళ్ళి డబ్బు తెచ్చిస్తాను ..' అంటూ ఆ వే శం తో చేతి రిస్టువాచి తీసి రౌండ్ టేబిల్ మీద పడేశాడు వేణు ..ఈ అభాండంతో వుడుకెత్తిన నెత్తురు మొఖానికి చిమ్మి, ఎర్రగా కందగడ్డలా మారింది వేణు ముఖం. . ఇదంతా వరదరాజులు చేసిందే అయ్యుంటుందని అనుకున్నా, యిన్నాళ్లనుంచీ తెలిసినవాళ్ళు తన్ను అనుమానించడం వేణు భరించలేకపొయ్యాడు ..

వెంటనే జగన్నాధరావుగారు కలగజేసుకుని 'వేణూ! అనవసరంగా ఆవేశపడకు ముందు నీ గడియారం నీవు తీసేసుకో...మీ నాన్నా నేనూ ఒక్క ప్లీడరు దగ్గర అప్రెంటిస్ చేశాము మీ కుటుంబం ఎటువంటిదో, ఎవరి గుణాలు ఎటువంటివో నాకు బాగా తెలుసు .మేము నిన్నెప్పుడూ అనుమానించ లేదు ఇక ముందు అనుమానించబోము కూడా...' అన్నారు తొణక్కుండా నిశ్చలంగా...

'వేణూ! నువు తీశావని నేనన్నానుటరా?' స్నేహితుడి మనను కష్టపెట్టినందుకు నొచ్చుకుంటూ అన్నాడు గోపీ .

'అసలా వేణుబాబు గదిలోపలకే వెళ్ల లేదు ఇక్కడే ఆ మెట్లకింద నిలబడే వున్నాడుగారు . నేను లేడనగానే అట్నుంచీ అటే వెళ్లిపొయ్యాడు గదిలో కెళ్ళింది వాళ్ళబ్బాయొక్కడే ' అన్నాడు ముత్యాలు. డ్రైవరు ముత్యాలుకు కూడా వేణు, సుబ్బులు యిద్దరి గుణాలూ తెలుసు వేణు అసలు తీసే అవకాశమే లేదని జ్ఞాపకం చేశాడు జగన్నాధరావుగారికి ..

వరదరాజులుగారికి వాళ్లందరి మీదా కోప మొచ్చింది ఏమిటి వీళ్లంతా తన కొడుకుమీద కుట్ర పన్నినట్లు యిట్లా మాట్లాడుతారు! అనిపించిం దాయనకు . అసలే ఒంట్లో బాగుండటంలేదు. దానికి తోడు అంఖణం ..ఆయన నిగ్రహించుకోలేక పొయ్యారు...ఈ డ్రైవరు కూడా తన కొడుకు లోకువైపొయ్యాడే అన్న బాధ కలిగిందాయనకు... డ్రైవరు వైపు కొర కొరా చూచి, 'జగన్నాధరావుగారూ !. . మీ యింట్లో యింతమంది పనివాళ్ళా, వాళ్ళా తిరుగుతుంటారు వాళ్ల నెవ్వర్నీ అనుమానించకుండా, అమాయకపు వేధనను చేసి మావాడిమీద పడ్తారేం ? ముందు పెద్ద పత్తిత్తులా మాట్లాడుతున్నాడు, మీ డ్రైవరే తీశాడేమో? . నిలదీసి అడగండి ..' అన్నారు

ముత్యాలు కళ్ళు క్షణంలో చింతనిప్పుల్లా అయ్యాయి. ముఖం జేవురించింది వరద రాజుల్ని తీక్షణంగా చూస్తూ, 'ఏమయ్యోయ్! మాటలు తిన్నగా రానీ! .కూటికి పేదయినా గుణానికి పేదకాము ఎన్నాళ్లనుంచో వీళ్ళ దగ్గర పని చేస్తున్నాను ఇలాంటి పొల్లు గుణాలుంటే యిన్నాళ్లు వుండేవాడినా ?. . నీ కొడుకు అమాయకుడటనే అమాయకుడు! ఎవరికియ్యాలన్నీ కబుర్లు చెప్పేది ? . నడివీధిలో కిళ్లీకొట్టు గోపాలం నిలేసి, వా అరవైరూపాయల అప్పు తీరుస్తావా? తన్నమంటావా ? అని నిలేసింది నీ కొడుకువా ? నన్నా? . . అప్పివ్వనన్నాడని ఆ మలుపు దగ్గర కిళ్లీకొట్టు దోచేసింది నీ కొడుకా? నేనా? మొన్న మొన్న ఆ వెచ్చాలకొట్టులో గల్లాపెట్టె దగ్గర కూర్చుని కబుర్లు చెప్పినట్టే చెప్పి, ఇరవై కాజేసి పోబోతుంటే, చూసి పట్టుకుని నిలేసింది ఎవరి నయ్యా? పైగా మా మీద పడ్తున్నావ్! మేము రెక్కలమ్ముకునే వాళ్ళంగానీ పరువమ్ముకోం ' అని దులిపాడు కచ్చకొద్దీ డ్రైవరు.

'ముత్యాలూ! అనవసరపు విషయాలు మాట్లాడకు ' మధ్యలో జోక్యం చేసుకున్నారు జగన్నాధరావుగారు 'వరదరాజులు గారూ! .ముత్యాలు మాయింట్లో నా చిన్న ప్పటినుండీ వుంటున్నవాడు. అతడి చేతిమీదుగా వేలువేలు యినప్పెట్టెలో దాచి భద్రంగా అప్పగించినవాడు . అతడిమీద నాకెలాంటి అపనమ్మకమూలేదు అయినా మనం మనం ఘర్షణపడడమెందుకు? . అది ఖరీదైన వాచి నేను పోలీసు రిపోర్టు యిస్తాను వాళ్లే కనుక్కుంటారు అన్ని విషయాలూ...' యిక అవిషయంమీద

ఎవ్వరూ తర్జన భర్జన చెయ్యకుండా అంత టితో ఆపేసి.

వరదరాజులుగారి గుండె ఆగినంత పనయింది ... ముత్యాలు కొడుకు చేసినవన్నీ ఏ కరువుపెడుతుంటె, 'నిజంగానే సుబ్బులిలా తయారయ్యాడా?' అనే భయంవేసింది. అవన్నీ విని ఆయన నిర్ఘాంతపొయ్యారు... ఇక అక్కడ ఒక్కక్షణం వుండడానికి కూడా మొహం చెల్లక, 'నేను కూడా మావాడ్ని కనుక్కుంటాను లెండి అసలేం జరిగిందో?...' అని చెప్పి అక్కడినుండి బయటపడ్డారు.

ఆలోచనలతో, అవమానంతో ఆయన తల తిరిగిపోతోంది...అసలు 'వీడే చేశాడేమో అవని' అనే అనుమానం గూడా యిప్పుడే కలిగిందాయనకు... తను తప్పుచేశాడు ... 'వాడ్ని కనుక్కుంటాను లెండి' అని ప్లీడరు గారితో ముందే అనుంటే బాగుండేది ... వాడు తీశానంటే కనీసం డబ్బు కడ్తానన్నా సరిపొయ్యేది ... అనవసరంగా తను సుబ్బుర్ని వెనకేసుకొచ్చాడేమో...ఇప్పుడాయన పోలీసు రిపోర్టుయిస్తే ఏమవుతుంది ?... పోలీసులు సుబ్బుల్నే పట్టుకుంటే...ఓహ్ ! అప్పుడు తను దొంగ తండ్రి అనిపించుకోవాలి! ... కొడుకైనా డాక్టరు కావాలని కలలుకన్నాడు తను ఒకప్పుడు, తన ఆశలేవీ ఫలించలేదు ... పైగా వీడు దొంగయి కూచున్నాడు!... అనుకుంటుంటే ఆయన కళ్ళముందు చేతులకు బేడీలతో వున్న సుబ్బులు కనిపించాడు ... ఆయన తల గిర్రున తిరిగిపోతోంది !... తను దొంగ తండ్రి! సుబ్బులు!...జైలు! ... ఆయనకు ప్రపంచమంతా ఎర్రగా అయిపోతున్నట్లు కనిపించింది ... క్రమంగా అంతా చీకటిగా మారిపోయింది... తల బ్రద్దలైపోతున్నట్లుగా అనిపించి, తలపట్టుకోబోయి తూలి క్రింద పడిపొయ్యారు స్పృహలేకుండా...

తల్లికి మందు తేవడానికి ఆసుపత్రికి వెళ్ళి, హెడ్మాస్టరుగారి పర్మిషనువిూద ఒక గంట లేటుగా స్కూలు కెళుతున్న శంకరం గారు, దోవలోపడివున్న వరదరాజుల్ని చూచి, 'అయ్యయ్యో'... పాపం!... వరదరాజులుగారు పడిపొయ్యారు...' అంటూ దగ్గరకు వచ్చారు ... అంతదాకా జనమంతా చుట్టూ మూగి చూస్తున్నారు ఏవరైందీ తెలియక...శంకరం కాపిని నీళ్లు తెప్పించి

# పూర్వాసంధ్యా ప్రవర్తతే..

ముఖంమీద చల్లారు .. స్పృహరాలేదు వెంటనే ఆ దోవనపోతున్న రిక్షా ఒకటి పిలిచి, యిద్దరు ముగ్గురు సాయంతో వరదరాజులుగారిని రిక్షాలో వేసుకొని ఆసుపత్రికి తీసుకువెళ్లారు దారిలో తెలిసిన కుర్రాడు కనిపిస్తే, వరదరాజులు గారి యింటికి కబురు చేశారు శంకరం గారు అది విన్న కమలమ్మగారికి నోట మాట రాలేదు ప్రపంచమంతా శూన్యంగా అనిపించిం దావిడకు

ఇరుగుపొరుగువచ్చి ధైర్యంచెప్పి, తలుపు తాళం పెట్టించి, ఆసుపత్రికి తీసుకెళ్లారు. తెలివితప్పి పడున్న భర్తను చూడగానే ఆవిడ గుండెలు బాదుకుంది మొట మొదటిసారిగా ఆయన విలువ యిప్పుడే తెలిసిందావిడకు ఆయన కేమన్నా జరిగితే తన గతి ఏమిటి ? కమలమ్మగారికి ఒళ్లు తెలియలేదు ఒక్క కేకపెట్టి ఆయనమీద పడిపోయింది

'ఆస్పత్రిలో యిలా ఏడ్చి గోల చేస్తే అనల్లండనివ్వరు మీరు ధైర్యంగా వుండండి' అంటూ ఆమెను లేవదీసింది నర్సు ..

* * *

'ఒరేయ్ సుబ్బులూ ! కొంప మునిగిందిరా! ఆ గోపీగాడు పోలీసు రిపోర్టు యిస్తా వన్నాట్ట . వాచి కొట్టేసింది నువ్వేనని వాళ్లకు బాగా అనుమానంగా వుందిట . వాళ్ల నాన్నగారు కూడా మీ నాన్నను పిల్చి బెదిరించారుట పోలీసు రిపోర్టు యిస్తానని' అని స్నేహితుడు వచ్చి చెప్పగానే సుబ్బులు గజ గజ లాడిపోయ్యాడు

'నిజంగానే నట్రా జగ్గులూ ?.. ' కంపిత స్వరంతో అడిగాడు సుబ్బులు

'నిజమా! బాగుంది నెంబరుతో సహా రిపోర్టు యిచ్చామనే చెప్పాట్ట అందరితో గోపి ..'

సుబ్బులుకు ఎటూ పాలుపోలేదు.. విజయవాడయినా వెళ్లి యీ 'వాచి' అమ్ముకుంటే బాగుండు ననిపించింది కానీ ఎలా వెళ్లడం? .. అప్పుడే పోలీసులు తనకోసం వెతుకుతుంటే ?

'అయితే ఏం చెయ్యమంటావురా ? .' స్నేహితుడ్ని సలహా అడిగాడు ఏమీ తోచక ఏడుపు మొహం పెట్టి ..

'నన్నడిగితే ఏం చెబుతాను... అయినా ఓ పని చేద్దాం... రాత్రిదాకా నువు బయటికి రాకు రాత్రి చీకటిపడ్డాక, దాన్ని తాకట్టు పెట్టి డబ్బు తీసుకుని బెజవాడ వెళ్లిపోదాం ..'

'తాకట్టు పెట్టడానికి వెళ్లినప్పుడు ఎవరైనా పట్టుకుంటే ? ..' అని తన భయం బయటపెట్టాడు సుబ్బులు అతడు చెయ్యడమైతే చేశాడు గానీ, తప్పించుకునే మార్గం కన్పించటంలేదు .

చీకటి పడేదాకా మిత్రుడి గదిలోనే తల దాచుకున్నాడు సుబ్బులు . జగ్గులు కూడా సుబ్బులు లాంటి రకమే. అందుకనే 'వాచి' అమ్మేదాకా నలుగురి కళ్లా పడకుండా జగ్గులు గదికి వచ్చాడు సుబ్బులు. . 'తెల్లవారంగానే అమ్మడమో, తాకట్టు పెట్టడమో చేద్దాం భయపడకు...' అంటూ హామీ యిచ్చి పడుకున్నాడు యిటువంటి వాటిలో ఆరితేరిన జగ్గులు.

సుబ్బులుకు ఎంతకూ నిద్రపట్టలేదు. పోలీసులు. జైలు చీకటికొట్టులో తను ఏడుస్తూ కూర్చోడం ..యింకా ఏవేవో ఊహించుకున్న సుబ్బులు, ఆ గడియారంతో సహా రాత్రికిరాత్రి బెజవాడ రోడ్డు పట్టాడు అది నడకో పరుగోకాక్, తెల్లవారేసరికి బెజవాడ చేరుకున్నాడు.. నడుస్తున్నంతసేపూ తనవెంట ఎవరో తరుముకొస్తున్నట్లుగానే అనిపించి, మధ్యమధ్య పరుగెత్తాడుకూడా ... తన జేబులో వున్న దాన్ని వదిలించుకుంటేగానీ...ముందు తనకు మనశ్శాంతి వుండదు...

కాళ్ళు పీక్కుపోతున్నయి. కడుపులో ఆకలి మండిపోతోంది. కనీసం కాఫీనీళ్లు పడాలన్నా, చిల్లిగవ్వలేదు జాగ్రత్తగా నలువైపులా చూసుకుంటూ ఓమార్వాడీ కొట్టులోకి దూరాడు సుబ్బులు...

'ఏమి కావాలయ్యా?...' అప్పుడప్పుడే కొట్టుతెరిచి, పద్దు చూసుకొంటున్న మార్వాడీ ప్రశ్నించాడు...

చుట్టూ ఎవరూలేకుండాచూసి భయ భయంగా జేబులో వాచితీసి అతడిముందు పెట్టాడు .'దీన్ని తాకట్టుపెట్టుకుని కొద్దిగా డబ్బివ్వు .'

మార్వాడి గడియారం చేతిలోకి తీసుకున్నాడు...దానివైపు సుబ్బులువైపు పరకాయించి చూశాడు జాగ్రత్తగా దాన్ని లోపల పెట్టుకుని ఓ పదిరూపాయలనోటు తీసి యిచ్చాడు...

'పదేనా? అది మంచి ఖరీదైనవాచి . ఓ యాభైఅయినా యివ్వు అర్జంటుగా కావల్సివచ్చి తాకట్టు పెడుతున్నాగానీ. .' అంటూ సణిగాడు సుబ్బులు

'తాకట్టా? గికట్టా? ఏమ య్యా చెబుతావు? అంతమంచి 'వాచి' పెట్టుకునే వాళ్లు తాకట్టు ఎన్నటికీపెట్టరు మాకు తెలీదు అనుకోకు . . ఎక్కువ తక్కువ మాట్లాడితివా పోలీసులకు ఫోను .. చేస్తాను మొఖంచూస్తూనే మాకు తెలిసిపోతుంది ..' అని భయపెట్టాడు మార్వాడీ.

సుబ్బులుకు ఆ వాచి తీసుకుని మరో కొట్టుకువెళ్ళి అమ్మినా ఓ యాభై రూపాయలు వస్తాయ్యేమో ననిపించింది. కానీ యీ మార్వాడి గడియారం యిమ్మంటే తిరిగి యిస్తాడా రచ్చచెయ్యకుండా .. అనే అనుమానం వచ్చింది పైగా ఆ గడియారాన్ని ఎంతత్వరగా వదిలించుకుంటే, అంత హాయి అనిపిస్తోందిప్పుడు సుబ్బులుకు అతడు కిమ్మనకుండా పది రూపాయాలు తీసుకుని బయటకు నడిచాడు ...ఆ రోజు సుష్టుగా భోజనంచేశాడు. . రాత్రి రెండాటలు సినిమాలు చూశాడు . మర్నాడు ఎలాగో గడిపేశాడు . మూడో రోజుకు చిల్లిగవ్వలేదు చేతిలో...

పది దాటింది పదకొండు దాటింది .. కడుపులో ఆకలి చల్లబడేమార్గం కనిపించలేదు పెద్దపెద్ద హోటళ్లముందు, రోడ్లమీద తిరగడానికి భయంవేసింది, తెలిసినవాళ్లెవరైనా కన్పిస్తారేమో, పోలీసులకు అమాకే యిస్తారేమోనని . ఊరికి చివర, ఓ మారుమూల వీధిలో చిన్నహోటలు ముందు తచ్చాడుతూంటే ఆ హోటలు యజమానివచ్చి, 'ఎన్నాయ్యా ఎన్నావేణుం ?' అని అడిగాడు 'ఆకలిగా వుంది ఏమైనా పెట్టు ఏదన్నా పని చెప్పినా చేస్తా'నన్న సుబ్బులుచేత, పిండి రుబ్బించి అన్నం పెట్టాడు హోటల్ యజమాని ... అలాగే సర్వరుగా వుంటున్నాడు సుబ్బారావు విజయవాడలో...

* * *

వరదరాజులుగారికి స్పృహ వచ్చి రాగానే

మొదట అడిగిన ప్రశ్న, 'ఏడీ?...వాడేడీ?' అని

కమలమ్మగారికి అర్థం కాక, 'ఎవరండీ?' అన్నది.

'వాడే...నీ ముద్దుల కొడుకు ... నువ్వే వాణ్ని యిలా చేసింది... ఏడవండి...ఇద్దరూ ఏడవండి...ఇప్పుడు కాదు...నేను చచ్చాక... తెలుస్తుంది...' అంటూ ఆయన పెద్దగా అరవడం మొదలుపెట్టేసరికి, అసలు సంగతి తెలియని కమలమ్మగారు, 'అయ్యో! ఏం మాటలండీ అవి?' అంది ఏమనాలో తోచక

అంతలోకే నర్సు వచ్చి, 'ఆయన్ని పెద్దగా మాట్లాడనివ్వకండి. ఎక్కువ ఆవేశ పడనివ్వకండి ..' అని చెప్పి వెళ్ళిపోయింది కానీ ఆయన వింటేగా ?...

'వాడొస్తే చెప్పు ..వా డొచ్చాడా ?...' యిదే కలవరింత

ఏమో సుబ్బులు వచ్చిందీ లేందీ ఆమెకేం తెలుసు? ఆయనకు స్పృహ వచ్చేదాకా కూడా నీళ్ళా లేకుండా, అక్కడే పడి వుంది. 'కనీసం తండ్రికిలా వున్నప్పుడు కూడా చూడ్డానికి రాలేదు వీడు, చూడు !' అని ఒకటికి పదిమాట్లు అనుకుంది . ఆ సాయంత్రం యింటికి వెళ్ళినప్పు డడిగితే, ప్రొద్దుటినుండీ యింటికే రాలేదని చెప్పారు యింటివాళ్ళు ఆ రాత్రి తండ్రికి తోడుగా పడుకోడానికి సుబ్బుల్ని పంపుదామను కున్న కమలమ్మగారు అతడింకా యిల్లు చేరలేదని విని కంగారుపడింది . గంటలు గడిచేకొద్దీ ఆవిడకు ఆదుర్దా ఎక్కువవుతోంది

'రాత్రి గడిచింది .ఆవిడ యించు మించు జాగారం చేసిందనే చెప్పాలి.. కానీ ఆ అర్ధ రాత్రివేళ ఎక్కడికని వెళ్ళగలదు పాపం!... ఇంటిగలవాళ్ళతో అంటే 'వస్తాడు లెండి' అన్నారు.. తెల తెలవారుతుండగానే రెండో కొడుకును లేపి, బ్రతిమాలి పంపింది, సుబ్బులు ఎక్కడున్నాడో చూసి రమ్మని... వాడు మధ్యాన్నం పన్నెండింటిదాకా సుబ్బుల స్నేహితుల యిళ్ళన్నీ తిరిగి భోగట్టా పట్టుకొచ్చాడు, జరిగిన సంగతంతా . రాత్రి దాకా జగ్గులు గదిలోనే వున్నాట్ట .తెల్లారే సరికి కన్పించలేదని కూడా చెప్పాడు...

కమలమ్మగారు మొదలు నరికిన చెట్టులా కూలిపోయింది. తన తండ్రి సుబ్బారావుగారు స్కూల్స్ యిన్స్పెక్టరుగా చేశారు...జమాన్లు గిమాన్లు ఎంతో అట్టహాసంగా అయన బ్రతుకు వెళ్ళబుచ్చు కున్నారు. అయన పేరు పెట్టుకున్నందుకు అపురూపంగా చూసుకుంది...ఆయనంతవాడు కావాలని కోరుకుంది ... కానీ జరిగింది తల్చుకుంటే ఆవిడ గుండె అవిసిపోతు న్నయి .. పెద్దగా గుండెలు బాదుకొని ఏడవడానికూడా లేదు...నలుగురూ విని నవ్వుతారేమోనని అదో కబాధ!...మింగాలేక కక్కాలేక, ఏమీ చెయ్యడానికీ తోచక... చివరికి భర్తతో చెప్పి, 'ఏంచెయ్యమంటా రని?' అడిగింది .

ఆయన కోపం పట్టలేక పొయ్యారు. 'ఏం చేస్తారు!...ఏట్లోదూకి చావండి యిద్దరూ.. అసలు ..నువ్వే కారణం. దీని కంతా......వెనకేసుకొచ్చి .... అనుభవించు.' ఆయన మొఖం కందగడ్డలా మారిపోయింది మళ్ళీ స్పృహతప్పి పడిపొయ్యారు...

'మీారెందుకండీ ? ఆయనకు కోపం తెప్పిస్తారు మాటిమాటికీ?' అంటూ నర్సు విసుక్కుంది...

'పోనె్ల ..మంచిపని చేశాడు . వెధవ... మళ్ళీ నాకు మొహం చూపించకుండా...' తెలివిరాగానే అన్నారాయన .కానీ లోలోపల ఆ పితృహృదయం ఎక్కడ తిరుగుతున్నాడో ఏమైనాడోనని మధనపడుతూనే వుంది . కానీ కమలమ్మగారి కడుపు తీపి ఆయనలా వూరుకుండనివ్వలేదు. మెళ్ళో చంద్రహారం తాకట్టు పెట్టి తెచ్చిన డబ్బులో, కొంత సుబ్బులు స్నేహితులకిచ్చి 'సుబ్బులు జాడ కనుక్కో'మని పంపింది...

'రెండురోజులు తిరిగి కుక్కలా వాడే వస్తాడు, అక్కడ వాడి మొహాన కూడు పడేసేదెవరు?' అనుకున్న వరదరాజులుగారికి, స్నేహితుల్ని పంపానుగదా కనిపించకపోతాడా' అనుకున్న కమలమ్మగారికి యిద్దరికీ ఆశా భంగమే అయింది.. భార్యా భర్తలు ఆ విషయం ముచ్చటించు కుంటున్నప్పుడే కిటికీ లోంచి శంకరంగారు పార్వతీరావడం గమనిం చారు వరదరాజులుగారు ఒక్కసారిగా కుంచించుకుపోయి, మొహం చూపి పలుక రించలేక నిద్ర నటించారు వరదరాజులు గారు తమ పరిస్థితి చూచి నవ్వడానికే వచ్చారనుకుంది కమలమ్మగారు.

అసలు యీ విషయం శంకరంగారు చెప్పగానే, 'వెళ్ళి చూసొద్దామ్మన్న' పార్వతితో 'వాళ్ళు మన సానుభూతిని అపార్థం చేసు కుంటారేమో'నని ముందే అన్నారు శంకరం గారు ... కానీ పార్వతి పట్టుబట్టింది 'వాళ్ళేమనుకుంటే మనకేం. ఒకసారి వెళ్ళి చూసొస్తే మన మనసుకు తృప్తిగావుంటుంది. పైగా లోకంకూడా అదే అంటుంది ' అని బయలుదేరింది

పార్వతిని చూసి అయిష్టంగానే, 'రా .' అని పిల్చింది కమలమ్మగారు ... ఏవేవో అడుగుతున్న పార్వతికి, 'ఊఁ.. ఆఁ .' అని ముక్తసరిగా చెప్పింది కమలమ్మగారు .

'ఇంకా ఎన్నాళ్ళుండాలన్నారు హాస్పిటల్లో? .'

'రేపో మాపో యింటికి పంపినా, మూడు నెల్లు రెస్టు తీసుకోవాలన్నారు. అయినా మా కర్మ యిదంతా. పిల్లా జల్లా వచ్చగా వున్నామని కుళ్ళుకుచచ్చారు అంతా . ఇప్పుడు కళ్ళు చల్లబడతయిలే ..' అంటూ విసిరిన కమలమ్మగారి బాణం సూటిగా పార్వతి గుండెల్లో గుచ్చుకుంది ... ఒకే ఒకమాట చాలు పాలకుండలాంటి మనసు విరగడానికి. ...తర్వాత దంపతులు లేచారు 'వస్తా'మని '

(ఇంకా వుంది)






'వీరా పేరు ?' ఫైలుచూస్తూ అడిగాడో సారధి.

'అరుంధతి' మెల్లగా జవాబు ఇచ్చింది ఆ యువతి.

'క్వాలిఫికేషన్ ?'

'మెట్రిక్ పాసయ్యాను'

'ఇదివర కెక్కడైనా పనిచేసారా ?'

'లేదుసార్ !'

'సరే మీరు వెళ్ళండి' అన్నాడు సారధి తలెత్తిచూసి. నమస్కారంచేసి ఆమె వెళ్ళిపోయింది.

'ఉదయం సీతాపతి తన యింటికివచ్చి ఈ అమ్మాయిని సిఫార్సుచేస్తూ ఎంతో ప్రాధేయపడ్డాడు రాజకీయ నాయకుల్లా ఆర్భాటమూ చేయలేదు. అధికారమూ చూపలేదు. ఎంతో మర్యాదగా నమ్రతగా అమ్మాయి స్థితిగతులు గూర్చిచెప్పి 'ఉద్యోగానికి తగిన అర్హతలున్నాయని తోస్తే కాస్త దయచూపండి' అన్నాడు. పాపం పేద పిల్ల. సభ్యత సంస్కారంగల యువతి. ఈపాటి ఉద్యోగానికి అంతకంటె ఇంకేం క్వాలిఫికేషన్లు కావాలి? ఆ అమ్మాయినే సెలక్టు చేయాలి' అనుకున్నాడు సారధి.

బెల్ నొక్కాడు ప్యూన్ వచ్చాడు.

'శ్రీమతి రాజ్యలక్ష్మి' అన్నాడు ప్యూన్ వెళ్ళిపోయాడు.

మర్నిమిషం కర్టెను తొలగించుకొని ఒక యువతిలోపలకు వచ్చింది

'పేరు?' తలెత్తకుండానే ప్రశ్నించాడు సారధి

'వి. రాజ్యలక్ష్మి'

'ఏం చదివారు?'

'పి యు. సి'

'పాసయ్యారా?'

'ఆఁ'

తలెత్తి చూసాడు సారధి. అంతే దిగ్భ్రాంతుడయ్యాడు. ఆమెకూడ అతన్ని చూసి అదేస్థితికి గురయింది.

'బావ!' అప్రయత్నంగా ఆమె నోటి వెంట వెలువడిందా మాట.

'రాజీ!' విస్మయంగా చూసాడు సారధి.

'ఎంత మారిపోయావు రాజీ' ఏదో ఆత్మీయతాభావం ఉంటేనేతప్ప మామూలుగా నిన్నుచూసి గుర్తించడమే అసంభవం.' అన్నాడు. ఆమె మాట్లాడలేదు.

'ఇక్కడే ఉంటున్నారా?' అడిగాడు.

అవునన్నట్టు . తలూపింది రాజ్యలక్ష్మి

'ఎన్నాళ్ళనుండి?'

'రెండేళ్ళు కావస్తోంది' మెల్లగా చెప్పింది

'రెండేళ్ళు!' విస్మయపడి చూసాడు.' మూడేళ్ళుగా నేనూ ఇక్కడే ఉంటున్నాను. కాని నీ సంగతులేవీ నాకు తెలియవు. పొర పాటునకూడ ఎక్కడా తటస్థపడలేదు ఎంత చిత్రంగా ఉందో చూసావా!' అన్నాడు.

ఆమె నిట్టూర్పు విడిచింది

'అలా కూర్చో' అన్నాడు ఆమె కుర్చీలో కూర్చుంది.

టిన్నులోంచి సిగరెట్ తీసి వెలిగించి సీట్లోంచిలేచి కిటికీ దగ్గరకు వెళ్ళాడు. కర్టెను తొలగించి పైకిచూస్తూ, 'నీకేమని పించినా నాకుమాత్రం చాల తమాషాగా ఉంది రాజీ!'అన్నాడు. ఆమె మాట్లాడలేదు

'ఈ ఇంటర్వ్యూయే లేకుంటే మనమిక కలుసుకొనేవాళ్ళమే కాదేమో! అవును మన సమాగమానికి అవసర మేముంది గనుక?' అన్నాడు.

అమె ఇప్పుడూ మాట్లాడలేదు.

'ఉద్యోగానికి వచ్చావు రాజీ! కాని నాచేతి క్రింద పనిచేయగలవా?'

కలవరపాటుతో చూసింది రాజ్యలక్ష్మి

వెనక్కిచూసి తల పంకించాడు సారధి

'నువ్వు ఉద్యోగం చేయాల్సిన అవసర మేమిటో, ఇందుకు తోడయిన పరిస్థితు లేమిటో నాకర్థం గావడంలేదు రాజీ!' అన్నాడు ఆమె బాధగాచూసి తలవంచుకొంది

మెల్లగా ఆమెచెంతకు వచ్చాడు సారధి 'కాఫీ తెప్పించేదా?' అన్నాడు 'వద్దు' అనిలేచి 'నేను వచ్చి చాలసేపయింది బయట చాల మంది వెయిట్‌చేస్తున్నారు వారు మరోలా—' అనేంతలో అతని ముఖం దెబ్బతిన్నట్టుగా మ్లానమైపోయింది 'ఎక్స్‌క్యూజ్ మి రాజీ!' అని అటుతిరిగిపోయి 'సరే వెళ్ళు. నీ అడ్రసు చెప్పు నీకభ్యంతరం లేకపోతే సాయంకాలం గాని రేపు ఉదయంగాని వచ్చి కలుసు కంటాను 'అన్నాడు 'నన్ను కలుసుకోడానికి నీ కభ్యంతరం ఏమిటి బావా! ఉహూ అలా ఎప్పుడూ భావించవద్దు నీరాకనెప్పుడూ వేనపేక్షిస్తాను. నేనేకాదు వారుకూడ' అన్నది

అమాటతో అతనిముఖం మరింత వివర్ణ మైపోయింది. టేబిలుమీదఉన్న చిన్న కాగితంపై అడ్రసువ్రాసి 'ఇదిగో అడ్రసు సాయంకాలం తప్పకుండా రాబావా! మరినే వెళతాను' అని వెళ్ళిపోయింది.

ఇటుతిరిగి నిట్టూర్చి సీట్లో కూల బడ్డాడు సారధి. ప్యూన్‌వచ్చాడు.

'విజయలక్ష్మి!' అన్నాడు సారధి

ప్యూన్ వెళ్ళాడు ఎవరో వచ్చారు. ఆతనేమో అడిగాడు ఆమె చెప్పింది వెళ్ళ మన్నాడు, వెళ్ళిపోయింది మరెవరో వచ్చారు ఎవరు వస్తున్నారో ఏమడుగుతున్నాడో అతనికే తెలియదు లిస్టులో వారంతా అయారు. 'హెచ్. సి ని పిలువు' అన్నాడు. ప్యూన్ వెళ్ళిపోయాడు. కాస్సేపట్లో ఒక బుర్రమీసాల వ్యక్తి కళ్ళద్దాలు సవరించు కుంటూ లోపలికివచ్చాడు

ఫైలు ముందు కునెట్టి 'అర్డరువేసాను. ప్రొసీడింగ్సువ్రాసి బంగళాకు పంపండి నేనిక వెళుతున్నా'అన్నాడు డ్రాయరు తెరచి తాళాలువేస్తూ. 'అలాగేసార్' ఫైలు తీసు కొని హెచ్ సి వెళ్ళిపోయాడు

* * *

జీపు దొండపర్తి బజారు దాటిపోయింది

'ఎక్కడ సార్!' అ డి గా డు డ్రైవరు

జేబులోంచి స్లిప్‌తీసాడు సారధి

'వి రా మ చ ం ద్ర రా వు, లలితానగర్ ఎవర్నన్నా అడుగు' అన్నాడు ఇంక్వనులో స్లోచేసి అటునుంచివస్తున్న ఒక వ్యక్తిని అడి గాడు డ్రైవరు ఆ అడ్రసు ఎక్కడని

'ఏం చేస్తుంటారు?' అడిగాడా వ్యక్తి డ్రైవరు వెనక్కి చూసాడు. సారధి తల పంకించి 'తెలియదు' అన్నాడు

'ఈ నెంబరు ఇక్కడకాదండి ప్రక్క వీధిలో గణేశ్ కోవెలలేదూ ఆ ప్రక్కవీధిలో అడగండి ఈడోరు నెంబరక్కడే' అన్నాడా వ్యక్తి.

'థాంక్సు' జీపు ముందుకు సాగింది మెల్లగాపోనిస్తూ తలవంచి ఇళ్ళవైపు చూస్తున్నాడు డ్రైవరు

'ఎనిమిది కదూ, ఇది నాలుగు'అని కాస్త ముందుకుపోయి 'ఇదే సార్' అన్నాడు డ్రైవరు.

'అడిగి రమ్మంటారా!' జీపు దిగాడు డ్రైవరు

'నేనూ వస్తానపద' తనూదిగి లోపలికి నడిచాడు సారధి ముందున్న భవంతిలో ఉన్నవారు వెనక్కి వెళ్ళమన్నారు లోపల కమ్మలు ఇళ్ళువాసఉంది. అక్కడకు వెళ్ళి పిలిచాడు డ్రైవరు.

'ఎవరది?' లోపల్నించి వచ్చిందొక వృద్ధు రాలు

'చూడమ్మా! ఇక్కడ రామచంద్రరావు గారని ఒకతను ఉంటున్నారట.' అడిగాడు డ్రైవరు.

'రామచంద్రరావా!' అని లోపలకు చూసి 'రాజ్యం మొగుడిపేరు ఏమిటే' అనడిగింది.

'రామచంద్రరావత్తా' అని ఎవరో ఇంట్లోంచి చెప్పారు.

సారధిముఖం వికసించింది. ముందుకు వచ్చాడు. 'వారేనండి' అని 'రాజ్యలక్ష్మి ఇంట్లో ఉందా?' అనడిగాడు.

'లేదుబాబూ! హాస్పటల్కు వెళ్ళింది' అన్నది అవ్వ

'ఎంతసేపట్లో వస్తారు?'

'అరు గ ం ట ల కల్లా వచ్చేస్తుంది. బాబూ! ఇప్పుడెంతయింది?'

''పావుతక్కువ ఆరు. సరే నే మళ్ళీ వస్తాలెండి' అని వెనక్కి వచ్చాడు సారధి. పైకివచ్చారు

'నువ్వు వెళ్ళిపో జాకబ్. నే తర్వాతవస్తా. జీపు బంగళాదగ్గర వదిలేసి నువ్వు ఇంటికి వెళ్ళిపో' అన్నాడు సారధి

'అలాగేసార్' సె ల్యూ ట్ చే సి జీపు ఎక్కాడు డ్రైవరు.

జీపు కదిలిపోయింది సిగరెట్ వెలిగించి జంక్షనువైపు నడిచాడు సారధి

'బస్‌దిగి అయినా, రిక్షాలో అయినా ఇటేరావాలి ఇక్కడ నిలబడితే సరిపోతుంది' అనుకున్నాడు కిళ్ళీ కొట్టుదగ్గర నిలబడి. అతనితో పెద్ద పరిచయం లేకపోయినా అతనెవరైంది ఆ కిళ్ళీకొట్టు వాయర్‌కి తెలుసు. అ ం దు కే 'అలా బల్లమీద కూర్చోండిసార్' అన్నాడు. సరేనని కూర్చు న్నాడు సారధి

రెండు సంవత్సరాలుగా రాజ్యం ఇక్కడ ఉంటోంది మూడేళ్ళుగా తనిక్కడ ఉంటు న్నాడు అయినా ఒకరి వునికి మరొకరికి తెలియదు తనిక్కడ ఉంటున్నట్టుగా తన బంధువుల్లో చాలమందికి తెలుసు వారి ద్వారాగానైనా రాజ్యం తెలుసుకోలేదా? అసలు బంధువుల్నే రాజ్యం కలుసుకో లేదా?'

ఆలోచిస్తున్నాడు సారధి.

# ఆంధ్రసచిత్రవారపత్రిక

## 1967 దీపావళి కథల పోటీ

ఎప్పటివలెనే ఈ సంవత్సరంకూడా "ఆంధ్రసచిత్రవారపత్రిక దీపావళి కథలపోటీ" నిర్వహించబోతున్నదని తెలపటానికి సంతోషిస్తున్నాము. రచయితలందరూ ఎప్పటివలే మాతో సహకరించి ఈ పోటీని జయప్రదం చేస్తారని ఆశిస్తున్నాము.

## మొదటి బహుమతి రు. 1600

## రెండవ బహుమతి రు. 900

## మూడవ బహుమతి రు. 500

### నిబంధనలు

1 కథలు స్వంత రచనలై ఉండాలి ప్రతి కథతోనూ రచయిత అది తన స్వంతరచనేనని, దేనికీ అనువాదంకానీ, అనుసరణకానీ కాదని హామీ రాసి పంపాలి ఈ హామీలు వేరే కాగితం మీద కాక కథ వ్రాతప్రతి మీదనే రాసి ఉండాలి.

2 కథలు తెలుగువారి జీవితానికి సంబంధించి ఉండాలి.

3 వ్రాతప్రతి మీద "దీపావళి కథల పోటీకి" అని స్పష్టంగా రాయాలి. కాగితానికి ఒక వైపు మాత్రమే సిరాతో రాయాలి. రచయిత పేరు, పూర్తి చిరునామా కూడా వ్రాతప్రతి మీద స్పష్టంగా రాయాలి. రచనలు 12 అరఠావు (ఎక్సర్సైజు నోట్‌బుక్ పేజికి రెండు రెట్లు) పేజీలకు మించరాదు

4. కవరు మీద "దీపావళి కథల పోటీకి" అని స్పష్టంగా రాయాలి. పోటీకి రచనలు 'సంపాదకుడు, ఆంధ్రసచిత్ర వారపత్రిక, 7, తంబుచెట్టి స్ట్రీట్, మద్రాసు—1' కి పంపాలి

5 పోటీకి గడువు తేదీ 31—8—67. ఆ తర్వాత మా కార్యాలయం చేరిన కథలని మామూలుగా ప్రచురణకి పరిశీలిస్తాము.

6 పోటీలో బహుమతి పొందిన కథలని 'దీపావళి ప్రత్యేక సంచిక'గా 3—11—1967 తేదీకల ఆంధ్రసచిత్ర వారపత్రికలో ప్రచురిస్తాము.

7. పోటీ తుదినిర్ణయం ఆంధ్రసచిత్రవారపత్రిక సంపాదకుడిదే. ఈ విషయమై ఎటువంటి ఉత్తరప్రత్యుత్తరాలూ జరపడానికి వీలులేదు

8. వ్రాత ప్రతులని ఎటువంటి సందర్భంలోనూ తిప్పి పంపడానికి సాధ్యంకాదు పోటీలో పాల్గొనేవారు తమ రచనలతో తపాలాబిళ్లలు అతికించిన స్వంత చిరునామా కల కవర్లు పంపనవసరం లేదు.

9 పోటీలో బహుమతి పొందక మామూలుగా ప్రచురణకి స్వీకరించిన కథల రచయితలకి ఆ విషయం ప్రచురించే ముందు తెలుపుతాము.

## వర్షించని మేఘాలు

'రాజ్యలక్ష్మి ఎవరు? నీకే మవుతుంది?' దీనికి సమాధానంగా ఒకనాడు 'నా సర్వస్వం' అని సగర్వంగా చెప్పుకొనేవాడు. కాని ఈనాడు? ఈనాడే కాదు ఏనాడూ తనా మెకు ఏమీకాడు. ఆమె అంటే తన మనసులో ఏ భావమున్నా తనంటే ఆమె మనసులో ఉన్నభావం ఏనాడూ ఒకటే. చిన్ననాటినుంచీ ఒకచోట మసలిన కారణంగా ఏర్పడ్డ అభిమానమూ, ఆ చెలిమితో పెరిగిన ఆత్మీయతాభావం అంతే, కాని తెలియని గడియ వరకూ ఆమెపై ఎన్నిఆశలు పెంచుకున్నా ఆ ఆశలు వర్షించని మేఘాలని తెలిసిన వాడూ ద్వేషంలేక, క్రోధంలేక తన కలలు చెరిగినా ఆమెకలలు పండాలని ఎన్నో చేయాలనుకున్నాడు చేసినా ఫలితం దక్కలేదు ఎందుకని? స్వీకరించని స్థితులో ఎంత త్యాగమైనా వ్యర్థమే అన్నది ఇదే నేమో!—ఎన్నోరిక్షాలు వస్తున్నాయి కాని దేనిలోనూ రాజ్యం లేదు మూడు బస్సులు వచ్చివెళ్లాయి దేనిలోనుంచి రాజ్యం దిగలేదు బహుశా అట్నుంచెటైనా వచ్చిందేమో? టైము ఏడవుతోంది ఇంకా రాకుండా ఉంటుందా? ఊహుఁ, లేచాడు. మెల్లగా నడక సాగించాడు, ఆ ఇల్లు చేరాడు లోపలకు వెళ్లాడు

'ఎవరు?' గుడిసెలోంచి ప్రశ్న

'నే నండీ ఇందాకవచ్చానే, రాజ్యలక్ష్మి ఇంకా రాలేదాండీ?' అన్నాడు.

'లేదండీ రాజ్యం ఇంకారాలేదు రోజూ ఈవేళకి వచ్చేసేదే ఇవేళెందుకనో ఇంతవరకు ఉండిపోయింది. అలా కూర్చోబాబూ!' అని 'ఇందిరా! ఆ కుర్చీ తీసుకువెళ్లి పైని వేయవే' అన్నది అవ్వ పైకివస్తూ.

'వద్దులెండి పైని వెయిట్ చేస్తాను' అన్నాడు సారథి.

'పర్వాలేదు బాబూ! కూర్చోండి' అన్నది. లోపల్నుంచి ఒక అమ్మాయి కుర్చీ తీసుకువచ్చి పైనవేసింది కూర్చున్నాడు సారథి.

'ఆ అమ్మాయి మీ కేమన్నా అవుతుందా బాబూ!' అడిగింది అవ్వ.

ఏమవుతుంది రాజ్యం తనకు?

'బంధువే అవ్వా' అన్నాడు.

'అబ్బ! ఇన్నాళ్లకు విన్నాను బంధువన్న

మాట' అని నిట్టూర్చి 'ఇంతమందిని చూసాను కాని ఇలాటివారి నెక్కడా చూడ లేదు బాబూ! ఒక బంధువులేదు ఒక ఆత్మీయుడు లేడు కష్టాల్లో నేనన్నదిక్కు లేదు' అన్నది విస్మయంగా చూసాడు సారధి.

'వయసులో ఆలోచన లేక ఏదో చేయడం, దానికీనాడు ఇలా అనుభవించడం ఏమిటో కాలం మారిపోయింది బాబూ! ఎంతసేపూ నేటిసంగతేగాని రేపటిసంగతి ఆలోచించరు ఒకరుచెప్పినా వినరు.' అన్నది అవ్వ. నిట్టూర్పు విడిచాడు సారధి

'హాస్పిటలు కెందుకు వెళ్లింది అవ్వా? ఎవరినన్నా చూడటానికా?' అడిగాడు.

'ఎవర్నో చూడటానికెందుకు వెళ్ళింది? వ్వ్ అతన్నే—'

'జబ్బేమిటి అవ్వా!' వ్యాకులంగా అడిగాడు.

అవ్వ వెంటనే చెప్పలేదు కాస్సేపు మెదల కుండా వూరుకొని తర్వాత మెల్లగా 'క్షయ' అన్నది, ఉలిక్కిపడ్డాడు సారధి.

'అది ఈనాడు వచ్చిందికాదు ఎప్పటి నుంచో వున్నదట బాబూ!'

అని 'రెండేళ్లుగా వాళ్లు మాయింట్లో ఉంటున్నారు అబ్బాయి ఎంతో ఆరోగ్యంగా అందంగా ఉండేవాడు. రెండువందల జీతం. చీకూచింతా లేకుండా కాలక్షేపం చేసేవారు. మరి ఏమయిందో ఏమో తెలీయదు ఎనిమిది నెలల క్రిందట వుద్యోగం వూడిపోయింది. మళ్లీ ఎక్కడా దొరకలేదు చాలా ఇబ్బంది పడ్డారు. తిండీ, నిద్రా విశ్రాంతి లేకపోగా లోపలున్నజబ్బు పైకురికి ముదిరి ముప్పెనయింది ఒకనాటి రాత్రి చాలా ఇదయింది డాక్టర్లను తీసుకువచ్చాం చూసి ఏదో అన్నారు వాళ్లు. ఆ మట్టున హాస్పిటల్లో జాయిన్ చేసాం. ఇదిగో నాలుగు నెలలవుతోంది ఇవాళో రేపో ఆపరేషను చేస్తామంటున్నారట' అన్నది అవ్వ. సారధి హృదయం వికలమయి పోయింది.

అందుకే రాజి వుద్యోగానికి వచ్చింది. అందుకే రాజీవైఖరి అలా మారిపోయింది ఇక్కడగాకుండా హాస్పిటలుకే తను వెళ్లి ఉంటే ఎంత బాగుండేది! కాని రాజీతనతో ఏమీ చెప్పలేదు

'ఇంత జరిగినా ఎవరూ సాయం రాలేదు బాబూ! అంతకంటె దౌర్భాగ్యం ఇంకే ముంటుంది' అన్నది అవ్వ వ్యథతో.

'తెలిసినవారు లేనివారే అయిన వారిజాడే ఒకప్పుడు తెలియకుండా పోతుంది' అన్నది మళ్లీ

'ఏమిటవ్వా!' అన్నాడు సారధి.

'ఏమీలేదు బాబూ! అమ్మాయెప్పుడూ అంటుంటుంది.

'మాబావ ఇక్కడే ఉన్నాడట కాని ఎక్కడో ఏమో తెలియదు. తెలిస్తే నాకిక కష్టాలే ఉండవు కనీసం వాకునికి అతనికి తెలిసినా పరుగునవస్తాడు. నాకష్టాలే తన కష్టాలుగా, నాసుఖమే తనసుఖంగా భావించే ఆత్మీయుడు బంధువూ, స్నేహితుడూ అతనొక్కడే అవ్వా'—అని.' సారధి మనసు ఆర్ద్రమైపోయింది

# వర్షించని మేఘాలు

'రాజీ! నన్ను మర్చిపోయావనే అనుకున్నాను. కాని నువ్వెన్నటికీ మరువవు రాజీ! నన్ను ప్రేమించక అర్థం చేసుకోలేక నువ్వూపాడయి నన్నూ పాడుచేసావని లోకు అనుకుంటే అనుకోనీ, కాని ఇంతకంటె మిన్నగా ప్రేమించే వ్యక్తి ఎవరు? చాలు రాజీ! జీవితంలో ఇక ఆశించేదేం లేదు' రాగోద్వేగంతో మనసు వీగిపోయింది.

*  *  *

సారధితల్లి చిన్నప్పుడే కన్నుమూసింది. పదేళ్లవరకూ పెంచి, అయిదెకరాలపొలాన్నీ చిన్నతోటాకు కొంపనూ మిగిల్చి తండ్రి కాడ కన్నుమూసాడు. మేనమామ జగపతి ఇల్లుచేరాడు సారధి. అత్త కూడ ఎంతో ఆదరంగా చూసేదతన్ని. కాని రాజ్యలక్ష్మికి మాత్రం చిన్నప్పటినుంచీ అతనంటే ఒక విధమైన చిన్నచూపు ఉండేది. ఆదరం లేదు అభిమానం లేదు. అతని ఉనికి అంటేనే అసహ్యపడేది సారధి రూపసికాడు నల్లగా దుబ్బుగా నీగ్రోలా ఉండేవాడు దానికితోడు ఉల్లాసమూ హుషారూలేని మనిషి ఇంట్లో పనులూ, చదువూతప్ప మరోధ్యాస ఉండేది కాదు. నవనాగరిక సంస్కారాలన్నా, అలంకారాలన్నా శ్రద్ధ చూపేవాడుకాడు అందుకే నవనాగరికత నభిలషించే రాజ్యలక్ష్మి అతన్ని అభిమానించలేకపోయింది అసహ్యించుకొనేది కాని ప్రాచీన సంప్రదాయాలపట్ల ఎంతో మక్కువగల జగపతి అల్లుడి అలవాట్లనూ, ఆదర్శాలనూ మెచ్చుకొని అతని భవిష్యత్తును వేరే నిరయించుకొన్నాడు భార్యకూడ అదేదారిలో ఆలోచించింది

రాజ్యలక్ష్మి పి. యు. సి. పాసయింది. సారధి బియ్యే మొదటి తరగతిలో పాసయ్యాడు. వెంటనే సెలక్షనువచ్చి సబురిజిష్ట్రారు అయ్యాడు వివాహ ప్రసక్తి వచ్చింది అప్పుడే అందరి అభిప్రాయాలు వెల్లడి అయినై రాజ్యలక్ష్మి ఖచ్చితంగా చెప్పేసింది. 'ఆపంది నాకు మగడా! ఛీ! ఈ జన్మలో జరిగేది కాదిది. నేను చచ్చినా ఈపెళ్లికి ఒప్పుకోను' అన్నది తల్లి ఏమనలేకపోయింది తండ్రి కాస్త కోపంతో చిందులువేసినా బిడ్డను ఒప్పించలేకపోయాడు.

మాచర్లలో ఉన్న సారధి ఈసంగతి విని అశనిపాతమే చెందాడు. వెంటనే వచ్చాడు. రాజ్యలక్ష్మి మరింత కోపంతో మండిపోయింది

'నిన్ను ప్రాధేయపడి ఒప్పించాలన్న ఉద్దేశంతో నేనురాలేదూ రాజీ! ఎంత నిన్ను ప్రేమించినా పెళ్లిఉద్దేశం నాకెన్నడూ లేదు. నాకు తెలియకుండా అత్తామామ ఈ నిశ్చయానికి వచ్చారు. నిన్ను నొప్పించారు, వాళ్ల తరుపున నిన్ను నే క్షమాపణ వేడుకుంటున్నా రాజీ!' అన్నాడు ఎంతో బాధగా. చీత్కారంచేసింది రాజ్యలక్ష్మి. 'నీలో ఇంత సంస్కారం ఉందని నే నెప్పుడూ అనుకోలేదు బావా! చాల సంతోషం' అన్నది వ్యధావమానాలతో అతని మనసు మరింత కృంగిపోయింది శుష్కహాసంచేసి, 'అర్థం చేసుకున్నా, చేసుకోపోయినా నా సంస్కారమంతే రాజీ! ప్రేమించినంత మాత్రాన దాన్ని పొందాలని ఎక్కడుంది? అలాగైతే అది కేవలం వాంఛే అవుతుంది. ప్రేమఅంటే నా హృదయానికి సంబంధించినది. ఎవరినైనా ఏ పరిధుల్లోనయినా ఎంత ప్రగాఢంగానయినా ప్రేమించే హక్కు అయితే మనకుండవచ్చు కాని అవతలి హృదయాన్ని శాసించి ప్రేమించబడేందుకు మానవుడేం చేయగలడు? నేను నిక్కంతాకారుణ్ని, నువ్వు రూపసివి విద్యావతివి చదువున్నా సంస్కారంలేని మొద్దును నేను అందరాని అందమైన చందమామవు నువ్వు. ఆశతో ఎంత విలవిల్లాడినా ఎలా సాధించగలను? పదిహేను సంవత్సరాలు నీతోమసలీ నిన్నర్థం చేసుకోకుండా ఎలా నిన్ను ఆశించానను కుంటావు రాజీ! ఊహు నాకలాటి దురాశలూ, దురూహలూ ఏమీ లేవు కాని ఒకటి రాజీ! నేను నిన్ను ప్రేమించినంతగా జగతిలో ఎవరూ ఎవర్నీ ప్రేమించి ఉండరు అది మాత్రం నిజం. నువ్వు ఎవరిదానవైనా నీ సుఖాన్నే ఎప్పుడూ కాంక్షిస్తాను రాజీ! నే నర్థించేదల్లా ఇదొక్కటే దీన్ని నిరాకరించకు. మాటకు గాని చేతకు గాని నా సహాయా న్నర్థించడానికి ఎప్పుడూ సంకోచించవద్దు రాజీ!' అని ఎంతో మథనపడుతూ అన్నాడు రాజ్యలక్ష్మి విచలించిపోయింది. అశ్రునయనాలతో రాగభావంతో అతన్నవలోకిస్తూ 'క్షమించు బావా! ఇన్నాళ్లూ నిన్నర్థం చేసుకోలేక అసహ్యించుకున్నాను ఎన్నో సమయాల్లో అవమానించాను కూడ. కాని ఇక ఇప్పుడు నువ్వు

నాకు బావవేకావు ఆప్తమిత్రుడవు కూడా. నీ ముందు నేనెప్పుడూ సంకోచించను. మంచైనా, చెడ్డైనా నీ సహాయాన్ని తప్పకుండా అర్థిస్తాను బావా! నువ్వు సాయపడతావనీ నాకుతెలుసు' అన్నాడు సారథి మాచర్ల వెళ్ళిపోయాడు. నెలరోజుల తర్వాత రాజ్యలక్ష్మినుండి అతనికో ఉత్తరం వచ్చింది. వారి కులంలోనే రామచంద్రరావనే వ్యక్తిని ఆమె ప్రేమించింది, అతనూ ప్రేమించాడు పెళ్ళికిమాత్రం చాలా ఆటంకాలు వచ్చినై.

రామచంద్రరావు వారి సంతులో పెద్దవాడు. అతనితర్వాత ఇద్దరు పెళ్ళికి ఎదిగిన చెల్లెళ్ళూ, చదువుకొన్న ముగ్గురు తమ్ముళ్ళూ, వారి తర్వాత ఇద్దరు ఆడపిల్లలూ ఉన్నారు తండ్రి వృద్ధాప్యం కారణంగా అతని ఆర్జనలేక పెద్దకొడుకు ఆర్జనపైనే కుటుంబపోషణ జరగాల్సినస్థితి వచ్చింది. ఆడపిల్లల పెళ్ళిళ్ళు కావాలి వరుళ్ళను తేవాలంటే బోలెడు కట్నాలు పోయాలి కొడుక్కి పెద్దకట్నంతో పెళ్ళిచేసి, దాంతో కూతుళ్ళనూ వదిలించుకుందామన్న ఆలోచనలో అతనున్నాడు కాని కొడుకు ఆదర్శం వేరు అందుకే పాతికేళ్ళు పైబడ్డా పెళ్ళికాలేదతనికి—

—సంబంధం మంచిదే కూతురికిష్టమూ అయింది కాని పదివేలు కట్నం ఇవ్వాలంటే ఎక్కడనుంచి తెస్తాడు జగపతి? అదీగాక రామచంద్రరావు తండ్రితో అతనికి చిన్న తగువు లున్నాయి. ఆకారణంగా జగపతి ఈ సంబంధాన్ని అంగీకరించలేదు సారథి ఆలోచనలో పడ్డాడు చివరికో నిర్ణయానికి వచ్చి వెంటనే వచ్చాడు. మామయ్యతో సంప్రదించాడు తన పొలం అమ్మేసి ఆడబ్బుతో రాజ్యలక్ష్మికి పెళ్ళి చేద్దామన్నాడు 'చిన్నప్పటి నుంచీ మీవద్ద పెరిగాను మీ డబ్బూ నా డబ్బూ అని భేదం ఏమిటిమామయ్యా!' అన్నాడు

'భేదం ఎప్పుడూలేదు సారథీ! ఉంటే ఈ సంసారం ఎలా గడిచింది? వాసంపాదనతోనే ఇవన్నీ జరిగాయి! అదికాదు కట్నం ఇచ్చిమాత్రం రాజీ పెళ్ళిచేయను ఇతనే కాదు, నా శత్రువైనాసరే కట్నం తీసుకోనంటే నా కభ్యంతరంలేదు' అన్నాడు జగపతి. ఒప్పించాలని ఎంతగానో ప్రయత్నించాడు సారథి ఫలితం లేకపోగా రామచంద్రరావును కలుసుకున్నాడు. అక్కడచూసినా పరిస్థితుల

వేలా ఉన్నాయి. ఇక ఏంచేయాలి? 'మీరే మనుకోకపోతే ఒకమాట చెబుతా రామం గారూ!' అన్నాడు సారధి

రామచంద్రరావు స్థిరంగా తలూపి 'చెప్పండి' అన్నాడు. సిగరెట్ వెలిగించాడు సారధి, 'రాజీ నా ప్రాణం. ఆమె కోసం నేనే దన్నా చేయాలనుకుంటాను చేయగలిగింది చేస్తానుకూడ కట్నం ఇవ్వడానికి మీ మామయ్య వప్పుకోడంలేదు. తీసుకోడం మీకూ ఇష్టంలేదు కాని పరిస్థితుల్నిబట్టి కట్నం తీసుకోందే మీకు పెళ్ళిచేయడానికి మీ నాన్నగారు అంగీకరించడం లేదు. ఇటు రాజీని వదులుకోలేక అటు మీ నాన్నగారిని వప్పించలేక మీరు సతమత మవుతున్నారు ఇక ఇప్పుడొకటే మార్గం. మీరుకోరిన కట్నం డబ్బు నే నిస్తాను కాని పుచ్చు కొన్నట్టుగా మీరు చెప్పకూడదు ఈ రహస్యం మీరు, మీనాన్నగారూ, నాలోమాత్రమే ఉండిపోవాలి' అన్నాడు. రామచంద్రరావు దెబ్బతిన్నట్టుగా బాధ పడ్డాడు.

'క్షమించండి మీ నిర్ణయాన్ని నే నంగీకరించలేను పరోక్షంగా తీసుకున్నా, ప్రత్యక్షంగా తీసుకున్నా తీసుకోడమే. అది నా ఆత్మ విశ్వాసానికే గొడ్డలిపెట్టు ఆదర్శాలకే దెబ్బ నా ఆదర్శం కన్నా ప్రేమ గొప్పకాదు నాదృష్టిలో' అనేశాడు విస్కర్షగా తెల్లబోయాడు సారధి. రామచంద్రరావునిక వప్పించడం సాధ్యంకాదేమో అని భయపడ్డాడు. కాని రాజీ కన్నీరు అతను వప్పుకునేలా చేసింది వెంటనే తన భూములున్న గ్రామంవెళ్ళాడు సారధి. పొలాలన్నీ అమ్మేసాడు డబ్బుతెచ్చి రామచంద్రరావు కందించాడు.

# వర్షించని మేఘాలు

వివాహం నిశ్చయమయింది ముహూర్తం నిర్ణయించారు మాచర్లవెళ్ళిపోయాడుసారధి. ఇక్కడ అన్ని ఏర్పాట్లూ జరుగుతున్నాయి సారధి అట్నుంచటు హైదరాబాద్ వెళ్ళి వధువుకు చీరలూ, వరునికి కానుకలూ కొన్నాడు ఎంతో సంబరంతో వైజాగ్ వచ్చాడు పరిస్థితులు తారుమారయి ఏర్పడ్డ విషమ ఘట్టం అతన్ని నిలువునా కూల్చేసింది

పెళ్ళి ఇక రెండురోజు లుండనగా రాజ్యలక్ష్మి రామచంద్రరావూ ఎటో వెళ్ళిపోయారు ఈ అవమానం భరించలేక జగపతి ఆత్మహత్య గావించుకున్నాడు రామచంద్రరావు తండ్రిని కలుసుకున్నాడు సారధి అక్కడా ఏమీ తెలియదు అంతా అయోమయంగా ఉంది తనిచ్చినడబ్బు అతని కందలేదు, అసలిచ్చినట్టే తెలియదు. మరి ఆ డబ్బు ఏమయినట్టు? ఎందుకిలా జరిగింది? అత్తను తీసుకొని మాచర్ల వెళ్ళిపోయాడు సారధి తనపేరనక్కడకు వచ్చిఉన్న బాంకు డ్రాఫ్టు అతన్ని వెక్కిరించింది. ఎంతపనిచేసాడు రామం! వప్పు కున్నట్టే వప్పుకొని ఎందుకిలా చేసాడు? ఇక ఏ మాత్రం చించినా ప్రయోజనంలేదు ఎవర్నన్నా ఫలితంలేదు వాళ్ళకై ఎంతగానో అన్వేషించాడు కాని గత అయిదేళ్ళుగా వాళ్ళ జాడ తెలుసుకోలేక పోయాడు...

*　　*　　*

ఇంట్లోంచి పైకి వచ్చింది అవ్వ 'ఏం బాబూ! ఇంకారాలేదు కదూ! టైమెంత యిందేమిటి?' అన్నది.

'ఎనిమిది' అన్నాడు సారధి వాచ్‌చూసి. ఎవరిదో చెప్పుల చప్పుడు సందులో అయింది. అటుచూసాడు సారధి.

'అదిగో వస్తుంది' అన్నది అవ్వ. వచ్చిన రాజ్యలక్ష్మి చీకట్లో కూర్చున్న సారధిని చూడలేదు తన వాటా వేపు వెడుతూ 'ఏమిటవ్వా?' అన్నది

'ఏం లేదమ్మా, ఇవేళింత ఆలస్య మయిందేం' అన్నది అవ్వ 'బస్సులు దొరకలేదవ్వా! అదీగాక హాస్పిటల్లో కూడ ఆలస్య మయిందిలే' అన్నది రాజ్యలక్ష్మి

'అతనికెలా ఉందమ్మా!'

'అలాగే ఉందవ్వా!' అని నిట్టూర్చి, 'ఈ వారాంతంలో గాని ఆపరేషను చేయరట' అన్నది తలుపు తాళంతీస్తూ.

'నీ కోసం ఎవరో వచ్చారమ్మా! పాపం ఆరింటినుండీ కాసుక్కూర్చున్నారు' అన్నది అవ్వ.

తలుపు తీసి లోపల కడుగుపెడుతున్నదల్లా ఆగి చూసింది రాజ్యలక్ష్మి

'నేను రాజీ! సారధిని' అని ముందుకు నడిచాడు సారధి

'నువ్వా బావా! నీ సంగతే మర్చిపోయాను బావా!' అని 'లోపలకు రా' అన్నది లోనికి వెడుతూ సారధి లోపలకు వెళ్ళాడు.

కుర్చీదులిపి 'కూర్చోబావా!' అన్నది.

నిట్టూర్చి కుర్చీలో చతికిలబడ్డాడు సారధి. ఇంటితీరూ, సామానూ గమనించసాగాడు.

'ఇల్లు చూస్తున్నావా బావా!' అని శుష్క హాసంచేసి 'పేదవారిల్లు' అన్నది.

సారధి తలెత్తి చురుగ్గా చూసాడు 'కాని ఈ పేదరికం ఎలా వచ్చింది రాజీ!' అందామనుకున్నాడు. కాని నోటమాట రాక మిన్నకుండిపోయాడు.

'అతనికెలా ఉంది రాజీ! మరేం భయం లేదు కదా' అనడిగాడు కాస్సేపనంతరం. రాజ్యలక్ష్మి ముఖం వివర్ణమయిపోయింది. కళ్ళంట గిర్రున అశ్రువులు తిరిగినై.

'భయంలేదు బావా!' అన్నది మెల్లగా.

'మీ సంగతులన్నీ అవ్వ చెప్పింది రాజీ! మమ్మల్ని విస్మరించడానికీ మేమంటే ఇంత కోపానికీ కారణం నా కర్థంగావడంలేదు రాజీ!' అని రాజ్యలక్ష్మి ముఖంలోకి చూశాడు. ఆమె తత్తరపడి 'నిజం బావా! నీ ఉనికి



నాకు నిజంగానే తెలియదు. తెలిస్తే నీముందు కూడ నేను దాచేదానినా!' అన్నది మెల్లగా.

'నా ఉనికి తెలియకపోవచ్చు. కాని వీగా మామగారింకా అక్కడ అలాగే ఉన్నారు. వారికైనా—' అనేంతలో

'వారిష్టపడలేదు బావా!' అన్నది సారధి ఇక ఏం మాట్లాడలేదు. మెదల కుండా వూరుకున్నాడు గడపలో చతికిల బడింది రాజ్యలక్ష్మి.

'అన్న మూలంగా మాగాధ విన్నావు కదా బావా! వారికి ఉద్యోగం పోయినదగ్గర్నుంచీ ఎంతో కష్టంగా ఉంది.

'నేను ఉద్యోగానికై ఎంత ప్రయత్నించినా దొరకడంలేదు బావా! నేను తలచుకుంటే సాధించలేనిది ఏదీ ఉండదనుకొనేదాన్ని ఇన్నాళ్ళు. కాని చేజాచినా ఏదీ అందడం లేదు. వారు చూస్తే అలా ఉన్నారు. ఇల్లు చూస్తే ఇలా ఉంది భవిష్య త్తేమిటో అగమ్యగోచరంగా ఉంది బావా!' అన్నది వ్యాకుల స్వరంతో. సారధి మాట్లాడలేదు మౌనంగా ఆమె చెప్పింది విన సాగాడు కాస్సేపు పోయాక కుర్చీలోంచి లేచి 'ఇక నే వెళతాను రాజీ! రేపు వాలుగింటికి వస్తాను ఆస్పత్రికి వెడదాం' అన్నాడు

'అలాగే బావా!'

'ఇవాళలా మర్చిపోయి వెళ్ళిపోకు రాజీ!'

'ఉహుం నీకోసంవేచి ఉంటాను బావా!'

'అలాగే' కదిలిపోయాడు.

'బావా!' పిలిచింది రాజ్యలక్ష్మి

ఆగి వెనక్కిచూశాడు

'ఇవేళ ఇంటర్వ్యూ ఏమవుతుంది బావా!' లనడిగింది సారధి మాట్లాడలేదు,

'నువ్వు దయచూపి ఆ ఉద్యోగమే ఇస్తే నాకెంతో మేలు జరుగుతుంది బావా! ఇక నిన్నెప్పుడూ ఏదీకోరను' అన్నది అతి దైన్య స్వరంతో.

సారధి తలపంకించాడు 'క్షమించు రాజీ! ఇక ఏ విషయంలోనూ నేను నీకు సాయం చేయలేను ఇంతవరకు ఏంచేసినా అది దుష్ఫలి తాన్నే ఇచ్చింది. ఇంకా చేసి నీజీవితాన్నింకా విషమయం గావించలేను రాజీ! దూరంగా ఉంటేనే నువ్వు సుఖంగా ఉంటావని తోస్తోంది. నన్ను క్షమించు' అని చరచర వెళ్ళిపోయాడు. షాకుతిన్నట్టుగా అయింది రాజ్యలక్ష్మి అతన్ని దూరంచేసిన ఆవీకటోక్కి పిచ్చిగా చూస్తూ ఉండిపోయింది. ●

# పెళ్ళిబొమ్మలు



సీరియల్

**తాడిగిరి పోతరాజు**

### జ రి గి న క థ

వెంకట్రామయ్యగారు ఓ హైస్కూలు సంస్థాపకులు ఆయన కుమారుడు మధు వారింట్లో పెరిగిన అనాధ ప్రసాద్. ఆ స్కూల్లో పనిచేసే హెడ్మాష్టరు కామయ్య ఆయనకు ఆప్తమిత్రులు. మధు, కామయ్యమాస్టారి కూతురు శారదను ప్రేమిస్తాడు. శారద అంగీకరించదు. ప్రసాద్‌మీద శారదకు ఎంతో అభిమానం. కాని, ప్రసాద్ ఆమెని గుర్తించడు. మధు చాలా మారిపోయాడు మధులోని మార్పుని గ్రహించిన శారదకి అతని మీద ధ్యాస అధికమవుతుంది గ్రామంలో పంచాయతీ ప్రెసిడెంటు ఎన్నికకోసం చర్చజరుగుతుంది. ప్రత్యర్థి వర్గంలోని కామయ్యమాష్టారి మీద శివరామయ్య నిందలమోపి, స్కూల్లోనుంచి తొలగిస్తాడు ఆయన పాత ఉత్తరాలు తిరగేస్తూండగా వెంకట్రామయ్య రాసిన ఉత్తరం కనిపించింది

## 20

ఆ రెండవరోజు క్షమాపణ వేడుకొన్నాను.

రెండు కన్నీటిబొట్లతో ఒక పేలవమైన చిరునవ్వుతో ఆమె సమాధానం చెప్పింది 'అది నీ తప్పు కాదు......ఇంత అందంగా పుట్టడం నా తప్ప'ని. మాటలు తడబడ్డాయి.

'కానీ...ఈ తప్పుకు ఘోరమైన శిక్ష దేవుడు ప్రసాదిస్తే......అప్పుడు'......అని వాడిపోయిన కళ్లతో చూసింది'

చదువుతూన్న మాష్టారిలో ఆందోళన కనిపించింది. కిటికీకి మరింత దగ్గరగా జరిగాడు అక్షరాలను పోల్చుకొంటూ—చూపు ఆనలేదు తలెత్తి చూశాడు. బయట చీకట్లు దట్టంగా అలుక్కొన్నాయ్ 'అమ్మా—భానూ—దీపం వెలిగిస్తావా,' కేకపెట్టాడు మళ్లీ కుర్చీలో కూర్చుని—ఓ నిముషానికి హరికేన్ దీపం వెలిగించి తెచ్చాడు ప్రసాద్...

'భానూ—ఏం చేస్తుందీ ?'... కటువుగా పలికాడు.

'వంట చేస్తుంది సార్' .

'అ ...మరి శారద ఏం చేస్తున్నట్లు' ...ఆశ్చర్యంగా అన్నాడు.

'తలనొప్పిగా ఉందని పడుకొంది...'

'ఫస్ట్‌క్లాసు రాలేదని బాధ పడవద్దని చెప్పు పోతే పోయింది...అలా అనుకొంటే నీవేమనుకోవాలి . అంత కష్టపడి చదివి . సరే వెళ్లి చదువుకో—ఇప్పటినుంచే చదువు మళ్లీ మొదలుపెట్టు'. అంటూ మడత కుర్చీ చెక్కపై ఉత్తరం పరుచుకొని చదువుకోసాగాడు.

'తీక్షణమైన ఆ చూపు నా హృదంతరాళంలోకి చొచ్చుకుపోయింది అది నా క్షణికోద్రేకం కాదనీ ఎన్నో సంవత్సరాల తరబడిగా నా హృదయాన్ని ఒరుసుకొని పారుతూన్న ప్రేమవాహినని చెప్పి ఊరడించాను. తను నన్ను మరో మాట పల్లెత్తి అడగకపోయినా, ఏవేవో తియ్యని మాటలు చెప్పాను. చేతిలో చెయ్యివేసి అభయమిచ్చాను

అన్నిటికీ ప్రత్యుత్తరంగా ఒక పెద్ద నిట్టూర్పు విడిచి అక్కడనుండి వెళ్లిపోయింది.

ఆ రెండవ వారం మార్కెట్టులో నీలిమందుకు ధరలు పూర్తిగా పడిపోయ్యాయి. అంతకు ముందు రెండు నెలలనుండి ధరలు తగ్గుముఖం పట్టినా—ధరలు మళ్లీ లేస్తాయనే ధైర్యంతో మా నాన్న సరుకు కొనుగోలు చేశాడు అక్కడ డబ్బుకోసం మా నాన్నను రైతులు వేధించసాగారు ఏ విషయమూ పాలుపోక నన్ను ఇంటికి రమ్మని ఉత్తరం వ్రాశారు మా నాన్న

నేను బయలుదేరుతూన్న రోజు తనను పిలిచి అత్యవసరంగా వెళ్లవలసి వచ్చిందని చెప్పాను. అప్పుడు ఆమె నన్ను కౌగలించుకొని ఏడ్చి నాతో వెంట వస్తానని పట్టుదల చాలా పెడుతుందని ఇంకా ఏమేమో ఊహించుకొని భయపడి పొయ్యాను. కానీ ఆమె శూన్య దృక్కులతో నాకేసి చూస్తూ 'అలాగా' అని మాత్రం అనకల్గింది.

ఇంటికి వెళ్లాక పరిస్థితులు మరింత అధ్వాన్నంగా తయారయ్యాయి నా పరోక్షంలో, నా అంగీకారం లేకుండ నా జీవితానికి సంబంధించిన ముఖ్య నిర్ణయాలు మా నాన్న చేశాడు ఇంటి చుట్టూ రైతులూ—అప్పులవాళ్లూ తిరగటంతో తీవ్ర అభిమానంతో కుమిలిపోయి తల కొక ఎకరమూ అర ఎకరమూ, బాకీల క్రింద వ్రాసిచ్చాడు. ఉన్న ఆస్తిని విక్రయించి నన్ను నడిబజారులో బికారిగా నిలబెట్టటం ఇష్టంలేక ఆయన నా పెళ్లి నిశ్చయించాడు.

నేను ఆ రోజుల్లో ఇంటర్మీడియట్ తప్పిన విద్యావేత్తను. అప్పటిలో మాకులంలో చదువు సంజలున్న వాళ్లు బహు అరుదు. నన్ను 'మెట్రిక్' ప్యాసయిన సర్వగుణాభిరాముడైన అల్లుడుగా భావించారు సోమేశ్వరరావుగారు మా నాన్న చెల్లించవలసిన అప్పుల మొత్తానికి రెండు రెట్లు కట్నం రూపేణా ఇవ్వటానికి సిద్ధపడ్డారు. నా సమ్మతి లేకుండానే ఆయన పెళ్లి నిర్ణయం చేశాడు. అదంతా నా శ్రేయస్సును కోరే ఇలా చేశానని ఆయన చెబుతూంటే ఉదాసీనంగా వింటూ ఉండిపొయ్యాను. నా మనోగతాభిప్రాయాలు ఆయనకు ఒకటీ చెప్పలేదు—అది నా బలహీనత కూడా కాదు.

ఈ పెళ్లికి నేనెలా ఒప్పుకొన్నానా! అని మీరు అభిప్రాయపడవచ్చు.

'విధి చేతుల్లో కీలుబొమ్మ'నని తల పట్టుకొని కూర్చోలేదు.

నేను 'కాద'ంటే—బలవంతం చేసే వ్యక్తి

కూడా కాదు పూనొన్న.

నమ్మిన దానికి నేను చేస్తున్న అప కారం కూడ నన్నంతగా బాధించలేదు ఎందుకంటే ఆమె నన్ను నమ్మి మోసపోలేదు నమ్మించటానికి ప్రయత్నించినప్పుడు కూడ ఆమెకు నా పట్ల విశ్వాసం కలుగలేదు నాపై ఏలాటి ఆశలూ నిలుపుకోలేదు. నా కోసం తహతహలాడలేదు

కేవలం ఒకనాటి రాత్రి కామేచ్ఛతో కళ్లు మూసుకుపోయిన నాకు బలి పశువులా తన శరీరాన్ని అర్పించింది ఆ దుఃఖమే తనను దహించివేస్తున్నట్లు కనిపించింది కానీ నాతో తన జీవితం ముడిపెట్టుకోవాలనీ నాతో సుఖమయ దాంపత్యజీవితం గడపాలనీ ఆమె కలలు కంటూన్న చిహ్నాలు కూడ ఏవీ కనిపించలేదు.

తనకు ద్రోహం చేశాననే భావంతో క్షమాపణ కోరాను హృదయపూర్వకంగా. ఎన్నో మాటలు చెప్పి ఊరడించటానికి ప్రయత్నించాను. అప్పటికీ ప్రేమపూర్వక మైన ఓ చిన్న చిరునవ్వు కానీ ఓ చిన్న మాటతోగానీ నన్ను పల్కరించలేదు.

కేవలం ఒక దుర్ఘటన కారణంగా నా దయాక్షిణ్యాలపై ఆధారపడి తన జీవితాన్ని గడపటానికి అంగీకరించిన స్త్రీ ఆమెతో బ్రతకటం కన్న యావజ్జీవ నరకం మరొ కటి ఉండదనిపించింది

వయస్సులో కళ్లు పొరలు కప్పుకు పోయిన స్థితిలో యవ్వనమదోన్మాదంలో చాలా మంది యువకులు వేసే తప్పటడుగు నేనూ వేశానని సరిపెట్టుకొన్నాను రోజులు గడిచే కొద్దీ ఆమె మనసును కలచివేసే నా గూర్చిన స్మృతులు—నేను చేసిన అన్యాయం మాసిపోతాయని — ఆపైన మామూలుగనే ఏ అదృష్టవంతుడి వెంటనో భార్యగా వెళ్లి పోతుందనుకొన్నాను.

నా పెళ్లిని గూర్చిన సన్నాహాలు జోరుగా జరిగి పోసాగాయి నా పెళ్లి విషయమై అనుకూలతా లేదు—ప్రతికూలతాలేదు — ఎప్పుడో ఒకసారి జీవితంలో ఈ తంతు జరుగుతుంది — ఇవ్వాళ కాకపోతే రేపు ... ఇది కొద్దిగా మనమనుకొన్న దాని కంటే ముందుగా జరుగుతోంది ... అంతే ... కానిమ్మనిపించింది మనస్సుకు.

వివాహం జరిగిపోయింది—వివాహం పట్ల ఒక నిశ్చితమైన అభిప్రాయానికి నేను రాక పూర్వమే.'

'పంతులుగారూ ... పంతులుగారూ ... ఇందాకటి నుంచి పిలుస్తుంటే పలకరేం దండీ' .. అంటూ కోటయ్య లోనికొచ్చాడు.

'వస్తున్నా—వస్తున్నా... కూర్చో' అంటూ తల పైకెత్తకుండనే ఏకాగ్రతతో ఉత్తరం చదవసాగాడు. కోటయ్య వారి చెంతనే స్టూలు లాక్కుని కూర్చున్నాడు.

'నెలరోజులు తిరిగి పొయ్యాయి. ఆ నెల రోజుల్లోనూ గొప్పవాళ్ల 'మనస్తత్వం— డబ్బుపట్ల వాళ్లకుండే అవ్యాజమైన ప్రేమ అన్నీ తెలిసికోగలిగాను వ్యక్తిత్వాన్ని పూర్తిగా మరచిపోయి మా మామగారు గీసిన పరిధు ల్లోనే తిరగవలసి వచ్చేది. ప్రతి చిన్న విషయంలోనూ ఆయన సలహా సంప్రతింపులు లేకుండ స్వతంత్రించి చేయకూడదు, అని శ్చితమైన అభిప్రాయాలతో నాకై నేను కల్పించుకొన్న ఆ పరిస్థితులను ప్రతిఘటించే విధానాలను ఆలోచిస్తూ ఈ మేడలో ఏకాంతంగా పడిఉండేవాణ్ని—వెల్లకి లా పడుకొని తీవ్రంగా ఆలోచిస్తూండేవాణ్ని

ఒకరోజున నాకోసం ఎవరో ఆడమనిషి వచ్చిందని జీతగాడు వార్త మోసుకొచ్చాడు. కిటికీలోనుండి గేటుకేసి చూశాను. చువ్వల వెనకరోడ్డుపై నాకోసం నిరీక్షిస్తోంది ఆమె—

'సర్వాజ్య లక్ష్మి'

ఆలోచనలవలన కాబోలు—మనిషి కృంగి పోయి ముఖం వాడిపోయింది. అనాలోచితంగా లేచినిలబడ్డాను కొద్దిసేపటికి శరీరాన్ని అదుపులోకి తీసికొన్నాను లోనికి తీసికొచ్చి —వచ్చిన విషయమేమిటో తెలిసికొని — నాల్గు తియ్యనిమాటలు చెప్పి మళ్లీ నేను మద్రాసువచ్చి కలిసికొంటానని చెప్పిపంపి



వేద్దామనుకొన్నాను.

లేచి వాకిలిదగ్గర కొచ్చాను.

గొడ్లచావిడిలో జీతగాళ్లను తిట్టి పోస్తూన్న గృహయజమాని కనిపించాడు గ్రరున వెనుతిరిగి 'ఆమెఎవరో నాకు తెలియదు—పొమ్మని'— జీతగాడితో తెలిగ్గా చెప్పాను.

నేను వాడు వెళ్లాక కిటికీ చువ్వలు పట్టుకొని నిలబడ్డాను—చూస్తూ—

మారు మాట్లాడకుండ ఆమె వెళ్లి పోయింది—కాళ్లీడ్చుకొంటూ ఆమె మద్రాను వెళ్లిపోలేదు—మన ఊళ్లోనే మన మధ్యనే సంచరించింది '

మాష్టారి ముఖం ఉత్తరానికి దగ్గిరగా వంగబడిపోయింది దీపంవత్తి బాగా పెద్దది చేశాడు పొగరాజు కొనేలా, కుతూహలంతో ఇంకొకపేజీ తిప్పాడు.

'ఆమెకు భయపడి నేను ఈ మేడదాటి బయటికిరాలేదు నాలో ఇంత కుళ్లుపేరు కొని ఉందనుకొంటే మీరు నన్నింతగా గౌరవించరు — గౌరవించమని నేను కోరు కోవటంలేదు మీగౌరవానికి నేను అనర్హుడనని మాత్రమే చెబుతున్నాను. పైకి స్వచ్ఛంగా కనిపించే నీటికి అడుగున బురద పేరుకొని ఉంటుంది మాష్టారూ! కాలుబయటపెట్టని తను మనఊళ్లో దిక్కులేనిదానిలా సత్రంలో పడి ఉండి పిచ్చిదైపోయి, ఎవరైనా దయబట్టి ఇంతపెడితే తిని ఆ అరుగుల మీద కటికనేలపైబడి నిద్రపొయ్యేది...'

పెనుబండకు ముందు పెట్టి పేల్చినప్పుడు ఠక్కున పగిలి ఎగిరిపోయిన రాతిముక్కల్లా ఎన్నెన్నో దృశ్యాలు— ఏవో స్మృతులు మస్తిష్కంనుండి దూసుకు పోసాగాయి

ఎదురుబొమ్మపై బలంగా గుద్దినట్లు— వెనక్కు తూలాడు.

'పాడు ఉత్తరాలు చదవకండి — పంతులు గారు...అసలేవిూ మనసు బాగుండటంలేదు' ...మాష్టారి ముఖంలో పడిన ముడతలను పోల్చుకొని కోటయ్య అన్నాడు.

'నా విషయంకాదు కోటయ్యా.. ఆ పిచ్చి మనిషి'. .మాష్టారు కళ్లద్దాలు తీసికొంటూ అన్నాడు.

'ఏ పిచ్చి మనిషీ ... పెపోదు _ తల్లిని గూర్చేనా మీ రనేది'...

'ఔను' దీర్ఘంగా నిట్టూరుస్తూ అన్నాడు.

'పాపం ఎంతో గౌరవ మర్యాదలున్న కులీన వంశంలోనుండి వచ్చింది ... కానీ'...

'ఇదేందండీ—ఆ మాట మీరు వేరే చెప్పాలా? ఆమె ముఖం చూత్తేనే గొప్పింటి పిల్లని తేలిపోతది.. అది సరే ... ఇప్పుడా మనిషి గుర్తుకొందు కొచ్చిందండీ . ... ఇరవై ఏళ్ల తరువాత అప్పు డెప్పుడో గాలి వానకు ముందు సంగతి . అప్పటికీ —ఇప్పటికీ మన ఊరు ఎంత మారిపోయిందండీ . ...' మాష్టారు మాటలు పూర్తి చెయ్యక ముందే కోటయ్య అందుకొని అన్నాడు.

ఇద్దరూ చీకటిలోకి చూడసాగారు.

వాళ్లిద్దరూ ఆ శరీరాలను అక్కడ్నే వదిలి దాదాపు రెండు దశాబ్దాలు వెనకకు నడిచి వెళ్లిపొయ్యారు. వాళ్ల కళ్ల ముందు వాళ్ళనే పరిశీలించుకోసాగారు. వారి మధ్యన సంచరించి మట్టిలో కలిసిపోయిన శరీరాలు చివ్వన లేచి ఆ చీకటిలో నర్తించసాగాయి

* * *

ఉన్నట్టుండి ఆ ఊరి వాతావరణంలో ఒక కొత్త సంఘటన జరిగింది ఎవరో పిచ్చి మనిషి ఎక్కడ్నించో ఊడి పడ్డది వయసు దాదాపు ఇరవై సంవత్సరాలు.

ఆమె ఎలా ఎప్పుడు ఆ ఊళ్లో ప్రవేశించిందో ఊహ కందని విషయం

ఆ ఆడమనిషి ఎడతెగని నవ్వు నవ్వుతూ పరుగెత్తుతుండేది—దయ్యం పట్టిన దానిలా వికృతమైన ఆ నవ్వూ ఆ చూపూ—చూసే వాళ్ళకు ఒళ్లు జలదరిస్తుంది. ఆమె నడవటం ఒక అసాధారణ విషయం, ఒకచోటు నుండి మరొక చోటుకు ఎవరో తరిమినట్లు పరుగెత్తేది ఆగిన స్థలంలో ఒక్కతే నవ్వుతూ మాట్లాడుకొనేది

మట్టి కొట్టుకొనిపోయి అంట్లుకట్టిన తల—పాలిపోతూన్న ఆమె శరీరంలో నరాలు స్పష్టంగా కనిపించేవి. పాటి స్త్రీ ఆ విధంగా మతి చెడి తిరగటం చూసి ఊళ్లో ఆడవాళ్లందరూ ఆమె పట్ల జాలి చూపుతూండేవారు. పిలిచి ఒక చోట కూర్చోబెట్టి అన్నం పెట్టేవాళ్లు. చిరిగిన పాత చీరెలు ఆమెకు కట్టబెట్టేవాళ్ళు. కానీ రెండు రోజులకే అవి తునాతునకలై ఆమె శరీరంపై జీరాడుతూండేవి.

మధ్యాహ్నంవేళ ఆమె చెరువు కట్టపైనున్న మర్రి చెట్టు నీడలో కూర్చునేది మలినమైన ఆమె ముఖాకృతి స్పష్టంగా కనిపించేది. సన్నని పొడుగాటి ముక్కు వాడిన అందమైన కళ్లు—పరీక్షగా చూస్తే ఆమెలో ఒకనాటి సౌందర్యపు ఛాయలు గోచరిస్తాయి. ఏ భంగిమలో కూర్చున్నప్పటికీ శరీరంలో చక్కని అనురూపత కనిపించేది.

ఆ పిచ్చిమనిషి ఊళ్లో అందరికీ సుపరిచిత పిల్లలు ఇంట్లో మారాంచేస్తే తల్లులు 'ఏడవకు— ఏడిస్తే ఆ పిచ్చిదాన్ని పిలుస్తా —పట్టుకెళ్లి పోతుందనేవాళ్లు పిచ్చిదాని పేరుచెబితే కిక్కురు మనకుండ నోరుమూసికొనేవాళ్లు పిల్లలు.

ఒక్కొక్కనాడు వాళ్లకు పనీపాటా లేనప్పుడు ఉబుసుపోక ఆమె పడుకొనే సత్రం వద్దకెళ్లే వాళ్లు — 'అన్నం తిన్నావా?' అని చెయ్యి నోటివద్ద పెట్టుకొంటూ సైగచేసి అడిగేవాళ్లు దానికి సమాధానంగా ఆమె పిచ్చి నవ్వు నవ్వేది. టక్కున నవ్వు ఆపేసి కళ్లు తిప్పుకొంటూ 'వారు రేపు వస్తారు— నేను వెళ్లిపోతా . నన్ను తీసికెళ్లి పోతారు . ఇంకా తెల్లవారలేదా?'.. కళ్ళు కుంచించుకు పొయ్యేవి. ముఖం బుసబుస పొంగిపోయి గొల్లున ఏడ్చేది— చిరిగిన చీరలో ముఖం దాచుకొని.

ఈ విధంగా చోద్యం చూస్తూ నవ్వుకొంటూ కాలక్షేపం చేసి ఎవరిళ్లకు వాళ్లు పొయ్యేవారు— ఆ సత్రం అరుగుల మీద ఆమెను వదిలేసి

పెద్దపెద్ద చాకలి మూటలను నెత్తిన వేసికొని చాకిరేవుకు పొయ్యే చాకలి వాళ్లకు ఆ సత్రం ఒక మజిలీ — పదిగంటల వేళ చాకళ్లు అక్కడ ఒక్కింతసేపు విశ్రాంతి తీసికొని అన్నం బుట్టలు మూటలపైన సర్దుకొని వెళ్లేవాళ్లు.

వాళ్లను పిలిచి ఆమె నవ్వుతూ 'చాకలీ—రేపు— మా ఇంట్లో బారసాల — ఉదయం పెందలాడే రావాలే. ఏలాంటి చీరె కావాలి నీకు'—అని మళ్లీ పెద్దగా నవ్వేది. వాళ్లను చెరువు వద్దకు సాగనంపి వచ్చేది. ఒక్కొక్కసారి వాళ్ల వద్దనే తిని చెరువు కట్టపైన తిరిగేది

ఆమె చేతుల్లో ఎప్పుడూ ఒక గుడ్డ బొమ్మ ఉండేది. దాన్ని కౌగలించుకొని ఆనందోద్వేగంలో పైకి ఎగురవేసేది. లాలిపాడి చిచ్చికొట్టి నిద్రబుచ్చేది అంతలోనే ఆ బొమ్మను గుండెలకు హత్తుకొని భోరున ఏడ్చి రోద్దున పరుగెత్తేది. పసికందులున్న బాలింత స్త్రీలు ఆమెను చూడనే ఇంట్లోకి వెళ్లి గడియపెట్టుకొనే వాళ్లు— ఆ విపరీతమైన చేష్టలు చూసి.

క్రమేపి ఆమె శరీరంలో కనిపించిన

మార్పులు అందరినీ కలవరపరిచాయి. గర్భిణీ స్త్రీలా ఆమె ఒళ్ళు చేసింది కాళ్ళూ— చేతుల్లో నీరు చూపింది ఉదరభాగం ముందుకు ప్రకోపించింది.

ఇదివరకులా ఆమె అరుస్తూ వరుగెత్తటం— నవ్వటం —చాల వరకూ తగ్గిపోయాయి. ఆమె శరీరంలో పొడసూపిన మార్పులను గూర్చిన వార్త ఊరంతా పాక్కిపోయింది

ఊరు ఊరంతా దేవుడి దర్శనానికి తరలినట్లు తరలి వచ్చారు ఈ వింత చూడటానికి. అందరూ ముక్కుమీద వేలేసుకొన్నారు.

'వెమ్మంగారు — కాలజ్ఞానంలో చెప్ప లేదూ!...కలికాలం—నాశనానికే ఈ విపరీతాలు'...ఒక వేదాంతి అన్నాడు.

'ఎంత ఇసిత్రం' ... ఆడవాళ్ళు బుగ్గలు నొక్కుకొన్నారు.

'ఈడి జిమ్మడ—ఎదవ నచ్చినోడు.. ఈడి శిరుసు వగల'...ఒక వయసుమళ్ళిన ముత్తయిదు మెటికలు విరిచింది.

'ఛా...ఛా...ఈ మనిషికి పాల్పడేవాడు . వాడెలాంటి వాడ్రా . కుక్కలకన్న అన్యాయమయిపోయింది గదరా మన బతుకులు' ఆవేశంలో రెచ్చిపోయి కేకలేశాడు— గుంపులో నుండి తప్పుకొంటూ.

'వాడు మడిసి జల్మ ఎత్తాడాని— అసలు.... అహ' అంటూ అంతటితో ఆగకుండ, హుటాహుటీ పంతులుగారి దగ్గర కెళ్ళాడు. వారు అప్పుడే స్కూలు కెళ్ళటానికి సిద్ధపడసాగారు— లాల్చీ బొత్తాములు పెట్టుకొంటూండగా. 'చూశారా పంతులుగారూ' — అని వీధిలోనుండే అరచుకొంటూ గడపలో అడుగుపెట్టాడు.

'ఏం...కోటయ్యా!.. కోపంగా ఉన్నావ్.'

'కోపంగాదండీ...మీతో ఒక మనవి చేసికొందామని..'

'అసలు విషయమేమిటో చెప్పు'

'విశయమేముందండీ ... పాపమా పిచ్చి మనిసి ఏఊరో...ఏందో .. అదేనండీ మన సత్రంలో ఉంది చూడండీ ... ఏ అమ్మ కన్న దయ బుట్టి ఇంత పెడితే తిని అడ పడి ఉంటుంది...అయితే ..అవ్వ . ఎట్టా సెప్పాలో నోరు రావటంలేదండీ'...కళ్ళవెంట నీరుతిరిగి పై పంచలో కళ్ళు ఒత్తుకొన్నాడు.

'పిచ్చి మనిషిని ఎవరైనా కొట్టారా?' ఆతురతగా అడిగాడు మాష్టారు.

'ఆమెను కొట్టటానికి సేతు లెట్టా వస్తాయి లెండి ఎవ్వరికైనా...ఎవడో ఎదవనాకొడుకు...ఆ పిల్లకు అన్యాయం చేశాడండీ' ...ఆ చివరమాట బాధగా తల వంచుకొని అన్నాడు.

'ఏమిటి?'

'అందుకనే నండీ.. మీదగ్గర కొచ్చా...... దిక్కులేనిదాన్ని మనం అట్టా వదిలేస్తే— రేపు ఆ మనిసి కేమవ్వా అయిందంటే ఆ పాపం మనకు సుట్టుకొంటది .. మీరు ఎట్టా చెబితే అట్టా సేద్దాం..'

ఉత్తరీయం భుజాన వేసికొని గడప దిగాడు మాష్టారు ఆ దృశ్యం చూసి ఆయన కళ్ళు చెమర్చాయి. కోటయ్య ఇతర పరివారమంతా ఆయన పెదవులపై దృష్టి నిలిపారు

'ఇప్పుడా మనిషికి మన స్థిమితం లేదు కాబట్టి ఒకరింటివద్ద పెట్టి పోషించటం అసంభవం కాబట్టి ఇక్కడ్నే ఒక తడిక అల్లించి అడ్డం కట్టించేద్దాం పోతే ఒక పాత మంచం లోపల వేయించి ఆమెకు వేళకింత అన్నం పెట్టి కనిపెట్టి ఉండటానికి ఎవరైనా ఒక మనిషి కావాలి... ఏం చేద్దాం,' కళ్ళలో ఆలోచనలు కమ్ముకొన్నాయి.

' ఆ చాకలి రాగవమ్మ ఉంది సూడండీ ఈ పిచ్చి మడిసిని వత్తా పోతా పలకరిత్తది అప్పుడప్పుడు బువ్వకూడ పెట్టుద్ది .. దానికి నెలకు రెండు రూపాయలిత్తే అన్నీ సూత్తది.. ఏమంటారు ?'...కోటయ్య సమస్యా మార్గం చూపెట్టాడు.

'తల కోక, బేడ - పావలా వడ్డా పర్వా లేదని' తల ఊపారు.

'మరి ఒకవేళ ఆమె నీలాడితే' ..

'అదంతా ఇంకా రెండు మూడు నెలల సంగతి కదా ?...అప్పుడు చూద్దాంలే ఆ సంగతి' అంటూ స్కూలు వైపు నడిచాడు మాష్టారు అటు—వాళ్ళవద్ద సెలవు తీసికొని...

'సరే లెండి ... నేను చాకలిదానికి సెప్పొత్తా,' అంటూ కోటయ్య ఇటు పొయ్యాడు

మాష్టారు ఆ పిచ్చి మనిషి శ్రేయస్సును గూర్చి బాగా శ్రద్ధ తీసికొన్నారు. ఆమె తలలో పేలుబడి అసహ్యంగా తల గీరుకొంటుందని మంగలిని పిలిపించారు. కోటయ్య మరో ఇద్దరూ గట్టిగా కదలకుండ పట్టుకొన్నారు. మంగలి ఆమె పొడుగాటి కురుల నన్నిటినీ తుడిచి పారేసి మరింత వికృతంగా తయారు చేశాడు. పిచ్చిగా పెరిగిన గోళ్ళ నన్నిటినీ శుభ్రం చేశాడు.

ప్రసవ దినాలు సమీపించేసరికి ఆమెలో పూర్తిగా విస్పత్తువ ఆవహించింది. పరుగెత్తటం ఆగిపోయింది పిచ్చిగా నవ్వటం కూడ చాల వరకూ తగ్గిపోయింది కానీ ఏడవటం మాత్రం ఎక్కువై పోయింది. ఎదుటి వ్యక్తి గుండెలను కలచివేసేలా ఆమె గంటల తరబడి ఏడుస్తూండేది. కాళ్ళు నీరుబట్టి ఇంతింతలావున దుంగల్లా తయారయ్యాయి అమ్మలక్కలు పెదవి విరిచారు.

ఒక నాటి ఉదయాన కోటయ్య యథాప్రకారం ఆ పిచ్చి మనిషి యోగక్షేమాలు విచారించటం కోసమై సత్రం దగ్గరికెళ్ళాడు. తడిక తొలగించి లోపలికి చూశాడు.

(ఇంకా వుంది)



# వారఫలం

### 25 8-1967 శుక్రవారం మొదలు 31 8-1967 గురువారం వరకు.

**మేషం** ఇదివరకు మీ కార్యక్రమాల్లో యేర్పడిన అవరోధాలు తొలగి పోతాయి వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి ఆర్థిక వ్యవహారాలు వారం మధ్యలో బాగా ఉంటాయి సాంఘిక వ్యవహారాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది రాజకీయ వ్యవహారాల్లో మీ ప్రయత్నాలు ఫలించగలవు

స్త్రీలకు— కుటుంబవ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి దైవకార్యాలు నెరవేరతాయి

**వృషభం** ఏపనైనా చేయడం కంటే వూరుకోవడమే మంచిదనే పరిస్థితి యేర్పడుతుంది సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది వారం మధ్యలో అనుకూల పరిస్థితి యేర్పడుతుంది ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది వ్యాపారంలో ప్రయోజనం గల వ్యక్తులను కల్పుకొంటారు

స్త్రీలకు—ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది అధిక వ్యయం జరుగుతుంది

**మిథునం** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరతాయి సమయానికి యేదో ఒకవిధంగా డబ్బు చేతికి వస్తుంది వారం మధ్యలో ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది ఉద్యోగంలో మెప్పుకు రాని కార్యభారాన్ని వహిస్తారు రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాల సంచలనం పెరుగుతుంది

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు

**కర్కాటకం** మీ మంచితనమే కొన్ని వ్యవహారాల్లో అనుకూలతను సాధించగలరు వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్పుకొంటారు సాహసముతో కూడిన వ్యవహారాలు వారంమధ్యలో లాభిస్తాయి విద్యా వైజ్ఞానిక రంగల్లో మీ కృషి రాణించగలదు వారాంతంలో అధిక వ్యయం జరుగుతుంది

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది బంధుమిత్రులను కల్పుకొంటారు

**సింహం** వృత్తి వ్యాపారాల్లో అనుకూలమైన మార్పులు వస్తాయి రావలసిన డబ్బు సమయానికి అందుతుంది ప్రయాణాలు లాభదాయకంగా ఉంటాయి ఉద్యోగంలో అధికారుల ఆదరాభిమానాలను పొందగలరు స్థిరాస్థి వ్యవహారాల్లో మీ ప్రయత్నాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి సంతోషకరమైన వార్తలను వింటారు.

**కన్య** వారం ప్రారంభంలోనే వృత్తి వ్యాపారాల్లో చికాకులు యేర్పడిన తరువాత సర్దుకొంటాయి వ్యాపారంలో ప్రయోజనం లేని శ్రమకు గురికాగలరు రావలసిన డబ్బు సమయానికి అందుంతుంది అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరతాయి మిత్రులకు సహాయం చేస్తారు

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉండదు వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**తుల:** కొన్ని వ్యవహారాలు సులువుగా నెరవేరినా మరికొన్నింటిలో శ్రమ పొందవలసి వస్తుంది. వృత్తిలో పోటీవారితో పోటీ పెరుగుతుంది. దూర ప్రయాణాలు వాయిదా వేయడం మంచిది. ఉద్యోగంలో ఇతరుల మీద ఆధారపడడం తగదు. రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి అధిక వ్యయం జరుగుతుంది.

**వృశ్చికం** వృత్తి వ్యాపారాల్లో మీరు అనుకొనేది ఒకటి జరిగేది మరొకటి కావచ్చును ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు సాంఘిక వ్యవహారాల్లో ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి వారాంతంలో సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది ఆందోళన కలుగుతుంది

స్త్రీలకు— ఆరోగ్యం బాగానే ఉంటుంది ఆడంబరం కోసం వ్యయం చేస్తారు

**ధనుస్సు:** ఇప్పుడు మీరు జరిపే వ్యవహారాలవల్ల మున్ముందు కూడా తగిన ఉపయోగం ఉంటుంది సాహసముతో కూడిన వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి ప్రయాణాలు కొంచెం శ్రమమీద ఫలిస్తాయి సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది పోటీ వారితో మాటపట్టింపులు తగవు

స్త్రీలకు— కుటుంబకార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరతాయి విలాస వస్తువులు కొంటారు

**మకరం** సామాన్యమైన పనులకు కూడా విశేషమైన ప్రయత్నం చేయవలసి వస్తుంది. వారం మధ్యలో వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. అధికారుల వలన జరుగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరతాయి రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాల సంచలనం పెరుగుతుంది అధికవ్యయం జరుగుతుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి

**కుంభం** వ్యాపారంలో పోటీవారి పోటీ యెదుర్కొని అనుకూలతను సాధించగలరు వృత్తిలో అనుకూల వార్తలను వింటారు ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు విద్యావైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణించగలదు. మిత్రులకు సహాయం చేస్తారు

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది దైవ కార్యాలు నెరవేరతాయి.

**మీనం** భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు అనుకూలంగా ఉంటాయి రావలసిన డబ్బు సమయానికి అందుతుంది సాహసముతో కూడిన వ్యవహారాలు వారం మధ్యలో లాభించగలవు రాజకీయ వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది ఉద్యోగంలో గౌరవ ప్రాబల్యాలు బాగా ఉంటాయి.

స్త్రీలకు— ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. బంధువులకు సహాయం చేస్తారు

—మహేష్ ●

### ఒకవారం విపరీతం

# పులిగా మారిన పిల్లి!

మీరట్‌లో యీ నెల నాలుగో తేదీన ఒక చోట తమ యింటిని దోచుకోడానికి వచ్చిన ఏడుగురు బందిపోట్లలో ఒకణ్ణి ఆ యింటివాళ్ళే చంపేశారు మిగతా ఆరుగురూ ప్రాణభీతితో పారిపోయారు 'పిల్లి—పులి' అవడం అంటే యిదే గాబోలు !!

* * *

బొంబాయికి నలభై మైళ్ళ దూరంలో దొంగ బంగారం డెబ్బయిమూడు లక్షల ఖరీదు చేసేది పట్టుకున్నారు. 33 పౌ బిస్కట్ల రూపంలో ఆ బంగారమంతా వుందట. కర్నూలులో 'బోల్టున్నాయి జాగ్రత్త' అని రాసున్న పెట్టెని అనుమానంకొద్దీ పగలకొట్టి చూస్తే తొంభైమూడు రిస్టువాచీలు దొరికాయని 'ఆ శాఖ' వారు ప్రకటించారు గయలో ఏడో తేదీన ఆహారధాన్యాలను అన్యాయంగా దాస్తున్నందుకు తొమ్మండుగురు కోటీశ్వరులను అరెస్టు చేయబోతే వారు పరారీ అయ్యారనీ, పన్నెండు గిడ్డంగుల్లోనూ కలిసి ఏడు వేల మణుగుల ఆహారధాన్యాలు దొరికాయనీ అన్నారు

## క్యూలో కూలిపోయాడు !

కలకత్తాలోనూ, కేరళలోని త్రివేంద్రంలోనూ ఆహారధాన్యాలు కావాలో అని చేసే గోలలు శ్రుతి మించి రాగాన్నిపడి, లాఠీచార్జీలు వరకు వెళ్ళి ఆపైకి కూడా వెళ్ళబోతున్నాయి అదలా వుండగా మద్రాసులో పూనమల్లి హైరోడ్డు మీదున్న ఓ రేషనుషాపు ముందున్న పొడుగుపాటి క్యూలో నించున్న రాఘవన్ మేస్త్రి అనే వృద్ధుడు బియ్యం రాబట్టుకునేలోగానే ప్రాణాలను పోగొట్టుకున్నాడు దేశంలో ఆహారధాన్యాలకు కొరత, కరువు రాలేదూ, రానేరాదు ఎటొచ్చీ 'అవకాశం'లో డబ్బు చేసుకోడానికి చూసే వ్యాపారులూ, వ్యాపారాలూవల్లే యీ యిబ్బందులు.

* * *

మొన్న ఏడో తేదీన షిల్లాంగ్‌లో 'నార్త్‌ఈస్ట్ ఫ్రాంటియర్' కి చెందిన ప్యాసింజరుబండిలో ఓ ప్రమాదకరమైన బాంబును పట్టుకున్నారు. అదే పేలిగనుకుంటే నడుస్తున్న రైలు ఎగిరిపోయేదే!

## చమటలో చావు ...

టోక్యోలో డెభ్భయ్యారేళ్ళ జపాను వ్యవసాయదారుడు మండు టెండలో నడుస్తూ చనిపోయాడు. ఎండ వేడికి చమట వచ్చి, ఆ చమట ఎండకు మరిగి, వచ్చిన ఆవిరివల్ల వుడికి అతను చనిపోయాడని డాక్టర న్నారు—ఇది వింతయినా కటిక నిజం

* * *

న్యూయార్క్‌లో ఓ వ్యక్తికి హృదయంలో ఒక అర సెకండుపాటే ఆవుదూడ హృదయంలో ఆ రకం అర తీసి అతనికి అతికించి డాక్టర్లు ప్రాణదానం చేశారు

## అసలు గొంతుక పోయిన అల్లా ఉద్దీన్ !

న్యూఢిల్లీలో మురాజవుద్దీన్ అనే అతను నాలుగేళ్ళుగా గడుపుతున్న భగ్న జీవితం యిక గడపలేక చటుక్కున హైడ్రోక్లోరికామ్లము తాగేశాడట. దాంతో గొంతు — గొంతు నాళము అన్నీ కాలిపోయాయి. కానీ, డాక్టర్లు నేర్పుగా, ఓర్పుగా కష్టతరమైన యిరవై అయిదు రకాల ఆపరేషన్లు చేసి, అతన్ని బ్రతికించడమే గాక, కాలిపోయిన నాళానికి బదులు కృత్రిమ నాళాన్ని వేసి విజయాన్ని సాధించారు. సెభాష్—మన డాక్టర్లు విదేశీ డాక్టర్లకు తీసిపోరు. చచ్చి బ్రతికిన ఆ వుద్దీన్ సింపుల్‌గా 'అయామ్ హేపీ' అన్నాట్ట!

* * *



"ఏవండోయ్! మిమ్మల్నెవళ్ళు ఎక్కడెక్కి వచ్చారండీ??"

ప్రకృతి కూడా ప్రజలమీద కినుక వహించింది. కచ్ జిల్లాలోనూ, ఢిల్లీలోనూ అతివృష్టి ఫలితంగా యిళ్ళు, పాకలు కొన్ని వేలు కొట్టుకుపోయాయి మహానది, వైనగంగా, నర్మద, గంగ, యమున మొదలైన నదులు విజృంభించి తీవ్ర నష్టాల్ని చేశాయి కృష్ణా గోదావరీనదులేం చేయనున్నాయో !

## ప్రాణం మిగిలె - కాలు విరిగె

బ్రతుకుదాం, బ్రతికి బట్ట కడదాం అని ప్రాకులాడేవాళ్ళు రెండూ లేక ఛస్తుంటే— 'ఛస్తాం, చచ్చితీరుతాం' అనే పాట వేరే వుంది. 'చచ్చి తీరుతాను' అని ఓ నలభై అయిదేళ్ళ యువకుడు ఆరో అంతస్తు ఎక్కి దూకబోయే సరికి పోలీసులు క్రింద వల పట్టి 'వద్దు బాబూ' అని బ్రతిమాలారు అతను ఏమైనా దూకి తీరుతానని, లాఘవంగా ఆ వలలో పడకుండా ఎగిరి రోడ్డుకు అవతల పక్కనున్న మరో మేడ మీదకు దూకి కాలు విరక్కొట్టుకున్నాడట

మణిలాలో మరొకడు జూలై యిరవైయో తేదీన ఓ కొబ్బరి చెట్టెక్కి చచ్చేదాకా దిగనని మారాం చేశాట్ట 'దిగు బాబూ' అని పోలీసులూ మిగతా శ్రేయోభిలాషులూ చెప్పినా 'చచ్చినా దిగను' అన్నాట్ట అతని కూతురు చాదలో ఆహారం పెడితే తాడుతో లాక్కుని, చెట్టుమీదే తింటున్నాడట !

## వార్నిష్‌తో వైకుంఠం

మద్రాసింకా మద్రాసు కాలేదు మొన్న ఒకటో తేదీన కూడా అడయారులో ఓ వంద పాకలు తగలేశారు దీనికంతా తమ గెలుపును ఓర్వలేని ఎదుటిపక్షంవారు చేస్తున్నదేనని మొన్నీ మధ్య మద్రాసు ముఖ్యమంత్రి శ్రీ అన్నాదురై అన్నారు. ఇదిలా వుండగా పోయినాదివారం సంఘటన చరిత్రలో భయంకరమైన చరిత్రను సృష్టించింది. 'ఆడి అమావాస్య' పండగ చేసుకుని ఏటాలాగనే వార్నిషు త్రాగారు ఇది మద్రాసులోనూ, చుట్టుపక్కల ప్రాంతాల్లోనూ కూడా జరిగింది కానైతే యీ సారి ఆ వార్నీషు మృత్యువుగా మారింది. మద్రాసంతా భీభత్సంగా తయారయ్యింది చావుల లెక్క ప్రభుత్వపు అంచనా ప్రకారం మాట ముప్ఫయిఏడు తేలింది అయితే యిన్నిట్లోనూ, ఆసుపత్రికి వచ్చే మధ్యమార్గంలోనూ, ఆస్పత్రులులేని వూళ్ళలోనూ చనిపోయినవారి సంఖ్య ఎంత?— ఏమో!! ఇన్నిచూస్తె చావులసంఖ్య వందలుదాటి 'వేలు' సమీపిస్తుందా! అయినా ఇన్నివూళ్ళలో వార్నిషు ఒకేసారి విషంగా మారడంలో మర్మం ఏమిటి—

—పొలాక్షుడు ●

## చిత్రలహరి



'స్త్రీ జన్మ'లో ఎల్. విజయలక్ష్మి.

# ఆదుర్తి ప్రయోగాత్మక చిత్రం "సుడిగుండాలు" ఆగస్టు 15న ప్రారంభం!

'అ+అ=చక్రవర్తి చిత్ర'అని వేస్తున్నపుడు 'కరెక్ట్' అన్నారు ఆదుర్తి సుబ్బారావుగారు అ—అక్కినేని, అ—ఆదుర్తి చేతులు కలిపారు ఆ కలయిక ఫలితంగా ఉద్భవించినదే 'చక్రవర్తి చిత్ర' అదే యీ సూత్రం లో అ అ ల అపూర్వకలయికతో మిత్రద్వయం—

అక్కినేని, ఆదుర్తి కలిసి నెలకొల్పిన చిత్రనిర్మాణ సంస్థ చక్రవర్తి చిత్ర కార్యరంగంలోకి అడుగు పెడుతున్నది ఆగస్టు 15 న హైదరాబాద్‌లోని శ్రీ సారథీ స్టూడియోలో యీ కొత్త సంస్థ చిత్రం షూటింగ్ ప్రారంభమవుతుంది ఇటీవల శ్రీ ఆదుర్తి సుబ్బారావుగారిని బాబా మూవీస్ కార్యాలయంలో కలిసినపుడు ఆయన యీ చిత్రం వివరాలను వెల్లడి చేశారు.

### పిల్లల చిత్రం సుడిగుండాలు

'ఈ చిత్రానికి 'సుడిగుండాలు'అని పేరు పెట్టాం ఇది పిల్లల చిత్రం ఎదిగే పిల్లలు తమ జీవితాల్లో ఎన్నో సుడిగుండాలను ఎదుర్కోవలసివుంటుంది అందులో వాళ్లు కొట్టుకుపోకుండా వుండాలంటే పెద్దవాళ్లు ఏంచెయ్యాలి? అన్న విషయాన్ని సమగ్రంగా చర్చిస్తుంది చిత్రం ఇందులో పిల్లలకోసం ఎల్లలతోపాటు పెద్దలూ నటిస్తారు

'నాగేశ్వరరావు తప్ప యిందులో పేరున్న తారలెవరూ ఉండరు 'లేత మనసులు' తారలూ, ఇంకా హైదరాబాద్‌కు చెందిన కొందరు కొత్తవాళ్లూ ఉంటారు ఒక 15 ఏళ్ళ అమ్మాయినీ, 16 ఏళ్ల అబ్బాయినీ హైదరాబాద్‌వాళ్లని యీ చిత్రంలోని ముఖ్యభూమికలద్వారా పరిచయం చేస్తున్నాము' అన్నారు, ఆదుర్తి

### నో రొమాన్స్, నో డ్యూయెట్స్

'సుడిగుండాలు' చిత్రంలో విశేషాంశాల గురించి చెప్పమని కోరగా 'ఇందులో రొమాన్స్ ఉండదు. బహుశా పాటలు కూడా



లక్ష్మీనివాసం లో కృష్ణ, వాణిశ్రీ

ఉండకపోవచ్చు ఉన్నా ఏ ఒక్కపాటో— థీమ్‌సాంగ్‌లాంటిది ఉంటుంది దానికిమించి యుగళగీతాలూ, ప్రేమకలాపాలూ వుండవు ఇది ప్రయోగాత్మక చిత్రం! డిసెంబరు నాటికి నిర్మాణం పూర్తిచెయ్యాలని అనుకుంటున్నాము' అంటూ చెప్పారు ఆదుర్తి.

నేపాల్‌కి చెందిన బి యస్ థాపా యీ చిత్రానికి కథను సమకూర్చారు ఆ కథను ఏ సుబ్బారావు, కె విశ్వనాథ్ (డైరెక్టర్) సినిమా అనుకరణ చేశారు యస్. ఆర్. నంది సంభాషణలు రాస్తు-



'పుణ్యవతి' లో జ్యోతిలక్ష్మి, హరనాథ్.

న్నారు. కళ: జి. వి. సుబ్బారావు, కెమెరా: కె. యస్. రామకృష్ణారావు, దర్శకత్వం: ఆదుర్తి సుబ్బారావు నిర్వహించే యీ 'సుడిగుండాలు' చిత్రానికి నిర్మాతలు: అక్కినేని, ఆదుర్తి.

### బాబా మూవీస్ చిత్రం-అక్టోబరులో

'బాబా మూవీస్ చిత్రం ఎప్పుడు ప్రారంభిస్తారు?' అని అడిగిన ప్రశ్నకు విశాల నేత్రాలు లేటయ్యేటట్టుంది. దానికి ముందు ఒక చిన్నసబ్జెక్టును తీసుకుని అక్టోబరులో మొదలుపెడతాం!' అంటూచెప్పారు ఆదుర్తి. ఆయన దర్శకత్వంలో తయారవుతున్న అజంతా ఆర్ట్సువారి హిందీ వర్ణచిత్రం 'మన్ కా మీత్' అయిదు రీళ్లు పూర్తి అయినట్లు కూడా చెప్పారు

* * *



'భామావిజయం'లో
ఎన్.టి. రామారావు, దేవిక

## ఎప్పుడూ వర్షమే!

'హైదరాబాద్ విశేషా లేమిటి' అని అడిగాను, కిందటివారం శ్రీ విజయ భట్ మూవీస్‌వారి సాంఘికచిత్రం సెట్స్‌మీద జయలలితను కలిసినపుడు ఆమె పి ఏ పి వారి చిత్రం షూటింగ్ నిమిత్తం హైదరాబాద్ వెళ్లి యిటీవలే వచ్చింది. 'వెళ్లిం దగ్గర్నుంచీ ఒకటే వర్షం. విడిచిపెట్టకుండా పట్టుకుంది. అంతకు ముందు చిత్రం ప్రారంభించేప్పుడు ఒకరోజు వెళ్లాను. అపుడూ వర్షమే! ఆ వర్షంలో యిక విశేషాలేం చెప్పను? . అలా ధారాపాతంగా వర్షం కురుస్తూండటమే ఒక విశేషం!' అన్నది జయలలిత నవ్వుతూ. 'ఆ షెడ్యూల్‌లో యిన్‌డోర్‌తోపాటు మాతో ఒక పాట అవుట్‌డోర్‌లో పిక్చరైజ్ చెయ్యవలసివుంది ఈ వర్షాల మూలకంగా పాట చిత్రీకరించటం జరగలేదు' అన్నదామె తిరిగి.

* * *

'బొంబాయినుంచి నాలుగురోజు లయింది వచ్చి' అన్నారు, తిలక్. తన స్వంత సంస్థ 'అనుపమ' బేనర్‌మీద 'ముద్దుబిడ్డ' చిత్రాన్ని మొదట తీశారు ఆ చిత్రాన్ని యిపుడాయన హిందీలో తీస్తున్నారు. తెలుగు చిత్రంలో నటించిన జమునే యిందులోనూ నాయిక రాజేష్‌ఖన్నా, నిరూపరాయ్ యితర ముఖ్య పాత్రధారులు. ఈ చిత్రం తాలూకు ఒక పాట రికార్డింగ్ చేయించటానికి తిలక్ బొంబాయి వెళ్లి—తిరిగి వచ్చాక యిదే చూడటం. లతా పాడిన ఒక పాట రికార్డింగు చేయటం జరిగిందనీ, సెప్టెంబరు నుంచి మద్రాసులో షూటింగ్ ఆరంభించగలమనీ చెప్పారు తిలక్. ప్రస్తుతం ఆయన శ్రీ శంభూ ఫిలిమ్స్ వారు నిర్మిస్తున్న సాంఘిక చిత్రానికి దర్శకత్వం వహిస్తున్నారు.

* * *

బెంగాలీ చిత్రం 'మమత' ను తెలుగులో పునర్నిర్మించటానికి భరణీవారు హక్కులు తీసుకున్నారని పరిశ్రమలో సర్వత్రా వినిపిస్తోంది గత వారం భరణీ స్టూడియోలో రామకృష్ణ గార్ని కలిసినపుడు యీ విషయం గురించి ప్రస్తావించాను 'ఈ వార్త నేనూ విన్నాను కాని, అది పూర్తిగా నిరాధారమైనది మమత హక్కులు మేము కొనలేదు' అన్నారు, భరణీ అధినేత రామకృష్ణ. 'కొత్త చిత్రం ఏదయినా మొదలు పెడుతున్నారా?' అని అడిగాను. 'సబ్జెక్టు చూస్తున్నాం అయినా యిప్పట్లో వుండదు. వచ్చే యేడాది .. జనవరి ప్రాంతాల్లో వుంటుంది' అని చెప్పారు.

## తెలుగువారికి నాటకరంగంపై ఆసక్తి ఉన్నట్లు కన్పించదు!

'తమిళదేశంలో వలె — తెలుగులో నాటకాలకు సరియైన ఆదరణ లభించటంలేదు, ఎందుకని?' అని యీ మధ్య శ్రీమతి జానకిని అడిగితే 'నాటక కళపట్ల మనవాళ్లకు ఆసక్తి ఉన్నట్లు లేదు' అంటూ మూడు కారణాలను పేర్కొన్నారామె. 'ఒకటి. స్టేజి క్రాఫ్ట్, రెండు సబ్జెక్ట్స్, మూడు ఆడియన్స్‌తో డైరెక్ట్ కాంటాక్ట్ — ఈ మూడూ మన నాటకాల్లోగల ముఖ్యమైన లోపాలు. స్టేజ్ క్రాఫ్ట్ బాగుండి, వైవిధ్యం గల చక్కని యితివృత్తాలను ఎన్నుకొని ప్రేక్షకులతో ప్రత్యక్ష సంబంధాలను ఏర్పరచుకొన్ననాడు మన నాటకాలకీ తగిన ఆదరణ లభిస్తుంది.' అన్నారు. జానకి యిపుడు రెండు తెలుగు చిత్రాల్లో నటిస్తున్నారు. ఆ రెండూ సాంఘికాలే ఒకటి మధు పిక్చర్స్ వారిది మరొకటి జెమినీ వారిది మధు పిక్చర్స్ షూటింగ్‌లో పాల్గొనేందుకు ఆమె గత నెల 31 న హైదరాబాద్ వెళ్లారు. తిరిగి యీ నెల 16 న మద్రాసు వస్తారు.

—మోహన్‌కుమార్

## సినిమా డైరీ

● నిండు మనసులు చిత్రం ఆంధ్ర అంతటా విడుదలయింది.

● బొంబాయి చలనచిత్ర వాణిజ్య ప్రముఖుడు, పంపిణీదారుడుఅయిన శ్రీ తారాచంద్ బార్‌జాత్యా — ప్రస్తుతం హిందీలో తయారుచేస్తున్న 'తక్‌దీర్' చిత్రాన్ని ఆరు యితర భారతీయ భాషలలోకి అనువదించ సంకల్పించారు తెలుగు, తమిళ ప్రతుల అనువాద కార్యక్రమాలు యీవారం ప్రారంభించారు

● 'శంకర్‌కీ నాకూ ఏవిధమయిన అభిప్రాయభేదాలు రాలేదు మేమిద్దరం ఎపుడూ ఒకటే!' అన్నారు సంగీతదర్శకుల జంటలో ఒకరయిన జైకిషన్ — బొంబాయి వారపత్రిక ప్రతినిధితో

● నటుడు ఏ వి సుబ్బారావు (సీనియర్) ఆగస్టు 13 మధ్యాహ్నం గుండెపోటుతో మద్రాసులో మరణించారు

● శివాజీ గణేశన్ తమ కొత్త తమిళనాటకం 'వియత్‌నామ్ వీడు' రెండు ప్రదర్శనలు మద్రాసులో యిచ్చారు

● మాస్కోలో ఒక సాయంకాలంపూట డిపార్ట్‌మెంటల్ స్టోర్‌కి షర్మిల షాపింగ్‌కి వెళ్తే—అక్కడ రష్యన్ ఆడపిల్లలు ఆమెను గుర్తుపట్టి గుంపులు గుంపులుగావచ్చి, ఆటోగ్రాఫ్‌లు యిచ్చేంతదాకా వదిలిపెట్టలేదని ఆమె ఒక యింటర్వ్యూలో చెప్పారు.

● హైదరాబాద్‌లోని శ్రీ సారథీ స్టూడియోలో చక్రవర్తి చిత్రవారి 'సుడిగుండాలు' మొదలుపెట్టారు.

● మహిళాదర్శకురాలు అరుంధతీదేవి దర్శకత్వం వహించిన 'ఛుటి' బెంగాలీ చిత్రం గోల్డెన్ జూబిలీ చేసుకుంది. ఆ చిత్రం ఎడింబర్గ్ చలన చిత్రోత్సవానికి పంపబడింది ఇందులో పాల్గొనేందుకు అరుంధతీదేవి లండన్ వెళ్లారు

## మెదడుకి మేత

(36 వ పేజీ తరువాయి)

### జవాబులు

(క) ఆ గద్ద రోజుకి 500 మైళ్ళ్లు పశ్చిమంగా ప్రయాణం చేస్తోంది. కనుక 25 వేల మైళ్ళ్లు భూమి చుట్టూ తిరిగి రావడానికి 50 రోజులు పడుతుందని మీ సమాధానమైతే అది తప్పు. భూప్రదక్షిణం చేయడంలో ఒక రోజు కలిసి వస్తుందన్న భగోళ విషయం దృష్టికి తెచ్చుకోండి. కనుక 49 రోజులే పట్టినట్లు లెక్క!

* * *

(చ) ఈ క్రింది పద్ధతిలో 13 సార్లలో ఆ నలుగురూ కిందికి దిగి రాగలుగుతారు. అంతవరకూ మంటలు వారి గదిదాకా రాలేదని అశిద్దాం

1. పాపని దింపాలి.'
2. కుక్కని దింపాలి. పాప పైకి వెడుతుంది
3. మగవాడు దిగుతాడు. కుక్క పైకి.
4. పాపని దింపాలి
5. కుక్కని దింపాలి. పాప పైకి.
6. పాపని దింపాలి
7. ఆమె దిగుతుంది. మిగిలిన ముగ్గురూ పైకి.
8. పాపని దింపాలి.
9. కుక్కని దింపాలి. పాప పైకి.
10. పాపని దింపాలి
11. మగవాడు దిగుతాడు. కుక్క పైకి.
12. కుక్కని దింపాలి. పాప పైకి.
13. పాపని దింపాలి. ●

Edited, Printed and Published by S Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.

# జలుబులు, ఫ్లూలా ?



## 2 అనాసిన్ చప్పున తగ్గిస్తుంది

జలుబులు మీకు చాలా కష్టం కలిగించవచ్చు. ముక్కునుండి ఒకటే నీరు కారుతుంటుంది. తుమ్ములమీద తుమ్ములు వస్తాయి. మీ శరీరమంతా నొప్పితో నలుగుతుంటుంది. మీరు దేనిమీద ధ్యానం నిలుపలేకపోవచ్చు వెంటనే 2 అనాసిన్ తీసుకోండి. ఎంత వేగంగా, 4 విధాలుగ అవి పని చేస్తాయో చూడండి

1. అనాసిన్ జలుబులు, ఫ్లూలవల్ల కలుగు కష్టము నివారిస్తుంది—చప్పున
2. అనాసిన్ అలసటను తీసివేస్తుంది—చప్పున
8. అనాసిన్ ఉదాసీనతను పారద్రోలుతుంది—చప్పున
4. అనాసిన్ నరాల బిగువును వదలిస్తుంది—చప్పున

అందుకు కారణం, డాక్టరిచ్చిన ప్రిస్క్రిప్షనువలె అనాసిన్‌లో ఔషధాలు కలిసి ఉన్నాయి భారతదేశంలో ఇతర బాధోపశమనకారులకన్నా అనాసిన్‌నే ప్రజలు ఎక్కువ వాడుతున్నారంటే అందులో ఆశ్చర్యపడవలసింది యేమిలేదు

ఈసారి జలుబు చేసినవెంటనే అనాసిన్ తీసుకోండి అనాసిన్ తలనొప్పి, పంటినొప్పి, ఒళ్లునొప్పులను కూడా నివారణచేస్తుంది అనాసిన్ దగ్గర ఉంచుకోండి. అనాసిన్ కావాలని పట్టుపట్టండి.

# అనాసిన్

**చాలా మంచిది ఎందుకంటే**

**అది 4 విధాలుగ పనిచేస్తుంది**




Regd. user GEOFFREY MANNERS & CO. LTD.